ఈస్టరు ద్వీపవాసులైన శిల్పుల చెవులు పొడుగ్గా సాగి ఉండేవి; కాబట్టి, వారు సృష్టించిన విగ్రహాల చెవులు కూడా అదేవిధంగా చేశారు. విగ్రహానికి జుట్టు ముడిగా అమర్చటానికి, వారు ప్రత్యేకంగా ఎఱ్ఱరాతినే ఉపయోగించటానికి కారణం తమ జుట్టు ఎఱ్ఱగా ఉండటంచేతనే. విగ్రహాలగడ్డాలు కొనదేలి ముందుకు పొడుచుకొని వచ్చినట్లు కనిపిస్తాయి. ఆ శిల్పులు గడ్డాలు పెంచుకొనేవారు కాబట్టి, విగ్రహాలను ఆ విధంగానే సృష్టించారు. విగ్రహాల ముఖలక్షణాల్లో ఒక ప్రత్యేక శ్వేతజాతి కనుముక్కు తీరు కనిపిస్తుంది. ముక్కు సన్నగా వంపులేకుండా ఉంటుంది. పెదవులు పల్చగా సన్నని అంచుకట్టి నట్లు ఉంటాయి. ఆ శిల్పులు కేవలం మలయాద్వీపకల్పం నుంచి వచ్చిన జాతికే చెందినవారు కాకపోవటమే దీనికి కారణం. విగ్రహాలకు తలలు పెద్దవీ, కాళ్లు చిన్నవీ; చేతులు ముడుచుకొని, పొట్టమీదకు చేరిఉంటాయి. ఇవి ఇల్లాగే నిర్మించటానికి కారణం ఏమిటంటే, పెరూలో కూడా, పెద్దపెద్ద విగ్రహాలను ఇల్లాగే నిర్మించేవారు. అదే సంప్రదాయం ఇక్కడా అవలంబించారు. ఇక్కడి విగ్రహాలకు చేసే అలంకరణం యావత్తూ, ఉదరంచుట్టూ పటకా మాత్రమే. టిటికాకా సరస్సు దగ్గరి కోన్-టికీ శిథిలాల్లో కనిపించిన విగ్రహాలకుకూడా, ఇటువంటిదే పటకా ఉన్నది. ఇది పురాణవర్ణనల ప్రకారం సూర్యదేవుని పటకా. మనం చూచే ఇంద్రధనుస్సే అది. ఒకప్పుడు సూర్యదేవుడు మాంగరేవాలోని ప్రజలయందు ప్రసన్నుడై, తన బిడ్డలైన శ్వేతవర్ణుల్ని అక్కడకు పంపించాడనీ, అప్పుడే అద్భుత మహిమగల తన పటకానికూడా అక్కడకు విసరివేశాడనీ,

మాంగరేవాలో ఒక పురాణకథవల్ల తెలుస్తున్నది. ఒకప్పుడు పెరూదేశంలోనూ, ఈ ద్వీపాల్లోనూ ఉండే ప్రజలు తాము సూర్యపుత్రులమని చెప్పుకొనేవారు.

ఈస్టరుద్వీపం పేరు పటంలో చూడటమే తప్ప, అక్కడి అద్భుతవిషయాలు చూడటానికి వెళ్ళకుండా, తిన్నగా పాలినేషియాకే ప్రయాణంచేస్తున్నా, దీపంచుట్టూ నలుగురమూ కూర్చుని, ఈస్టరు పూర్వచరిత్ర చెప్పుకొని కాలక్షేపం చేసే వాళ్ళము. కాని ఆ ద్వీపంలో తూర్పుదేశాల నాగరకతా, సంస్కృతీ విశేషంగా ఉన్నవి. అసలు దానిపేరే అందుకు తగ్గట్టు ఉన్నది కదా!

ఒకప్పుడు కొందఱు డచ్చివారు ఈస్టరు పండుగనాడు ఆ ద్వీపంలో అడుగుపెట్టటం జరిగింది. అందువల్ల వారు దానికి "ఈస్టరుద్వీపం" అని నామకరణం చేశారు. అయితే డచ్చివారు వెళ్ళటానికి పూర్వం ఆ ద్వీపానికి పేరే లేదా—అంటే, ఒకటేమిటి? చాలా సార్థకనామాలున్నాయి. పాలినేషియన్ భాషలో దీనికి మూడు పేర్లకు తక్కువలేవు.

"టీ-పెటో-టీ హెన్వా" అనేది ఒక పేరు. "ద్వీపాలకు నాభి, లేక కేంద్రం" అని దీని అర్థం. కావ్యపరిభాషలో ఉన్న ఈ పేరు ఇక్కడికి పశ్చిమాన ఉన్న ద్వీపాలకంటె దీనికొక ప్రత్యేకత స్ఫురింపజేస్తున్నది. ఇది పాలినేషియన్లు దీని విశిష్టతకు అనుగుణంగా ఎన్నడో పెట్టినపేరు. ద్వీపానికి తూర్పు భాగంలో "దీర్ఘకర్ణులు" మొట్టమొదట అడుగు పెట్టిన చోటికి దగ్గఱలో అతినిపుణతతో తయారైన శాతిగోళం ఒకటి కనిపిస్తుంది. దీనికి "బంగారుబొడ్డు" అని పేరు. తర్వాత తర్వాత

ద్వీపాని కంతటికీ ఇదే కేంద్రస్థానంగా భావించటంకూడా జరిగింది. ప్రాచీన పాలినేషియన్ కళోపాసకులు ద్వీపానికి తూర్పు తీరాన "బంగారుబొడ్డు" చెక్కి, ఇంకా పశ్చిమాన తమ అధీనంలో ఉన్న నానాద్వీపాలకంటెనూ, పెరూ దేశానికి అత్యంత సన్నిహితంగా ఉన్న ఈ ద్వీపాన్నే ప్రత్యేకాభిమానంతో తమ ద్వీపాలకు నాభిగా ఎంచుకొన్నారు. అందుచేత ఇది సార్థక నామమే. పాలినేసియన్ ప్రజల పురాతన సంప్రదాయాల్నీ, విశ్వాసాల్నీ పరిశీలిస్తే, వారి నూతన ద్వీపాన్వేషణ ఇక్కడి నుంచే ఫలిస్తూ రావటంవల్ల, దీనిని ద్వీపాలకు జన్మస్థానంగా భావించారని తెలుస్తుంది. తరువాత వారు అనేక ద్వీపాలకు వెళ్ళినా, వాటికీ తమ మాతృభూమికీ అనుబంధం కలిగించింది ఈ చిన్న ద్వీపమే. అందువల్లకూడా వారికి దీనిమీద ప్రత్యేకాభిమానం కలిగింది.

"రాపా-న్యూ" అనేది ఈ ద్వీపానికి రెండవ పేరు. "పెద్ద రాపా" అని దీనిఅర్థం. "చిన్నరాపా" అనేదివి ఇంకొకటి ఉన్నది అది ఈ పెద్దరాపాకు పశ్చిమంగా ఎంతోదూరాన ఉన్న ఇంత ద్వీపమే. ఆనాటిప్రజలు తమకు మొట్టమొదట కనిపించిన ద్వీపాన్ని "పెద్ద రాపా" అనీ అటుతర్వాత కనిపించిన వాటిని అవి మొదటిద్వీపంకంటె చిన్నవి కాకపోయినా, "చిన్న రాపా" అనికానీ, "క్రొత్త రాపా" అనికానీ పేర్కొనేవారు. "చిన్న రాపా"లో నివసిస్తున్న ప్రాచీనులు తమ పూర్వులు "పెద్దరాపా"నుంచి వచ్చారనీ, అది తమ ద్వీపానికి తూర్పుగానూ, అమెరికాకు అత్యంత సన్నిహితంగానూ ఉన్న ఈస్టరు ద్వీపమే అనీ అంటూరు ఇందువల్ల తూర్పుదేశాలనుంచి ఇక్క-

డికి ప్రజలు వలసవచ్చారనే విషయం మరింత స్పష్టమౌతున్నదిగదా!

దీని మూడవపేరూ చిట్టచివరి పేరూకూడా "మాతా-కిటే-రాణి" "స్వర్గంవైపుచూచే కన్ను" అని దీనిఅర్థం. "తహితీ, మార్క్వెసాస్, హవాయీ మొదలైన మహాపర్వతమయ భూభాగాలతో పోల్చిచూస్తే, ఎక్కడా అంతఎత్తు కనిపించని ఈ ద్వీపానికి ఈపేరు ఎల్లా చెల్లుతుంది?" అని, దీనిని చూచీ చూడకముందే సందేహం కలుగుతుంది. పాలినేషియాభాషలో రాణి, స్వర్గం అనేవి అనేకార్థాలున్న మాటలు. అది వారి పూర్వుల మాతృభూమి. సూర్యదేవుని అనుగ్రహానికి పాత్రమైన పవిత్రభూమి. "టికీ"కి ఒకప్పుడు రాజధానిగాఉన్న గిరిదుర్గం అసంఖ్యాకాలుగాఉన్న ద్వీపాలన్నింటికీ తూర్పున మొట్టమొదట కనిపించేది కావటంవల్ల పాలినేషియన్లు దీనికి ఈ "స్వర్గంవైపు చూచేకన్ను" అనే పేరుపెట్టటం సముచితమే.

అండెస్‌లో కోన్-టికీ నగర శిథిలాలకు దిగువనున్న ఒక ప్రదేశానికి కూడా "మాతా-కిటే-రాణి"వలెనే ధ్వనించే పెరూవియన్ పేరు ఉన్నది. అది పసిఫిక్ సముద్రతీరాన ఈ ఈస్టరుద్వీపానికి ఎట్టయెదురుగా ఉన్నది. ఈ రెండుపేర్లూ ఒకే విధంగా ఉండటానికి, ఏమైనా కారణం ఉన్నదేమో; అనిపిస్తుంది.

నావమీద ఆరుబయట కూర్చున్నప్పుడు ఈస్టర్ ద్వీపాన్ని గురించిన ప్రసంగాలతోనే కాలం గడచిపోయేది. ఆ అద్భుతకథల్లో మేముకూడా కొన్ని పాత్రలమైనట్లుగా భావించుకొని, ఆనందించేవాళ్ళం. "టికీ" నాటినుంచీకూడా, మేము

నూతనప్రదేశాల్ని అన్వేషించటం తప్ప మరోపని లేకుండా, సముద్రంమీద తిరుగుతూనే ఉన్నట్టు భావించుకొనేవాళ్లం.

ఇప్పుడు సముద్రమూ అలలూ కన్పిస్తూనేఉన్నా వాటిని గురించిన ఆలోచన ఒక్కటీ వచ్చేదికాదు. వాటినిగురించి ఆలోచించవలసినదేమున్నది ? అవి మాకు సుపరిచితాలే. నావ మీద ఉండగా వాటికీ మాకూ కల పొత్తు ఎటువంటిదో కూడా తెలుసు. సొరచేపకూడా అనుదిన దృశ్యమానం అయినది. దాని చరిత్ర మాకు సువిదితమే. అది కేవలం మేము కూర్చున్నచోటికి అడుగునుంచి పోతూఉన్నా, ఈటకోసం చూచేవాళ్ళం కాము. అసలు కూర్చున్నచోటినుండి కదలటమే లేదు. అంత నిర్భయంగా ఉండటమే కాకుండా, ఒకొక్కప్పుడు దాని తోకపట్టుకొని నావమీదకు ఈడ్చేవాళ్లము కూడాను అది పాపం బలంకొద్దీ గింజుకొనేది. రానురాను సొరచేపతో బలాబలాల పరీక్షకు "త్రాటియుద్ధం" త్రాడు లేకుండానే ఆడటం అలవాటయింది. మాకు మొదటనుంచీ ఉన్న ఆందోళనకానీ, ఆవేశంకానీ యిప్పుడు లేవు. ఏ పని చేసినా సులువుగానూ, వినూతనమార్గంలోనూ చేస్తున్నాము. 'బేడిస'చేపలను అవలీలగా పట్టుకొంటున్నాము. అవి అన్నీ తినాలంటే మాతరం కాదు. అయితే అన్నింటిని పట్టుకోవటం దేనికి ? బేడిసలకూ మాకూ కొంతసేపు కాలక్షేపంకోసమే. 'ఇందులో క్రొత్తదనం ఏమిటీ?' అంటే, గాలం లేకుండా చేపను పట్టటం. ఒక ఎగిరేచేపను దారానికి కట్టి నీటిలో వదిలిపెట్టేసరికి, బేడిసలు అమాంతం దానిమీదికి ఉరికేవి. ఇంతలో మేము దారాన్ని లాగివేసేవాళ్ళము. అప్పుడు

బేడిసలకూ మాకూ పోరాటం సిద్ధం. ఒక బేడిస తప్పుకొంటే మరొకటి వచ్చి ఆ స్థానంలో నిలిచేది. ఇల్లా కొంతసేపు వినోదించిన తర్వాత ఎగిరేచేప పూర్తిగా బేడిసలపాలయ్యేది.

సొరచేపలతోనూ ఇదే ఆట సాగించాము. ఒక మత్స్యఖండమో, పనికిమాలినవస్తు సంచయమో త్రాటిచివర కట్టి నీళ్ళలో పడవేసే వాళ్ళము. అలవాటు ప్రకారం ఒక ప్రక్కకు తిరిగి ఈదుకొని రావటానికి బదులుగా, ముట్టె పైకెత్తుకొని, ఆ వస్తువును మ్రింగాలనే ఆతురతతో సొరచేప నోరు విశాలం చేసికొంటూ వచ్చేది. అది దగ్గఱకు వచ్చి ఎఱను మ్రింగటానికి సిద్ధంగా ఉన్న సమయంలో త్రాడు లాగివేసేవాళ్ళం. ఇల్లా ఎన్నిపర్యాయాలు వంచించినా, పాపం! ఆ సొరచేప నోరు ఆడిస్తూనే ఉండేది కానీ, అవతలకు పోయేదికాదు. దానిని బుద్ధిహీనత అనే అనాలో, ఆశావాదిత్వం అనే అనాలో మాకు బోధపడలేదు. చివఱకు అది రొట్టెముక్కకోసం ప్రాధేయపడుతున్న పెంపుడుకుక్కలాగా, నీటినుంచి నావ అంచుకు తలఎత్తి, దాని ముట్టెకు పైగా ఉన్నసంచిని అందుకోటానికి యత్నించేది కూడాను. ఆ దృశ్యంచూస్తే జంతు ప్రదర్శనశాలలో మేతఅందుకొనే నీటిగుఱ్ఱం జ్ఞాపకానికివచ్చేది. జూలైనెల చివఱలో ఒకరోజున సముద్రయానం ఆరంభించి మూడు నెలలు గడచిన తర్వాత దినచర్య పుస్తకంలో ఇల్లా వ్రాసికొన్నాము:

"రోజూ మావెంటబడే సొరచేపతో చెలిమిచేసికొన్నాము. భోజనసమయంలో ఆ ముక్కల్నీ ఆ ముక్కల్నీ ప్రోగుచేసి దాని వివృతవదనంలో పడవేశాము. అది మా

వెనుక వస్తూఉంటే, భయంకరంగా ఉన్నప్పటికీ, సాధువుగా మాటుతున్న పెంపుడు కుక్కలాగా ఉండేది సొరచేప నోటిలో మనం చిక్కేంతకాలం అది మాడ ముచ్చటగానే ఉంటుంది. ఆమాట కాదనటానికి వీలులేదు. ఒక్క స్నానం చేసేటప్పుడు తప్ప, మిగిలిన సమయాలలో అది మా వెంట వస్తూ ఉంటే ఏదో వినోదంగానే ఉండేది "

ఒకరోజున మామూలుగా మేము సొరచేపలకు వేసే ఎఱను ఒక త్రాటికి కట్టి, ఆ త్రాడు ఒక వెదురు కఱ్ఱకు బిగించి ఉంచాము. కఱ్ఱ మా చేతిలో ఉండేదీ; ఎఱ సొరచేప పట్టుకోవలసిందికదా! ఇంతలో ఒక కెరటంవచ్చి ఈ మా సాధనం తుడిచిపెట్టుకొని పోయింది. మేము విస్మయంతో చూచాము. కొంతసేపటికి మాకు వెనుక సుమారు రెండు వందల గజాలదూరాన మా వెదురుకఱ్ఱ కొట్టుకొని రావటం కనబడింది. అకస్మాత్తుగా అది నీళ్ళమీద నిలబడి వరుగెత్తు కొని వస్తోంది. 'చూడగా చూడగా, ఈ వాసం అనాయాసంగా వచ్చి, తన ఆవాసంలో నిక్కి నిలబడేట్టున్నదే!' అనుకొన్నాము. అది మాకు చేరువ అయ్యేసరికి చూస్తే, దాని అడుగున వది అడుగుల పొడుగైన సొరచేప కనిపించింది. దానిపైన ఉన్న ఈ వెదురుకఱ్ఱ పెరిస్కోపు అనే దూరదర్శినీ యంత్రమేమో అనిపించింది. చేవ సంచి నయితే మ్రింగిందికానీ, త్రాడు కొఱకలేదు. మేము వింతపడి చూస్తూఉండగానే, చేప ముందుకు సాగిపోయింది.

మేముగనుక మొదటినుంచీ పరీక్షగా చూస్తూ వచ్చి ఉంటే, సన్ననికత్తులలాగా ఉన్న ఆ సొరచేపకోఱలు అయి

దాలుపసుసలు మాకు బాగా కనిపించి ఉండేవి. ఇక నిద్రపోయినా కలలోకూడా అవే కనిపిస్తూ ఉండేవి.

ఒకరోజున నట్‌తోపాటు ఒక సొరచేప ఈదుతున్నది. అతను దానిని గమనించలేదు. అప్పటినుంచీ నావకు దూరంగా పోయి ఈదరాదని కట్టడి చేసికొన్నాము. మేము ఈతలో పర ఏశులపకాతూఉంటే, నావ పురోగమనంలో అవశ్యమై దూరం కావచ్చును. లేదా ఏ సొరచేపఅయినా ప్రాణాంతకం కావచ్చును. అయితే ఒకరోజున సముద్రంలో ఏ ప్రాణికూడా, అంటే ప్రాణాంతకమైనది, సంచరిస్తున్న జాడ కనబడలేదు. అంతకుముందే మాతోవస్తున్న సొరచేపల నన్నింటినిపట్టి నావ పార్శ్వాన పడవేశాము. అందువల్ల సముద్రస్నానానికి అనుమతి లభించింది అయితే ఒక్కొక్కటంటే ఒక్కొక్క మునక వేసి రావాలి. అంతకంటె ఎక్కువసేపు ఉండటానికి వీలు లేదు నట్ తత్క్షణం సముద్రంలో దూకివెళ్ళాడు. అతను తిరిగివస్తూఉంటే, నౌకా స్తంభంపైన ఉన్న మాకు నీటిలో అతనినీడకంటె పొడుగయిన నీడ ఇంకొకటి కనబడ్డది. ఆనీడ అతనిని అనుసరిస్తున్నది. మేము ఆందోళనతో కేకలువేశాము. నట్ తొందరగానే నావ సమీపించి పైకి రాబోతున్నాడు. అయితే ఆ ఛాయకూడా అతని కంటె లోతున ఈదుతూవచ్చి అతన్ని కలుసుకొన్నది అతను నావ ఎక్కుతూఉంటే ఆ నీడకూడా పైకివచ్చింది. అది ఒక సొరచేప. దాని పొడుగు ఆఱడుగులు. అది అతని పొట్టక్రింద నుంచే పైకివచ్చి, మళ్ళీ ఎందుచేతనో దిగజారి నావప్రక్కనే ఆగిపోయింది. మా మిత్రుణ్ణి మ్రింగనందుకు కృతజ్ఞతా సూచకంగా మేము దానికి ఒక బేడిసతల బహూకరించాము.

సాధారణంగా సొరచేపకు ఏదైనా కనబడినప్పటికంటె ఆ పదార్థంవాసనే ఆకలి పుట్టిస్తుందంటారు. ఇది ఎంతవఱకు నిజమో తెలుసుకోటానికి మేము నావఅంచున కూర్చుని కాళ్లు నీళ్ళల్లో పెట్టేవాళ్లము. అంతలో సొరచేప వచ్చేది. కాళ్లు పైకి తీసికోగానే అది వృష్ఠాన్ని మావైపు త్రిప్పి ఎటో పోయేది. మేము చేపలను సముద్రంలో కడిగి తీస్తూఉంటేనూ, మఱి ఎందువల్లనైనానూ నీటిలో నెత్తురుజాడ కనిపిస్తే, అంతవఱకూ నీటిఅడుగున ఎక్కడో చెక్కలుమాత్రమే కనిపిస్తూఉండే సొర చేపలు అమాంతం పైకి వచ్చి, నీలకాచ పాత్రల్లాగా అల్లంత దూరాన కాచుకొని ఉండేవి. మా దగ్గఱఉన్న సొరచేపల ప్రేగులు విసరివేస్తే అవి అయోమయంగా వెళ్ళి వాటిని తాకేవి. అవి స్వజాతి కాలేయాన్ని తినేవి. వాటి క్రౌర్యం అటు వంటిది. మేము నీళ్ళలో పాదం పెట్టి తేచాలు; రివ్వునవచ్చిపడేవి. పాదం దొఱకకపోతే అది కనిపించిన చోట నావదూలాల్ని కోఱలతో గ్రుచ్చివేసేవి. సొరచేపలనే వాటికి సొరచేపలున్నాయి; అంటే, అవి స్వశరీరంతప్ప మఱిదేనినీ కనికరించవు. స్వజాతినే చంపుకొని తింటాయి; అని భావం.

చిట్టచివఱికి మేము సొరచేపల తోకలు ఊడదియ్యటం మొదలుపెట్టాము. జంతువులతోకలు ఊడదియ్యటమేమిటి ? ఇదేం సరదా ? అని ఎవరైనా అసహ్యించుకోవచ్చును కాని సొరచేపతోక ఊడదియ్యటంలో ఎంత వినోదం ఉన్నదో తెలిస్తే, అలా అనరు. ఇది కేవలం అనుభవైకవేద్యం, అత్యంతహృద్యం అయిన చోద్యం.

సొరచేప తోక చేతికి చిక్కటంకోసం ముందుగా దానికి

ఏదైనా మేత వెయ్యవలసివచ్చేది. ఆహారంకోసం అది తల పైకి ఎత్తేది. సాధారణంగా దానికి వెయ్యవలసిన ఆహారం ఒక సంచిలో వేసి ఉంచేవాళ్లం. అలా కాకుండా మనం చేతులారా అందిస్తే, అది నోరారా అందుకోవాలనుకొంటే, అది ఆ ఎఱనుమాత్రమే కాకుండా మన చేతుల్నికూడా కబళించి వేస్తుంది. అప్పుడు వినోదం కాస్తా విషాదంగా మారిపోతుంది. కుక్కలకుగానీ, మచ్చికఅయిన ఎలుగుబంట్లకుగానీ ఏదైనా పెట్టబోతే, అవి ఆ భోజ్యాన్ని కోఱలతో కఱచిపట్టి దానిలో కొంతగానీ, సర్వంగానీ లాగుకొని పోతాయి. అటువంటి సమయాల్లో ఒకొక్కప్పుడు మనకు చేతివేళ్ళు గాయపడవచ్చును గదా! కాని వీటికీ సొరచేపలకూ ఉన్న భేదం ఏమిటీ అంటే, ఎఱ మనచేతుల్లో ఉన్నంత వఱకు కుక్కలుగానీ, ఎలుగులుగానీ కొంచెం చనువవుతాయి గానీ, సొరచేప అలా చనువు గాదు. ఎవడైనా ఒక బేడిసను పట్టుకొని నిల్చుంటే, సొరచేప వచ్చి క్షణంలో సగం చేపను కొఱికికొని పోతుంది. మిగతా సగంచేప మాత్రం చేతిలో మిగులుతుంది. ఇక ఆ సొరచేపను పట్టుకోవటం ఏలాగు? మేము ఒక ఉపాయం ప్రయోగించాము. ముందుగా బేడిసను రెండు సమభాగాలుగా నిలువునా చీల్చేవాళ్ళము. ముందు ఒక చీలిక అందించేవాళ్ళం. అదితిన్న సొరచేపకు రెండవది అందిస్తే అది దాన్ని అందుకొని, ఱంపాలవంటి త్రిభుజాకారపు దంతాలతో కఱకఱ నములుతూ వెనుకకు తిరిగేది. అలా తిరిగి, నావ అడుగుకు మెల్లగా చేరుకొంటూఉండేది. ఆసమయంలో దానితోక నీటికి కొంచెంపైగా ఉండటంవల్ల తటాలున పట్టుకోటానికి వీలుకలిగేది. సొరచేప

శరీరం మెఱుగు కాగితంలాగా ముట్టుకొంటే గీచుకొని పోతుంది. ఒక్క తోకదగ్గఱ మాత్రం ఆకఱకుదనం ఉండదు అందుచేత పట్టుకొంటే అక్కడే పట్టుకోవాలి. అటువంటి పట్టు చిక్కితే మాత్రం ఎన్నడూ జాఱవిడిచే వాళ్ళంకాదు. ఆ జంతువు బలం కూడదీసికోవటానికి ముందే మేము ఒక్క ఊపుతో ఇవతలకు ఈడ్చి దూలాలకు కట్టివేసేవాళ్ళం పాపం! ఒకటి రెండు క్షణాలపాటు ఆ మహామీనానికి ఏమీ తోచేది కాదు. తరువాత అది పూర్వకాయాన్ని అటూ ఇటూ చలింపజేస్తూ, తప్పించుకొని పోవటానికి ప్రయత్నం చేసేది. కాని. ఆప్రయత్నంలో దానిబలం యావత్తూ కేంద్రీకరించటానికి వీలులేదు. అసలు దాని మహావేగానికి కారణం ఆ పుచ్ఛం మాత్రమే. దానికి ఇంకా ఱెక్కలు ఉన్నప్పటికీ, అవి నీటిమీద తేలి ఉండటానికీ, ప్రక్కలకు తిరగటానికీ మాత్రమే పనికివస్తాయి. తోకఱెక్క చలనంవల్లనే సొరచేప ఎంతవేగంగానైనా ఈదగలదు. కనుక ముందుగా మాకు తోక చిక్కి ఉండటంవల్ల, విస్మయంతో అది నిరుపాయమూ, పరాజితమూ అయి, కొంతసేపటికి అచేతనమై పడి ఉండేది. అటువంటిస్థితిలో దానిని బాగా ఇవతలకు లాగి వెయ్యటానికి అవకాశం కలిగేది. సాధారణంగా అప్పటికి మేము దానిదీర్ఘ శరీరంలో సుమారు సగంభాగం మాత్రమే పైకిచేర్చి ఉండేవాళ్ళం. అటు తరువాత మిగిలిన సగంకూడా పైకి లాగటానికి ప్రయత్నిస్తూ ఉంటే, తెలివి తెచ్చుకొని అది గింజుకొనేది. తల అటూ ఇటూ త్రిప్పుతూ అతి భయంకరంగా ఎగిరిపడేది. అటువంటి సమయంలో మేము దానిని గట్టిగా తోక దగ్గఱ కట్టివేసి, దూరంగా

వెళ్ళిపోయే వాళ్ళం. దానికి ఏమాత్రం అందుబాటులో ఉన్నా మాప్రాణాలు మావికావు. ఒకటి అదేపనిగా ఎగిరిపడుతూ, వెదురు తడక విఱుగగొట్టుతూ, తోక చివఱ భాగాన్ని విసరి కొట్టుతూ చాలా గల్లంతు చేసేవి. అయితే కఠినాలైన దాని నఖాల్లో నలిగిపోనిది ఉండదేమో! విశాలవదనం భీకరంగా తెఱచి అందినదాన్ని చీల్చి వెయ్యాలని, కోఱలన్నీ బయట పెట్టి, గాలినే కఱుస్తూ ఉండేది. ఒకొక్కప్పుడది కొంతసేపు అటూ ఇటూ ఎగిరిపడి, తరువాత నిస్పృహతో పడి ఉండేది కానీ, సర్వసాధారణంగా మేము దానితోక మొదట ఉచ్చు బిగించేఉన్నా, అది రోషంతోనో, బాధతోనో; చెప్పలేము కానీ, నావ దూలాల్ని కఱచి కఱచి, కోఱలన్నీ విఱిగిన తర్వాతగానీ అదటిపాటు మానేదికాదు.

పొరచేపను చూడగానే, చిలుకలో అపూర్వమైన సంచలనం కలిగింది. అది వేణువుందరంలో నుంచి తుఱ్ఱున ఎగిరి పోయింది. దిక్కూ మొక్కూ కనబడనట్లు అల్లాడుతూ, ఎక్కడ దాగుకోవాలా; అని ఆతురదృక్కులతో నలువైపులూ పరికించిపరికించి, కుటీరాగ్రాన వ్రాలి, ప్రాణాలు దక్కా యనుకొన్నట్లు కనబడింది. కాని, అంతటితో మెదురుగా కూర్చోక, వెన్నుగాడిమీద ఆ చివఱనుంచి ఈ చివఱకూ, ఈ చివఱనుంచి ఆ చివఱకూ తిరుగుతూ, ఱెక్కలు కొట్టుకొట్టుకొన లాడిస్తూ, భయాతిరేకంతో అఱవటం మొదలు పెట్టింది. ఇటీ వలనే దానికికూడా, ఉత్తమ నావిక లోకంలో సభ్యత్వం లభించింది. వెనుకటి రోజుల్లోనైతే కోన్-టికీ మీద ఆఱుగురం మాత్రమే ఉన్నా మనుకొనేవాళ్ళం. కాని యిప్పుడు చిలుక

కూడా మాతోబాటు లెక్కకు వచ్చింది. అందువల్ల మేము ఏడుగురమైనాము. జోహాన్స్‌కూడా మిత్రబృందంలో కలిసినా అతని శరీరంలో చల్లనిరక్తం ప్రవహిస్తున్నది. కాబట్టి, అతనిని ఒకడుగా లెక్కించలేదు. రాత్రిపూట పంజరంలో ఒదిగి వేణుమందిరం దాటకపోయినా, పగలు మాత్రం మా కీరమిత్రం మందిరోపరిభాగాన ఎగురుతూనో, ఏ స్తంభాన్నైనా కఱచిపట్టి ఉయ్యాల లూగుతూనో వ్యాయామ ప్రదర్శనంచేస్తూ ఉండేది. నౌకా స్తంభాన్ని సుదృఢంగా నిలపటానికి కట్టిన మోకులు తీవ్ర మైన గాలి నిరంతరం వీస్తూ ఉండటంవల్ల స్తంభం ఊగిపోతూ ఉండటంనూ, విశేషమైన ఎండలవల్ల వ్యాకోచం కలగటంచేతనూ బిగువు తగ్గిపోయేది. అప్పుడు తిరిగి వాటిని గట్టిగా బిగించవలసి వచ్చేది. స్తంభం చండ్రి కఱ్ఱతో తయారైంది కాబట్టి అది చాలా బరువు. కేవలం ఇనుప కడ్డీలాగానే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు మోకులైనా తెగిపోతాయిగానీ, ఒరిగిన స్తంభం పైకిలేవదేమో అనిపిస్తుంది. మోకులే తెగితే స్తంభం ఎటైనా పడవచ్చు. ఆవైపున ఉన్న మనిషి తల చితికిపోవచ్చు. ఇటువంటి సమయాల్లో మేము మాశక్తి సామర్థ్యాలు యావత్తూ వినియోగించి స్తంభాన్ని సరిగా నిలపటానికి విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చేది. అట్లా మేము నానాపాట్లూపడి మోకులు బిగిస్తూఉంటే, ఈచిలుక పైన కూర్చుండి "లాగండి! లాగండి! హా హ్హా హ్హా హ్హా!" అంటూ విపరీతంగా పరిహాసిస్తూ ఉండేది. ఆ పరిహాసానికి మేముకూడా నవ్వటం మొదలుపెట్టేసరికి, అది వినోదంతో నలువైపులా ఎగురుతూ, మోకులు పట్టుకొని ఊగుతూ ఉండేది.

మొట్టమొదట మా రేడియోవారికి చిలుకతో పెద్దయిబ్బంది కలిగేది. వారు తమ సామగ్రితో ఒకమూల కూర్చుండి, ఓడల్లో భూమీలోని రేడియోవారితో సంభాషిస్తూ వారిమాటలు వినటానికి శబ్దగ్రాహక యంత్రాలు చెవిదగ్గఱ పెట్టుకొని ఉండేవారు. అకస్మాత్తుగా వారికి మాటలు వినిపించేవికావు. వారు విస్మయంతో తమ సాధనాలను పరిశీలించుకొనేవారు. ఎందువల్ల యంత్రం పనిచెయ్యటంలేదో; వారికి తెలిసేదికాదు. చిలుక పాపం తీఱుబడిలేకుండా, ఏరియల్ తీగల్ని కొఱికివేస్తూ ఉండేది. అయితే ఇది మొదటిరోజుల్లో మాత్రమే. అప్పట్లో ఏరియలు బెలూనుతో నౌక పైభాగాన కట్టిఉంచాము. ఒకరోజున చిలుకకు జబ్బుచేసింది. అది రెండురోజులపాటు పంజరంనుంచి బయటికిరాలేదు. ఆహారం ముట్టలేదు. రెట్టవేస్తే తళతళా మెఱిసింది. ఆ మెఱుపు ఎలావచ్చింది? అందులో ఏరియల్ తీగలున్నాయి! అవి కనిపించేసరికి మా మిత్రులకు పశ్చాత్తాపం కలిగింది. అమాయికంగా తీగల్ని కొఱికినందుకు దానిని ఎంత తిట్టుకొన్నాము! దానికే తెలివిఉంటే, ఇల్లా తన ప్రాణంమీదకు తెచ్చుకొనేపని ఎందుకుచేస్తుంది? అని చిలుకమీద జాలిపడ్డాము. చిలుకకూడా తన అవివేకానికి పశ్చాత్తాపపడినట్లే కనిపించింది. అటుతర్వాత అది మా మిత్రులకు బాగా ఆప్తబంధువైనది. అది యంత్రం ఉన్న మూలనేతప్ప నిద్రించేది కాదు.

రెండు నెలలపాటు చిలుకతో మేము హాయిగా కాలక్షేపం చేశాము. ఒకరోజున ఒక పెద్దఅల వచ్చింది. ఆ సమయానికి మా కీరమిత్రం చుక్కాని స్తంభంమీదనుంచి క్రిందికి

వస్తున్నది. అంతే! ఆ తరువాత అది మాకు కనబడలేదు. సముద్రంపాలే అయిందో, మరి ఎక్కడకైనా వెళ్ళిపోయిందో తెలియదు. దానికోసం నావ ఆపటానికికానీ, వెనుకకుపోయి అన్వేషించటానికికానీ వీలులేదుకదా!

చిలుక తప్పిపోయినరాత్రి మాకు ఎవరికీ ఏమీ తోచ లేదు. ఎప్పుడైనా, మనలో మనకుకూడా, ఇలా విడిపోవటం సంభవించవచ్చునేమో, అనుకొన్నాము. రాత్రిపూట కావ లాలో కాలుజారి సముద్రంలోపడితే మాగతీ అంతే; అని మాకు తెలుసు.

అప్పుడు వెనుకటికంటె కట్టుదిట్టాలు ఎక్కువ చేసి కొన్నాము. రాత్రి కావలాలో భద్రతాబంధాలు పెంచు కొన్నాము. మాటిమాటికీ,అందరం ఉన్నామా,లేదా,అని పరీ క్షించుకొంటున్నాము. ఎవరైనా వెంటనే 'ఓ' అనకపోయినా, కనబడకపోయినా, సముద్రంలో పడ్డారేమో; అనుకొని, శోకాలు ప్రారంభిస్తున్నాము. ఒకరికొకరం ధైర్యం చెప్పుకోటం పోయి, భయపడేవాళ్ళనుచూచి మరింత భయపడుతున్నాము. పరిస్థితులు సవ్యంగా ఉండటంవల్ల వెనుకటి రెండునెలల్లోనూ సురక్షితంగా ఉండగలిగామనికూడా మరచి పోతున్నాము. ఒక్కఅడుగు పొరపాటుపడ్డా, ఒక్కపని అనాలోచితంగా చేసినా, మా చిలుకగతే మాకు పట్టుతుంది. ప్రమాదంఅనేది రాత్రిపూటనే జరుగుతుందని నిశ్చయంఏమిటి ? పట్టపగలు జరుగగూడదని ఎక్కడున్నది?

నిస్తంత్రీయంత్రంఉన్న (వైర్ లెస్)మూల చిలుక ఖాళీచేసి పోయింది. కాని ఆ మఱునటిరోజున బాగా ప్రొద్దుఎక్కేసరికి మా

విచారం మఱచిపోయాము. మాకు కొద్దిరోజుల్లోనే కావలసినన్ని సారచేపలు చిక్కాయి. వాటిని కోసినప్పుడు టన్నీ చేపల తలలతోపాటు నల్లగా వంపుతిరిగిన చిలుకముక్కులూ, ఇంకా కొన్ని విచిత్రపదార్థాలూ కనిపించాయి. అయితే బాగా పరిశీలించినప్పుడల్లా, ఆ నల్లనిముక్కులు సారచేప ఉదరంలో జీర్ణమైన స్క్విడ్ చేపల అవయవాలే అని స్పష్టమయేది.

మా నిస్తంత్రీ యంత్రనిర్వాహకు లిద్దఱికీ మొదటినుంచీ కూడా ఆ యంత్రందగ్గఱ తీఱనిపని ఉంటూవచ్చింది. హంబోల్టు ప్రవాహంలో మొట్టమొదటిరోజునే ఒక కెఱటం వచ్చి, వారి సామగ్రియావత్తూ తడిపి వేసింది. అందుచేత వాటిని తైలవస్త్రం (కాన్వాసు)తో కప్పవలసి వచ్చింది. తర్వాత మా చిన్ననావ మీద పెద్దఎత్తున ఏరియల్ అమర్చటం ఎట్లాగా! అనే సమస్య బయలుదేఱింది. ఒక గాలిపటంతో ఏరియల్ని బాగా పైకి పోయేట్టు చేశారుగానీ, ఒక మహాతరంగం ఆ గాలిపటాన్ని తన పొట్టబెట్టుకొన్నది. అప్పుడు మామిత్రులు ఒక రబ్బరుగుమ్మటం ద్వారా మళ్ళీ ఏరియల్ని పైకి పంపించారు. కాని, అదికూడా, ఎండ బాగాతగిలేసరికి, టప్పుమని పగిలిపోయి సముద్రంలోపడ్డది. అటుపైన చిలుకమూలాన ఏరియల్సు చెడిపోతూ వచ్చాయి కదా! దీనికితోడు హంబోల్టుప్రవాహంలో పదిహేనురోజులు గడిచిన తర్వాత నిర్జీవమండలానికి చెందిన అండెన్ ప్రాంతానికి వచ్చాం. ఇక్కడ అసలు వాయుచలనం ఉన్నట్టే కనిపించదు. మూతవేసిన సబ్బుపెట్టెలోని గాలి ఏమాత్రమో, ఇక్కడా అంతే!

కాని, ఒకనాటిరాత్రి టార్‌స్టీను యత్నం ఫలించింది అకస్మాత్తుగా గాలి తెఱ వచ్చింది. అందువల్ల క్రొత్తగా నిస్తంత్రీయంత్రాన్ని అమర్చుకొని, దానిద్వారా స్వీడన్‌లోని ఒకమిత్రునికి వార్త పంపటానికి ప్రయత్నిస్తూఉన్న లాస్ ఏంజిలస్ నివాసికి టార్‌స్టీను పిలుపు వినిపించింది. అతను మా యంత్రం ఎటువంటిదో, అడిగి తెలుసుకొని, సంతృప్తిపడ్డాడు. తర్వాత అతను టార్‌స్టీను ఊరుపేరులూ, అతని తాత్కాలిక నివాసస్థలమూ మొదలైనవి అడిగాడు. టార్‌స్టీన్ వాటి కన్నింటికీ జవాబులు చెప్పేసరికి, వాయుగతి భేదంవల్ల మా యంత్రంలో క్లిక్కు-క్లిక్కు-మనే శబ్దాలు బయలుదేరాయి. కొంతసేపు ఏమాటా వినిపించలేదు కాని, తర్వాత పాపం అవతలివ్యక్తి మళ్ళీ మమ్మల్ని పిలిచి, తన పేరు "హాల్" అనీ, తనభార్య పేరు "అన్నా" అనీ, ఆమె స్వీడన్‌కుటుంబంలో పుట్టిందనీ, మా కుటుంబాలకు మా క్షేమం తెలియబరుస్తాననీ చెప్పాడు.

ఇంత ప్రపంచంలో మా ఉనికీ, కుశలమూ గుర్తించింది లాస్‌ఏంజిలస్‌లోని మహాజనంలో ఒక సామాన్య చలనచిత్ర యంత్రనిర్వాహకుడైన "హాల్" అనే అతను ఒక్కడుమాత్రమే. అతనుకూడా, అంతకుముందు మమ్మల్ని ఎఱిగినవాడు కాదు. మా పరిచితులందఱూ ఉపేక్షించిఉండగా, ఈ అపరిచిత వ్యక్తితో మాకు ఈ అనుబంధం ఏర్పడటానికి కారణం ఏమిటి? ఏమిటీ విచిత్రం! అని మేము చాలా ఆశ్చర్యపడ్డాము. ఆరాత్రి మొదలుకొని, "హాల్" ఉరఫు "హెరాల్డు కెంపెల్" అతని మిత్రుడు "ఫ్రాంక్ క్వేవాస్" ప్రతిరాత్రీ మా నావనుంచి వెళ్లే వార్తలు అందుకొనేవారు. తర్వాత హెర్మన్‌పంపిన సంక్షిప్త

వార్తలకు మధ్య అమెరికా వాతావరణ పరిశీలకసంఘం వారి వద్దనుంచి రెండు టెలిగ్రాములు వచ్చాయి తర్వాత నట్ టాన్ స్టీనులు మరికొంతమంది నిస్తంత్రీ యంత్రసంపన్నులతో కూడా మాట్లాడటం మొదలుపెట్టారు. ఈ శ్రోత్రమిత్రులు గొటోడెన్‌లోని ఎజిల్‌బర్గ్ అనే వ్యక్తిద్వారా నాకేవో శుభాకాంక్షలు అందజేశారు.

కొద్దిరోజులు మాత్రం సముద్రమధ్యంలో నిస్తంత్రీ యంత్రం ఉన్నవైపున సముద్రజలం విశేషంగా తాకుతూ ఉన్నందున ఆయంత్రం అసలే పని చెయ్యలేదు. మా మిత్రులు రాత్రింబగళ్లు ఆ యంత్రాన్ని మరమ్మతు చేస్తూనే ఉన్నారు; కాని ప్రయోజనం కనబడలేదు. మా రేడియో మిత్రులందరూ నావ ఎక్కడో మునిగి పోయిందనుకొన్నారు. కాని ఒకరోజు రాత్రి ఎల్ 1 బి సంకేతం వినిపించింది. మరుక్షణంలో ఒక పెద్దసందడి వినవచ్చింది. ఎన్నో వందలమంది అమెరికన్ల కంఠాలు ధ్వనించాయి. ఒకరి తర్వాత ఒకరు జవాబిచ్చారు. నిస్తంత్రీ యంత్రం ఉన్న చోటికి వెళ్ళితే, అక్కడి తీగవల దగ్గర ఎవరో కూర్చుని ఉన్నారేమో; అనిపించేది. సముద్రోదకంతో ఆ ప్రదేశమంతా నాసినాని ఉండేది. అందుచేత జారిపడకుండా ఉండటంకోసం ఏప్రక్కనైనా చేతులు ఆన్చి, నెమ్మదిగా వెళ్ళవలసి వచ్చేది. అలా వెళ్ళుతూంటే, ఎవరో అకస్మాత్తుగా పట్టుకొన్నట్లు తోచేది. ఇంత దేనికి? యంత్ర సామీప్యంలో పడి ఉన్న చిన్న రబ్బరు ముక్క తియ్యబోయినా, దొంగను పట్టుకొన్నట్లు ఏదో అదృశ్యభూతం మమ్మల్ని పట్టుకొనేది. ఆ అదృశ్యభూతం మరి ఏదో కాదు. విద్యుచ్ఛక్తి! యంత్రం

మీాట ముట్టుకోనీ ముట్టుకొనకముందే, వెనుక నుంచీ, ముందు వేళ్ళలో నుంచీకూడా విద్యుదాఘాతం ప్రసరించేది. యంత్రం సుప్రతిష్ఠితమై ఉండగా అక్కడనుంచి చిన్న పెన్సిలు తీసుకో బోయినా, ఆ పెన్సిలుపై చెక్క నిప్పులు క్రక్కేది. శరీరం అంతా జలదరించటం, నెత్తిమీద రోమ రోమమూా ఒక్కసారి నిట్టనిలువుగా లేచిపోవడం జరిగేవి. టార్స్టీనూ, నట్టూ, చిలుకా మాత్రమే అక్కడ తిరగవచ్చును. తక్కినవాళ్ళం నలుగురమూ వెలిపడ్డవాళ్ళమే. ఆ యంత్రానికి మేము అస్పృశ్యులం అని తోచిందేమో! అందువల్ల మేము మా నలుగురికీ హెచ్చరిక కోసం ఒక అట్టమీద "అపాయం" అని వ్రాసి, ఆ ప్రదేశానికి ముందు కట్టి ఉంచాము.

ఒకనాటిరాత్రి నట్ యంత్రం చేరువనే దీపంముందు కూర్చుని భోజనంచేస్తున్నాడు. మధ్యలో హఠాత్తుగా నాకాలు పట్టుకొని లాగాడు. నేను తెల్లబోయి చూచాను. అతనుచాలా ఉత్సాహంగా కనిపించాడు. "ఒస్లోకు అవతల నివసిస్తున్న "క్రిస్టియన్ అముండ్సెన్" అనే వ్యక్తితో మాటలు సాగించానోయ్!" అన్నాడు. ఇదికొంచెం అద్భుతవిషయమే. మాయంత్ర శక్తి చాలా పరిమితమైనది కాబట్టి, 6 వాట్లకంటె ఎక్కువ పంప లేదు. ఈ సంఘటన జరిగింది ఆగస్టు రెండవ తేదిన. అప్పటికి భూవలయంమీద 60 డిగ్రీలకంటే ఎక్కువే ప్రయాణం చేశాం. ఒస్లో మా ఉనికినిబట్టి చూస్తే భూగోళం అవతలప్రక్క ఉన్నది. హాకన్ రాజుకు ఆ మరునటిరోజుకు 75 సంవత్సరాలు పూర్తి అయినవి. అంటే 76 వ జన్మదినోత్సవం అన్నమాట. మేము నావమీదఉండే, ఆయనకు మా అభినందనలు అందజేశాము.

తర్వాతరోజున క్రిస్టియన్ అముండ్సెన్ మాకు రాజుగారినుంచి జవాబు వినిపించాడు. అందులో మా ప్రయాణం లాభసాటిగా జరగాలనే శుభాకాంక్షకూడా మిళితమై ఉన్నది

మరో చిత్రకథకూడా మేము జ్ఞాపకం పెట్టుకొన్నాము. మా నౌకాయాత్ర జరిగిన మొత్తం కాలంలో అంత ఆశ్చర్యకరవిషయం మరొకటిలేదు. మాదగ్గర రెండు ఛాయాగ్రాహక యంత్రాలు ఉండేవి. ఛాయాచిత్రాలను సుస్పష్టం చెయ్యదగ్గ వస్తుసామగ్రి ఎరిక్కుదగ్గర ఉంది. ఆ సామగ్రివల్ల మేము తీసిన చిత్రాలలో సుస్పష్టం కాని వాటిని బాగుచేసేవాళ్ళం. సొరతిమింగిలం దర్శనం అయిన తర్వాత ఎరిక్కు ఆగలేక పోయాడు. ఒక సాయంకాలం అతను రాసాయనిక ద్రవ్యాలు తగుపాళ్ళలో నీళ్ళలో కలిపి, జాగ్రత్తగానే రెండు కాచఫలకాలు కడిగిచూచాడు. ఆ గాజు పలకలమీదఉన్న చిత్రం చాలాదూరంనుంచి తీసిన ఛాయాచిత్రంలాగా ఉన్నది. దానిలో ఏవో కొన్ని మచ్చలుతప్ప మరేమీ కనిపించలేదు. అప్పుడు మాకు నూతనంగా పరిచితులయిన చిత్రకారులకు ఈసంగతి తెలియజేసి, తగు సలహాలు ఇయ్యవలసిందని అడిగాము.

హాలీవుడ్ లోని ఒక చిత్రకారుడు మా పిలుపు అందుకొని, తత్క్షణం ఆ విషయంమీద పరిశోధనజరిపి, మా చిత్రస్పష్టీకరణ సాధనం ఉన్నచోటు చాలా వేడిప్రదేశమనీ, 60 డిగ్రీలకు పైన నీరు ఉపయోగించరాదనీ, ఉపయోగిస్తే గాజు ఫలకమీది బొమ్మ ముడతలుపడి అలికివేసినట్లు అవుతుందనీ చెప్పాడు.

మాకు చాలా సంతోషం కలిగింది. అతనివల్ల మాకు

మంచిగౌరవం ఏర్పడ్డది. మా చుట్టుపట్ల బాగా చల్లగా ఉండే చోటు హంబోల్టు ప్రవాహమే. అయితే అక్కడి ఉష్ణతా ప్రమాణం 50 . 60° పైన నీరు పనికే రాదన్నాడుగా అతను. మజ్జిగ చెయ్యాలి. ఇప్పుడు హెర్మన్ మాకు ఫ్రిజిరేటివు ఇంజనీరైనాడు. నేను అతనితో వేళాకోళంగా "నీటిఉష్ణత 60° లకు తగ్గించవోయ్" అన్నాను. అతను రబ్బరు డింగీని వాయు పూరితంచేస్తూ, అంగారకామ్ల పాత్ర తెమ్మని చెప్పి, నీరుకాచే పాత్రలో ఏమిటోఉంచి, పైన పరుపుచుట్టలు వగైరాలతో మూతవేసి, కొంతసేపు ఏదోగమ్మత్తుచేశాడు. అతని గడ్డం మీద మంచుబిందువులు కనిపించాయి. అంతలోనే అతను ఆ పాత్రలోనుంచి పెద్ద మంచుగడ్డ బయటికితీశాడు.

తర్వాత ఎరిక్కు కొన్ని ఛాయాచిత్రాలను కడిగి చూశాడు. చిత్రాలు చాలా నిష్ప్రష్టంగా కనిపించాయి. కోన్-టికీ నౌకలు తొలిసారి సముద్రయానం చేసినప్పుడు గాలి తేజులు ఆ నావికుల మాటల్ని మూటగట్టుకొనిపోయి, వేల మైళ్ళ దూరాన ఉన్నవారికి వినిపించటం జరుగలేదు. అటు వంటి అదృష్టం మాకు మాత్రమే పట్టింది. కాని పదిహేను వందల సంవత్సరాలక్రిందట సముద్రవీచికలు బాల్సా నావను ఎలా తేలికగా నడిపించుకు వెళ్ళాయో, ఈనాడున్నూ అల్లాగే నడిపించుకొని పోతున్నాయి.

మేము దక్షిణసముద్రద్వీపాలకు చేరువగా వెళ్ళిన తర్వాత, చెదరుగా వానలు పడటంవల్ల వాతావరణం మాటి మాటికీ మారుతూవచ్చింది. వ్యాపారపవనం కూడా మరొక దిక్కుగా వీచటం మొదలుపెట్టింది. అంతకుముందు ఆగ్నేయం

నుంచి వీస్తూ ఉండటంచేత త్వరలో భూమధ్యరేఖకు సమీపాన ఉండే సముద్రప్రవాహాన్ని చేరుకొన్నాము. తరువాత అది తూర్పువైపునుంచి సాగిది. జూన్ పదో తేదీకి మేము 6°19' దక్షిణ అక్షాంశరేఖమీద ఉన్నాము. అంతకంటె ఉత్తరంగా మేము ఎప్పుడూ పోలేదు. ఆ సమయానికి భూమధ్యరేఖకు దగ్గరగా ఉన్నాము. ఆ వ్యాపారపవనం అలాగే సాగినట్లైతే, బాగా ఉత్తరంగాఉన్న మార్క్వెసాస్ ద్వీపాలుకు పైగాపోయి, చిట్టచివరకు భూమి అనేదే కనిపించకుండా సముద్రంపాలైపోతామేమో; అనిపించేదికూడాను. కాని అంతలో వ్యాపారపవనం తూర్పునుంచి, ఆగ్నేయానికి జరిగింది. అందువల్ల ఆ ద్వీప ప్రపంచానికి అడుగుగా ఉన్న అక్షాంశరేఖవైపు మా ప్రయాణం సాగింది.

కొన్నాళ్ళపాటు వ్యాపారపవనంలోనూ, సముద్రంలోనూ ఏ మార్పూ లేకపోవటంవల్ల చుక్కాని పట్టేపంతులు మఱచిపోతూ వచ్చాము. ఒక్క రాత్రిపూటమాత్రం ఇలాటి మఱవు కలిగేదికాదు. ఎందువల్లనంటే అప్పుడు రాత్రికావలా మనిషి ఒక్కడేకదా అక్కడ ఉంటాడు! ఇక అతను మఱచి పోవటం ఎలాగు! ఇటువంటి ప్రశాంతసమయాలలో మేము చుక్కానితెడ్డు త్రాడుతో గట్టిగా బిగించేవాళ్ళం. నావ తిన్నగా సాగిపోతూ ఉండేది. ఆ సమయంలో కావలామనిషికి పని ఏమున్నది! వేణుమందిర ద్వారందగ్గఱ కాళ్లు పాఱజాచుకొని కూర్చొని, నక్షత్రాలు లెక్కపెట్టుతూ ఉండేవాడు. ఎప్పుడైనా ఆ నక్షత్రాల వరుసలో ఏదైనా తేడాగనుక కనిపిస్తే, నావ అభిముఖ్యం మాఱిందని గ్రహించి, ఆ మార్పు చుక్కాని తెడ్డు

కదలికవల్లనే వచ్చిందో, వాయుగతిభేదం వల్లనే వచ్చిందో పరీక్షించటానికి బయలుదేరేవాడు.

వారాల తరబడిగా ఆకాశాన కన్నులుపెట్టుకొని, నావ అభిముఖ్యంలో మార్పు గమనించటం ఎంతసులభమో; చెప్పితే, ఆశ్చర్యపడక మానరు. అసలు రాత్రిపూట చూస్తే మాత్రం ఏమిచూడగలం నక్షత్రాలు తప్ప? ఎక్కడెక్కడ ఏయే వేళల్లో ఏయే నక్షత్రాలు కనిపిస్తాయో, మేము ముందుగానే అంచనా వేసికొన్నాము. భూమధ్యరేఖను సమీపించేసరికి గ్రేట్ బేర్ అనే నక్షత్ర సముదాయం కనిపించింది. మాకు చాలా ఆశ్చర్యం కలిగింది. సాధారణంగా దక్షిణంనుంచి ఉత్తరానికివచ్చేటప్పుడు భూమధ్యరేఖ సమీపించగానే ధ్రువనక్షత్రం ఉజ్జ్వలకాంతితో దర్శనం ఇచ్చేదిగదా! ఇప్పుడు ఎందుచేత కనిపించలేదు? ఏమో! ఈ లోపల ఈశాన్య వ్యాపారపవనాలు బయలుదేరాయి. గ్రేట్ బేర్ అదృశ్యం అయింది.

పూర్వపు పాలినేషియన్లు గొప్ప నావికులు. పగలు సూర్యుణ్ణిబట్టీ రాత్రి నక్షత్రాలనుబట్టీ వారు తమ ఉనికీ, వెళ్లవలసినదిక్కు మొదలైనవి గ్రహించేవారు. వారి ఖగోళవిజ్ఞానం అద్భుతం. భూమిగుండ్రంగా ఉన్నదనేసంగతి మనం కనిపెట్టింది కాదు. అది వారికీ తెలుసు. భూమధ్యరేఖ, ఉత్తరోష్ణమండలం, దక్షిణోష్ణమండలం మొదలైనవాటికి వారు పేర్లుపెట్టారు. హావాజీలో గుండ్రని సొరకాయలమీద సముద్రపటం చిత్రించారు. కొన్నిద్వీపాల్లో వృక్షశాఖలు తడకలాగా అల్లి, వారు చూచిన సముద్రాన్ని దానిమీద చిత్రించారు; అందులో ద్వీపాలున్నచోట గుర్తుగా ఆనపకాయలు అమర్చారు. వీరు

అయిదు గ్రహాలను గుర్తించారు. వీటిని "సంచారనక్షత్రాలు" అనేవారు. మిగిలిననక్షత్రాలు కదలవని భావించి వాటికి "స్థిరనక్షత్రాలు" అని పేరు పెట్టారు. నిపుణుడైన పాలినేషియా నావికుడికి ఆకాశంలో ఏ భాగాన ఏ నక్షత్రాలు ఉదయిస్తాయో. రాత్రులందు ఏసమయంలో ఏవి ఎక్కడఉంటాయో, సంవత్సరంలో ఏభాగాన ఎటుసైపు ఉంటాయో క్షుణ్ణంగా తెలుసు ఏద్వీపాలమీద ఏనక్షత్రాలు ఉచ్చస్థానం అలంకరించేదీకూడా పాలినేషియన్లకు తెలిసిన విషయమే. సంవత్సరాలపర్యంతం ప్రతిరాత్రీ ఒకద్వీపంపైన సరిగా ఆకాశమధ్యాన ప్రకాశిస్తూ ఉండే ఒకనక్షత్రాన్ని గమనించి, వారు ఆ నక్షత్రం పేరే ద్వీపానికి పెట్టినట్లు కొన్నికొన్ని ద్వీపాల పేర్లను పరిశీలిస్తే తెలుస్తుంది.

ఆకాశం తారామండలంతో దేదీప్యమానమౌతూ తూర్పునుంచి పడమరకు తిరుగుతూఉండే లోకోత్తర దిక్సూచి వంటిదనే వాస్తవం తెలియటం అలాఉండగా, తమ శిరస్సులకు పైగా ప్రకాశిస్తూఉండే వేర్వేరు నక్షత్రాలవల్ల తావు ఉత్తరానికిగానీ, దక్షిణానికిగానీ ఎంతదూరం వచ్చిందీ, తెలుసుకోవచ్చునని వారు గ్రహించారు. అమెరికాకు అత్యంత సన్నిహితంగా ఉన్నసముద్రంమీద ప్రయాణించి, తమ అధికారంలోకి తెచ్చుకొన్న ఈ రాజ్యపు లోటిలోనూ పాలినేషియన్లు ఎన్నో తరాలక్రిందనే ఒకద్వీపంనుంచి మరొక ద్వీపానికి రాకపోకలు జరుపుతూ వచ్చారు. "కేవలం ఉత్తరంకానీ, వాయవ్యం కాని కానిదిశగా, సుమారు రెండువేలమైళ్ళ దూరాన ఉన్న హవాయీకి తహితీనుంచి సామంతులు వచ్చినప్పుడు, హవా

అక్షాంశంమీద తాము ఉన్నట్లు నక్షత్రాలవల్ల గుర్తించ గలిగేవఱకూ, చుక్కాని మనుష్యులు సూర్యుణ్ణీ నక్షత్రాలనూ మార్గదర్శకులుగా చేసికొని పడవలు నడపించారు; అటు తర్వాత పశ్చిమానికి సమకోణంగా ప్రయాణం సాగించి, పక్షుల వల్లనూ, మబ్బులవల్లనూ ద్వీపాలు ఎటువైపున ఉన్నదీ గ్రహించి, గమ్యస్థానం చేరుకొన్నారు;" అని చరిత్రవల్ల తెలుస్తున్నది. ఇంత అసామాన్య ఖగోళవిజ్ఞానమూ, అద్భుతమైన నిర్దుష్టమార్గంలో గుణించిన పంచాంగమూ వారికి ఎక్కడి నుంచి లభించాయి? 'పశ్చిమదేశీయులైన మెలనేషియన్లులేక మలయావాసులదగ్గఱనుంచి కాదు' అన్నది ధ్రువం. అమెరికాలో అజ్ టెక్లకూ, మాయాలకూ, ఇంకాలకూ ఆత్మీయసంస్కృతిని సువిదితం చేసిన "సశ్మశ్రు శ్వేతవస్త్రు"లనే ఆ విస్మృత నాగరకజాతివారే, ఆ నాటికి ఐరోపావాసులకు అందుబాటులో లేనే లేని అటువంటి ఉత్తమపంచాంగాన్ని గుణించారు; అటువంటి జ్యోతిర్విజ్ఞానాన్ని గడించారు.

పెరూ దేశంలో మాదిరిగానే పాలినేషియాలోకూడా, ఆకాశంలో కృత్తికానక్షత్ర సముదాయం కనిపించిన మొట్టమొదటిరోజే సంవత్సరాది అయేట్లు పంచాంగం గుణించేవారు. ఈ కృత్తికా కటాక్షంవల్లనే తమ వ్యవసాయం ఫలవంతమౌతుందనే విశ్వాసం ఈ రెండుచోట్లనూ ఉన్నది. పసిఫిక్ సముద్రంవైపు ఖండం వాలిపోవటం మొదలయేచోట పెరూ దేశంలోని ఎడారి ఇసుకలో ఇప్పటికీ అతిపురాతనమైన ఒక శిథిల ఖగోళ పరిశోధనాలయం కనబడుతుంది. అత్యున్నత శిలావిగ్రహాలు సృష్టించి, పిరమిడ్లు నిర్మించిన ఆ అద్భుత నాగ

రకజాతివారే దీనినికూడా నిర్మించారు. చిలగడదుంపలూ, అనపకాయలూ వీరి కృషిఫలితాలు. కృత్తికోదయమే వీరికి సంవత్సరాది. పసిఫిక్ మహాసముద్రంమీద ప్రయాణిస్తూఉన్నప్పుడు, కోన్-టికీ, నక్షత్ర సముదాయాన్ని గుర్తించాడు.

జులై రెండవతేదీన రాత్రి కాపలావంతు వచ్చిన మనిషి నక్షత్రాలను చూస్తూ, హాయిగా కాలక్షేపం చెయ్యటానికి అవకాశం లేకపోయింది. చాలారోజులుగా మమ్మల్ని అనుసరించిన ఈశాన్యపవనం ఇప్పుడు లేదు. అది ఎంతో హాయిగా ఉండేది. మృదువుగా వీచేది. ఇప్పుడు వీచేగాలి అదేపనిగా వెనుకకు నెట్టుతున్నది. సముద్రమా! అంతకంటే ప్రతికూలంగా ఉన్నది. రాత్రి చాలా గడిచిపోయినతర్వాతగానీ వెన్నెల రావటంలేదు. అప్పుడే కానీ అనుకూలవాయువూ కదలటంలేదు. నౌకాముఖభాగానికి ఒక ప్రక్కగా ఒక చిన్నకొయ్య ముక్క సముద్రంలో పడవేసి, దానిని అతిక్రమించడానికి ఎన్ని సెకనులు పట్టేదీ లెక్కవేసి, మా ప్రయాణవేగాన్ని గుర్తించాము. వెనుక మేము నావపార్శ్వాన వినోదప్రసంగాలకు వినియోగించే నిర్ణీతకాలంలో పన్నెండు మొదలు పద్ధెనిమిది తుంపులను దాటిపోయే నావ యిప్పుడు ఆఱుతుంపులను మాత్రమే దాటగలుగుతున్నది. నావ వెనుకభాగంలో శీతలమైన ప్రకాశం ఒకటి విడువకుండా వస్తూనే ఉన్నది.

అ సమయంలో వేణుమందిరంలో నలుగురు గుఱ్ఱుపెట్టుతున్నారు. టార్ స్టీను మోర్స్‌కీ ముందు కూర్చుని క్లిక్కు-క్లిక్కు-మనిపిస్తున్నాడు. నేను చుక్కాని కనిపెట్టుకొనిఉన్నాను. నా వెనుక ఒక అసాధారణ తరంగం కదలివస్తున్న సవ్వడి విన

వచ్చింది. తల త్రిప్పిచూచాను. ఒకటికాదు; మూడు అలలు ఒకదాని నొకటి తఱుముకొని వస్తున్నాయి. ఎల్లాగైనా వాటికి ప్రక్కగా తొలగిపోకపోతే, నేటితో మనపని సరి! అను కొన్నాను. వెంటనే గొంతెత్తి మా మిత్రులను హెచ్చరించాను. ఈ లోపల ఆ మహాతరంగం రానే వచ్చింది. నావ సరిగా దాని నోట్లో ఉన్నది. మఱుసటిక్షణంలో తరంగంమీద నావ తేలిపోయింది. మూలుగుతున్నట్లు రొదచేస్తూ, కెఱటం మాకు అడుగున పడిపోయింది. నావ ఇఱుప్రక్కలా చిక్కని నురుగుతెట్టెలు చిన్నకొండలలాగా తేలివచ్చాయి. ఎల్లాగైతే నేమి? కెఱటం గతించిన తర్వాత కోన్-టికీ యథాప్రకారంగా ముందుకు సాగింది. ఇంతలో రెండవకెఱటం తయారు! మళ్ళీ కథ మొదటికి వచ్చింది. దీనిలోనుంచి తెప్పరిల్లుకొనేసరికి భూతంలాగా మూడోతరంగం సిద్ధం. మొత్తంమీద ఈ వీచి కాత్రయంతో మా ఈమణత్రయం అణగిపోయింది. మా నౌక శోకదేవతలాగా, పురోగమనానికి స్వస్తిచెప్పి, ప్రక్కత్రోవ పట్టింది. "భయంలేదు తల్లీ!" అని బుజ్జగించి, యథాపూర్వంగా నడిపించటం నావల్ల కాలేదు. నేను ఊపిరి బిగబట్టి, దగ్గఱలోనే ఉన్న ఒకవాసాన్ని కౌగిలించుకొని, ఎగిరిపడుతున్న నావమీదనుంచి సముద్రంలో ఎగిరిపడకుండా జాగ్రత్తపడ్డాను. ఒక్క తెప్పపాటుకాలంలో మళ్ళీ పరిస్థితి కొంత చక్కబడింది.

మూడోతరంగం వచ్చినప్పుడు నిస్తంత్రీయంత్రం ముందు కూర్చున్న టార్స్టీను శీర్షాసనం వేసినట్లైపోయాడు. గుఱ్ఱుపెట్టుతున్న అన్నయ్యలు నలుగురూ త్రుళ్ళిపడి లేచారు.

నావ ముఖభాగానఉన్న వెదురుతడక కొస్తా ఊడిపోయి, అల్లల్లాడుతున్నది. జలావగాహనసాధనమైన మా పెద్దగంప పూర్తిగా అణగారిపోయింది. అంతకన్న మరేమీ అపాయం జరుగలేదు. 'ఈ వీచికాత్రయం ఎక్కడనుంచి విచ్చేసిఉంటుంది?' అని ఆలోచిస్తే, మాకు జవాబు తోచనే లేదు. సమాధానం స్ఫురించటం మాత్రం ఎలాగు? ఇక్కడి సముద్రం అంతా ఇంతే! ఎక్కడనుంచి అయినా, ఏ వేళలో అయినా, ఎన్ని పెద్ద వీచికలయినా బయలుదేఱవచ్చును. దీని నైజం ఇటువంటిది.

రెండురోజులు గడిచాయి. ఇంతలో ఒక తుపాను బయలుదేరింది. మా ఇన్నాళ్ళ ప్రయాణంలో తుపాను రావటం ఇదే ప్రథమం. వ్యాపారపవనం పూర్తిగా అంతరించటంచేత పుట్టిన తుపానువల్ల, అంతవఱకూ మాతోపాటు కలసివస్తున్న హంసజొక్కలవంటి మబ్బులు అకస్మాత్తుగా కాటుక నలుపు మబ్బుల దాడిలో వీగిపోయాయి. గాలి ఎటునుంచి వీస్తున్నదోకూడా తెలిసికోటానికి వీలులేకుండా, అనేక దిశలనుంచి ఒకేమాటు వరుగెత్తుకు రావటం సాగించింది. ఇక చుక్కాని పట్టటం ఎవరితరం? ఇదిగో! గాలి ఇటు వీస్తున్నదని, తెఱచాపను దానికి తగినట్లు త్రిప్పి ఉంచేసరికి, మఱొక గాలిగాడు వచ్చి నావనూ నావికులనూ ఎగురగొట్టటానికి సిద్ధపడేవాడు. అయితే కొంతసేపటికి ఈ తీవ్రత తగ్గిపోయింది. నూతన వాయువు తిన్నగా వీచటం మొదలుపెట్టింది. నీల మేఘాలు గిరగిర తిరిగిపోయాయి. యథార్థమైన గాలివాన ప్రారంభమైంది.

కొద్దిక్షణాల్లో మా నావచుట్టూ అలలు బయలుదేరాయి. అలలు నీటిమట్టానికి పది హేను అడుగులు ఎత్తుగా పొంగివస్తుంటే, వాటిపైనుంచి ఎగిరిపడుతున్న నీళ్ళు ఇంకా ఇరవై-ఇరవైఅయిదు అడుగుల ఎత్తువాకాపోతూ, మేము అలల నడుమ ఉండగా, మా చుక్కాని స్తంభం కొనతో సమానమైన ఎత్తులో కనిపించాయి. గాలి వేణుమందిర కుడ్యాలను ఎగురగొట్టటానికి సిద్ధంగా ఉన్నది. అప్పుడు మాకు గత్యంతరం ఏమున్నది? బయట నిలబడితే ఎగిరిపోతాము, లోపలఉంటే వేణుమందిరం మామీద పడవచ్చును. చేసేదేమీలేక. నౌకాపార్శ్వాన సాష్టాంగపడి ఉండవలసివచ్చింది. నిస్తంత్రీయంత్రం తడిసిపోకుండా, దానిమీద తైలవస్త్రం (కాన్వాసు) కప్పిఉంచాము. మాసామగ్రి యావత్తూ భద్రంగా మూటలుగట్టి, నావ దూలాలకు బిగించి వేశాము. తెఱచాప దించివేసి, వేణుమందిరంచుట్టూ కట్టాము. ఆకాశం మేఘాచ్ఛన్నం కావటంతోనే సముద్రం అతినీలమైంది. ఈ అతినీల జలాలు పొంగివస్తూఉంటే, వాటిఅంచులమీద తెల్లనినురుగు చేసుకొనిఉండి, అంతప్రళయంలోనూ ఒక వింతఅందం ఒలుకబోస్తున్నది. సుదీర్ఘ వీచికలమీద రేఖామాత్రాలుగా కనిపిస్తున్న నురుగుజాడలు, గాలికి వృద్ధసముద్రుని వెన్నుబ్రద్దలై, మెల్లమెల్లగా మానుపట్టినమీదట కనిపిస్తున్న మచ్చలులాగా ఉన్నవి ఉవ్వెత్తుగావస్తూఉండి, అంతలో చెదిరిపోయిన కెఱటాలమధ్య నురుగులు చిమ్ముతూ, మాసికలుమాసికలుగా కనిపిస్తున్న నీలజలభాగాలు గాయాలలాగా ఉన్నవి. తరంగ శిఖరాలు సుదూరంవెళ్ళినా, చిందిపడుతూ ఉండే నీటిజల్లు

సముద్రంమీద లవణవర్షం కురుస్తున్నట్లున్నది. కటికి ఉప్పు నీళ్లు ఎడతెగకుండా వర్షిస్తూఉంటే ఎంతసేపు సహించగలం? అయితే కొంతసేపటికి మాకు తుపానువంక చూస్తూఉంటే వినోదంగా ఉన్నదికానీ, భయం తోచలేదు. మానౌక ఎటువంటి అపాయానికీ గురికాకుండా పురోగమిస్తున్నది. ఇక భయం దేనికి? మాచుట్టూఉన్న జలరాశిమీద, ఎంతజలధారవచ్చి పడుతున్నా, మానావమీద ఏకొంచెం నీరుకూడా నిలవటం లేదు. అటువంటి స్థితిలో మా సాగరవాతావరణం గిరివాతావరణంలాగా భాసించింది అత్యున్నతమైన పర్వతశిఖరంమీద ఎంతవానకురిసినా, ఎప్పటికప్పుడు ఆరిపోతూనే ఉంటుంది. చుట్టుపట్ల కొంతవరకు బోసిపోయినట్లు కనబడుతూ ఉంటుంది. ఇక్కడా అదేవిధంగా ఉన్నది. ఇంతేగాక మేము ఉన్నది భూమికి దిగువభాగంలో అయినప్పటికీ, కొన్-టికీ కెరటాల మీదనుంచి దుముకుతూ పోవటంవల్ల, మాకు మంచుప్రవాహాలూ పాషాణాలమీదుగా, పర్వతశిఖరంనుంచి క్రిందికి దూకి పోతున్నట్లున్నది.

ఆ విషమపరిస్థితుల్లో చుక్కానిపట్టే మనిషి ఎంత మాత్రమూ ఏమరటానికి వీలులేదు. నావ ఒక కెరటంమీద నుంచి క్రిందికి దిగుతూఉంటే, దానివెనుక సగభాగం పైకిలేచేది. మళ్ళీ ముఖభాగం రెండవఅలను అధిగమించేటప్పుడు అది తత్క్షణం క్రిందికివచ్చేది. మొదటిఅల నౌకాముఖభాగం విడిచి వెళ్ళీ వెళ్ళకముందే, వెనుకనుంచి రెండవఅల వచ్చిపడేవి. సాంద్రమైన నీటి కెరటాలు అతిదారుణంగా వచ్చి తాకుతూఉంటే, కొంచెం పల్చనైన బురదవచ్చి తాకుతున్నట్లున్నది కానీ,

కేవలం నీటిదెబ్బ అనిపించటంలేదు. ఆ బురద నావమీదనే నిల బడితే, మా అవస్థ ఎల్లాఉండేదో! పాపం! దాని అబ్బపుణ్యాన అది ఎప్పటికప్పుడు జల్లెడలోనుంచి పోయినట్లు నావ దుంగల మధ్యనుంచి సముద్రంలోపలికి పోతున్నది.

సాధారణ సమయాలలో, సముద్రం ప్రశాంతతను విడిచి పెట్టని వేళలలో, మళ్ళీ పెద్దఅల ఒకటి పుట్టిందంటే, మళ్ళీ ఏడు సెకనులకుగాని అటువంటి అల వచ్చేదికాదు. రోజు మొత్తం మీద 200 టన్నులనీరు నావమీద పడుతూఉండేది. అయితే ఎప్పటిప్రవాహం అప్పుడే అదృశ్యంఅవుతూ ఉండటంవల్ల మా అంచనా నూటికి నూటపాళ్ళూ నిర్దుష్టమేఅనటానికి వీలులేదు; గుటికి బెత్తెడుఎడంగా సరిపోవచ్చును. తుపాను తీవ్రంగా ఉన్న ప్పుడు పదివేలటన్నులకు పైగా నీరు వచ్చిపడేది. అయిదేసి సెకనులకు కొన్నిగాలన్లుతేడాగా రెండో, లేక మూడో ఘనపు గజాలనీరు నావమీద ప్రవహించేది. ఒక్కొకసారి చుక్కాని వద్దనున్న మనిషికి మోకాళ్ళబంటిగా నీరు ప్రవహించేది. ఆ సమ యంలో అతను ఒక సెలయేట్లో ఎదురు ఈదుకొని వస్తున్నట్లు కనిపించేవాడు. ఆ సమయంలో నౌకయావత్తూ గజగజలాడు తున్నట్లు కనిపించేది. కాని అంతలోనే ఆ భారం సమస్తమూ అంతరించి, నౌకకు రెండవప్రక్క తలఎత్తికొని వెళ్ళిపోతూ ఉండేది.

హెర్మన్ వాయుపీడన పరిశీలకయంత్రంతో గాలి ఒత్తి డిని తెలుసుకోవటానికి ఎప్పుడూ బయటనే తిరుగుతూ ఉండే వాడు. ఒక్కొక్కసారి రోజురోజంతా గాలి ఒకేబిగువున వీచేది. తర్వాత చెదురుగా వానలు వస్తూఉండటం, వాయు

గతిలో మార్పురావటం జరిగేది. సముద్రంమీద నిరంతరంగా వర్షించే జలధారలతో సర్వత్ర పొటమరిస్తూ, అంతరిస్తున్న బుద్బుదస్వరూపాలతో, సాగరంఅంతా సలసల మరుగుతున్నట్లుండేది. ఇంతలో ఒక వ్యాపారపవనం మమ్మల్ని పశ్చిమాభిముఖంగా నడిపింది. నావపార్శ్వాన ప్రవహించిపోయే కెరటాల ఒత్తిడిలో, నిర్దుష్టంగా వాయుపీడన పరిమాణాన్ని గుర్తించటానికి వీలులేక, హెర్మన్ తెఱచాప స్తంభంమీదికి చేరుకొంటూ వచ్చాడుకానీ, అది ఊగిసలాడుతూ ఉండటంవల్ల చేసేదేమీలేక, వాయుపీడనం తాను గుర్తించటం ఎల్లాఉన్నా, తనశక్తి వాయువు పరీక్షిస్తున్నట్లుండటం వల్ల, స్తంభాన్ని గట్టిగా పట్టుకొని, అనుకూల పరిస్థితులకోసం ప్రతీక్షించవలసి వచ్చేది.

తుపాను శాంతించేటప్పటికి, మా చుట్టూఉండే మహామీనాలు ఆగ్రహావిష్టాలైనట్లు కనిపించాయి. సొరచేపలు, ట్యూనీలు, బేడిసలు, బనిటోలు లెక్కించటానికి వీలులేకుండా వచ్చిపడ్డాయి. ఈ నానాజాతి మీనసమితి మా నౌకచుట్టూ పరివేష్టించి ఉండేసరికి, ఎందుచేతనో ఆ దృశ్యం అంత మనోరంజకం కాలేదు. కొద్దిక్షణాల్లోనే చావు బ్రతుకులమధ్య సంకులసమరం సాగింది. నీటిలో నిలువంపుగా తేలివున్న చేపల పృష్ఠభాగాలు తారాజువ్వల్లాగా దూసికొనిపోతున్నాయి. ఒకదానిని ఒకటి వేటాడుతున్నాయి. కొన్నినిమిషాల్లో శ్యామల సాగరంలో రక్తచ్ఛాయలు కొట్టవచ్చినట్లు కనిపించాయి. ముఖ్యంగా యుద్ధం జరుగుతున్నది ట్యూనీలు బేడిసల మధ్యనే. బేడిసలు గుంపులుగుంపులుగా కూడివచ్చి, అసాధారణ వేగంతో

అపూర్వ చాకచక్యంతో వీరవిహారం చేస్తున్నాయి. టన్నీలు 150, 200 పౌన్ల బరువుంటాయి. కయ్యానికి కాలు దువ్వినవి కూడా అవే. ఆత్మరక్షణకోసం వాటిని ప్రతిఘటించాయి బేడిసలు. ఒకవైపున బలగర్వమూ, రెండోవైపున ఆత్మాభిమానమూ పరాక్రమ హేతువులయి, ఏపక్షమూ ఓటమిని సహించలేని స్థితిలో ఉండటంచేత రణం దారుణమైంది. బలాధికాలైన టన్నీలు బేడిసల రక్తసిక్త శిరస్సులు నోటగఱచుకొని దుమికి పోతున్నాయి. ఒక్కొక్కచోట ఏ బేడిస అయినా రోషావేశంతో ముందువెనుకలు చూడకుండా టన్నీలమీద ఒంటరిగానే పరాక్రమిస్తూఉన్నా, తోడిబేడిసలు దానిని అలా వెళ్ళనివ్వటంలేదు. కంఠం సగం తెగిపోయినవైనాసరే! దానితోకూడా వెళ్ళి, శత్రువుల్ని ఎదుర్కొంటువ్నాయి. అప్పుడప్పుడు సొరచేపలుకూడా మహారౌద్రంతో రణరంగంలో అవతరిస్తున్నాయి. పెద్దపెద్ద టన్నీలను చీల్చి చెండాడుతున్నాయి. ఇక టన్నీలు ఇటు బేడిసలతో అటు సొరచేపలతోకూడా ఏకధాటిగా పోరాడుతూనే ఉన్నాయి. అయితే సొరచేపలముందు టన్నీలబలం నిలవటంలేదు.

అల్పప్రాణులైన చుక్కాని చేపలకు ఆలనా పాలనా లేదు. అవి కంటికి కనిపించీ కనిపించనంతలో టన్నీలు వాటిని గుటకాయస్వాహా చేస్తున్నాయి. అందువల్ల ఆ దుర్బలజీవులు మా నౌక దూలాలసందుల్లో దూఱి, ఆత్మరక్షణ చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాయి. అందుకు అవకాశంలేనివి తమశక్తి సర్వమూ పలాయనంలోనే వినియోగిస్తున్నాయి. మాకు ఆ

సమయంలో సముద్రం అంటే కంగారు పుట్టింది. నౌక క్రిందికి తొంగిచూచిన పాపాన పోలేదు.

ఒకసారి హఠాత్తుగా నేను భయకంపితుణ్ణైనాను. ఏదో విద్యుదాఘాతం తగిలినట్లు అనకుణ్ణైపోయాను. తర్వాత నా పిఱికితనానికి నేనే సిగ్గుపడ్డాను. వెకిలినవ్వు నవ్వటంకంటె మతేమీ చెయ్యలేకపోయాను. జరిగిన విషయం ఇది : నౌకా స్తంభాన్ని నలువైపులా బిగించిఉంచిన మోకుల్లో ఒకటి కొంచెం వదులైనట్లుంటే, చూడటానికి వెళ్ళి, మోకు పట్టుకొని లాగుతున్నాను. అంతలో నాకు అకస్మాత్తుగా ఒకదెబ్బ తగిలింది. అప్పుడప్పుడు సముద్రుడు వీచికాహస్తాలతో మమ్మల్ని వెన్ను చరుస్తూఉండటం పరిపాటేకానీ, ఈ దెబ్బ నీటిదెబ్బ లాగా లేదు. భగ్గున మంటపెట్టినట్లైంది. నేను అప్పుడు నౌక వెనుకవైపున ఉన్నాను. నీటిలోనుంచి సొరచేప తలలాగా ఉన్న పదార్థం ఒకటి రివ్వునవచ్చి, నన్ను దేనితోనో పొడిచి పోయింది. అది సొరచేప అనే నా భ్రాంతి! ఆ మహామీనం నా కాళ్ళు పట్టుకొని లాగుతున్నదనుకొని, గిలగిల తన్నుకోటం మొదలుపెట్టాను. చుక్కాని స్తంభంమీద ఉన్న హెర్మన్ నన్ను చూచి ఫకఫకనవ్వాడు. "ఒక టన్నీ చేప ఎగిరిపోతూ నిన్ను తాకుకొన్నదోయ్! అంతేకాని మతేమీలేదు. అనవసరంగా కంగారుపడకు," అన్నాడు. క్రింద చూచాను. సొరచేపా లేదు, గిరచేపా లేదు. నలుగురూ నన్నుచూచి నవ్వుతూఉంటే నేను కూడా నవ్వాను. అంతకంటె చెయ్యగలిగిందేమున్నది? తర్వాత హెర్మనూ, అతని తర్వాత టార్‌స్టీనూ చుక్కాని

దగ్గర కావలం ఉండే సమయాలలో అదే చేప నౌకమీదకు దూకటానికి యత్నించింది. కాని, రెండుసార్లూ అది నావ అంచునపడి, నీళ్ళలోపలికి జారిపోయింది. అందువల్ల మేము దానిని పట్టుకోటానికి వీలు కాలేదు.

అటు తర్వాత ఒక బనిటోచేప ఎందుచేతనో కంగారు పడి తిన్నగా నావమీద పడ్డది. ఆ గతిదినమే ఒక టన్నీని పట్టుకోటం జరిగింది. ఈ రెండుసంఘటనలూ జరిగిన పిదప మళ్ళీ మత్స్యసంగ్రహం చెయ్యాలని నిశ్చయించుకొన్నాము. ఇందువల్ల నావమీదకు ఎగిరిపడేవాటిని నిశ్శేషం చెయ్యవచ్చును; లేదా ఎక్కడికక్కడ భయంతో చెదరిపోవచ్చును; అని ఊహించాము.

అప్పటి మత్స్యసంగ్రహం గురించి దినచర్య పుస్తకంలో ఇలా వ్రాసి ఉన్నది.

"ఒక ఆరడుగుల సొరచేపను గాలంతో పట్టి పైకి లాగి వేశాము. మళ్ళీ గాలం నీళ్ళలో పడగానే ఎనిమిది అడుగుల సొరచేప పట్టుపడ్డది. దీనితర్వాత మళ్ళీ ఆరడుగుల సొరచేప దొరికింది; కాని దీనిని నావ అంచుకులాగేసరికి, అది పట్టు తప్పించుకొని నీళ్ళలో మునిగి పారిపోయింది. తిరిగి గాలం విసిరేసరికి, ఎనిమిదడుగుల సొరచేప చిక్కింది. అయితే, ఇది మమ్మల్ని చాలా అవస్థపెట్టింది. అతికష్టంమీద దానిని నావ అంచుకు చేర్చేటప్పటికి గాలంలో నాలుగు కొసలు విరిగి పోవటం, దొరికినచేప కాస్తా తప్పించుకొని పోవటం జరిగింది. మళ్ళీ క్రొత్తగాలం కోసం వెతికకోవలసివచ్చింది. క్రొత్తగాలానికి ఏడడుగుల సొరచేప చిక్కింది. అయితే ఇప్పుడు నావ

పార్శ్వాన నిలవటానికి చోటుకనబడలేదు. ఈ మూడు సొర చేపలూ చాలాసేర ఆక్రమించటమేకాకుండా, అవి చచ్చి పోయాయని నేము నిశ్చయించుకొన్న చాలాసేపటికి తల ఆడిస్తూ, కోఱలు బయటబెట్టి, అదేపనిగా దౌడలాడించటం మొదలుపెట్టాయి. అప్పుడు వాటిని నౌకాముఖభాగానికి ఈడ్చివేసి, మళ్ళీ గాలం విసిరి ఒక టన్నీచేపను పట్టు కొన్నాము. కాని, ఇది తేలికగా మాత్రం చిక్కలేదు. ఆ మూడు సొరచేపల్ని పట్టుకోటం ఒకఎత్తు; దీన్ని ఒక్కదాన్నీ పట్టుకోటం ఒకఎత్తులాగాఉందే! అనుకొన్నాము. ఎల్లాగో పట్టుకొన్నాము కానీ, దాన్ని అవతలకు ఈడ్చాలంటే, మళ్ళీ అంతకష్టమూ పడవలసివచ్చింది. బాగా బలిసిఉన్నదేమో! తోక పట్టుకొని ఎత్తబోతే ఎవరివల్లనూ కాలేదు.

సముద్రం అప్పుడే మత్స్యవ్యష్టాలతో ఆవృతం అయి నట్లున్నది. గాలంవెయ్యగానే ఒకసొరచేప దొరికింది కానీ, పైకితీస్తూఉంటే జారిపోయింది. కాని, తర్వాత ఆఱడుగులసొర చేప ఒకటి పట్టుపడింది. దానివెంటనే అయిదడుగుల సొరచేపను పట్టుకొన్నాము. ఆ తర్వాత ఇంకా రెండుచేపలను పట్టు కొన్నాము. అవీ సొరచేపలే! ఒకటి ఆఱడుగుల పొడుగు; ఇంకొకటి ఏడడుగుల పొడుగు."

నౌకాపార్శ్వాన 'మేము ఎక్కడ నడుస్తున్నా, సొర చేపలు తోకతో నావనుంగల్ని మోదుతూ, నోరు మాటి మాటికీ వివృతంచేస్తూ, మేముమందిరాన్ని కంపింపచేస్తున్నాయి. బాగా అలసి దెబ్బతిని చనిపోయి ఉంటాయనుకొన్న సొర చేపలు మేము దగ్గఱకు వెళ్ళేసరికి కఱవబోయేవి. కొన్ని మా

కోసం పిల్లికండ్లవంటి కండ్లను త్రిప్పుతూఉండేవి. అప్పుడు మృత్యువదనంలో పడ్డట్లు తోచేది. ఈ తొమ్మిది మహామీనాలనూ పట్టుకొనటానికి అయిదున్నరగంటలు పట్టింది. మేమూ బాగా అలసిపోయాము. అందుచేత ఇక చేపల్ని పట్టుకోటం మానివేశాము. మఱునటిరోజు కొన్ని బేడిసలూ టన్నీలు కనిపించాయి కాని సొరచేపలు వాటికన్న ఎక్కువగా కన్పించాయి. అప్పుడు మళ్ళీ మత్స్యసంగ్రహానికి పూనుకొని, కన్పించినవాటినల్లా పట్టుకొని పైన పడవేశాము. కాని, నాఁదూలాలమీద స్రవించిన సొరచేపల నెత్తుటివాసనచేతనే అన్ని సొరచేపలు మూగుతున్నాయని గ్రహించగానే ఆ పని మానివేశాము. చచ్చిన సొరచేపల నన్నింటినీ ఒకప్రక్కకు ఈడ్చి, నెత్తురంతా కడిగి, దూలాలు పరిశుభ్రపఱచాము. రక్తంతో మఱకలుకట్టిన వెదురుతడకల్ని తీసివేసి, పచ్చని క్రొత్తతడకల్ని అమర్చాము. అయినా తడకల్ని చూచినప్పుడల్లా, పెద్ద సొరచేప మమ్మల్ని మ్రింగటానికి నోరు తెఱచుకొని కదులుతున్నట్లు భ్రాంతి కలిగేది. సొరచేపల మాంసపరిమళం మా నాసికల్ని చీల్చివేస్తున్నట్లున్నది. చాలా చేపల్ని తినివేశాము. కాని సొరచేపను తినటానికి ముందు దానిని నీళ్ళలో బాగా కడిగివెయ్యాలి. లేకపోతే, దాని తెక్కలమీద ఉన్న అమ్మోనియావాసన అసహ్యంగా ఉంటుంది. కాని, బనీటోలూ, టన్నీలూ, సొరచేపకంటే రుచిగా ఉన్నాయి. ఆ సాయంకాలం మాలో ఒకరు "ఈ నీరు కారే చేపలూ, ఈ కటికసముద్రమూ తప్పిపోయి, ఎక్కడైనా ద్వీపంలో కొబ్బరిచెట్ల నీడను కూర్చుండి, ఇంకేమైనా

చూస్తూఉంటే, ఎంతో చక్కగా ఉండేది;" అనటం ప్రప్రథమంగా అప్పుడే విన్నాను.

వాతావరణం అతి ప్రశాంతమైంది. కాని, నమ్మటానికివీలు లేదు. ఏ క్షణంలో ఏమి మార్పు వస్తుందో! చల్లని గాలి తెజలు సాగాయి. పెద్దవానలు కురిశాయి. అయినా మాకు అప్పుడు చాలా సంతోషం కలిగింది. అంతవఱకూ మేము నాడుకొంటున్న మంచినీరు చెడిపోయింది. కనుక వేణుమందిరంపైనుంచి ధారాపాతంగావడుతున్న వాననీరు పాత్రలలో పట్టుకొన్నాము. 'ఇక కావలసినంత మంచినీరు త్రాగవచ్చును.' అనుకొన్నాము. ఉప్పు పేఱుకొని ఉన్న మా వస్తువులు మంచినీళ్ళతో పరిశుభ్రపడ్డందుకు ఎంతో ఆనందించాము.

చుక్కాని చేపలు దుంగలమధ్య మెసలుతున్నాయి. అయితే, అవి అంతకుముందునుంచీ మాతో వస్తున్నవో, క్రొత్తగా చేరినవో, చెప్పలేము.

జులై 21 తారీఖున గాలి ఆకస్మికంగా ఆగిపోయింది. ఎవరో పట్టి కట్టివేసినట్లు నిశ్చలమైపోయింది. పూర్వానుభవాన్నిబట్టి దీనిఫలితం ఎల్లా ఉంటుందో ఊహించాము. మేము ఊహించినట్లుగానే తూర్పుపడమర దక్షిణాలనుంచి తీవ్రంగా గాలులు వీచాయి. చివఱకు దక్షిణదిక్కునుంచి నూతనవాయువు సాగింది. దానితో అంతవఱకూ మమ్మల్ని బెదరిస్తూవచ్చిన కాఱుమబ్బులు దిక్కుమాలి, కనబడకుండా పోయాయి. హెర్మన్ విరామంలేకుండా వాయుపీడన పరిశీలక యంత్రంతో గాలివత్తిడిని పరిశీలిస్తున్నాడు. సెకనుకు 50 అడుగులు; ఒకొక్కప్పుడు అంతకంటె ఎక్కువగాకూడా గాలి

సాగుతున్నదని చెప్పాను. అంతలోనే టార్‌స్టీన్ పరుపుచుట్ట ఎగిరిపోయింది. ఆ తర్వాత జరిగినకథ చెప్పటానికే చాలాసేపు పడుతుంది; కాని ఆ మొత్తం కథఅంతా జరగటానికి అంతసేపు కానేకాదు.

ఎగిరిపోయిన పరుపుచుట్టకోసం పరుగెత్తిన హెర్మన్ సముద్రంలో పడిపోయాడు. అతను సాహాయ్యంకోసం అరవటం మాకు వినిపించింది. అయితే, అతనికేక అలలసందడిలో అంత విస్పష్టంగా లేదు. ఏమిజరిగిందని నేను చూచేసరికి, నీటిలో హెర్మన్ తల కనబడుతున్నది. అతను మావైపు చూచి చెయ్యి ఊపుతున్నాడు. అతనికి అంగుళ ఒక ఆకు పచ్చనిరూపం కదలివస్తున్నది. అలలు వెనుకకు నెట్టివేస్తూఉంటే అతను నావమీద చేరుకోటానికి నానావస్థలూ పడుతున్నాడు. చుక్కాని తెడ్డుకు వెనుక ఉన్న టార్‌స్టీనూ నేనూమాత్రమే అతన్ని ముందుగా చూచినవాళ్ళం. మేము భయంతో కొయ్యబారిపోయాము. "మనిషి పడిపోయాడు!" అని కంఠం పగిలిపోయేట్టు అరిచాము. నావను తత్క్షణం ఆపటానికై దగ్గరలో ఉన్న రక్షాబంధంవద్దకు పరుగెత్తాము. మిగిలిన ముగ్గురికీ కెరటాల గల్లంతులో హెర్మన్ కేక వినబడలేదు. కాని మరుక్షణంలో నావమీద మళ్ళీ చైతన్యం కలిగింది. సంతోషం సందడించింది. హెర్మన్ ఈతలో మొనగాడు. అతని జీవితం ఆ క్షణంలో ప్రమాదభరితమైనట్లు కనబడుతున్నా, నావ దూరంగాకముందే అతను ఈదుకొనివచ్చి పైకి చేరుకోగలడని మాకు ధైర్యం కలిగింది. టార్‌స్టీను తనకు అందుబాటులో ఉన్న వెదురుగంప పుచ్చుకొన్నాడు. దానికి ఒకచివర ప్రాణ రక్ష

ణార్థం మేము కట్టుకొనిన త్రాడు ముడివేసే ఉన్నది. మా ప్రయాణం మొత్తంలో ఈ త్రాడు ఉపయోగించింది ఇప్పుడే. కొద్ది సెకనుల లోపలనే ఇదంతా జరిగిపోయింది. హెర్మన్ నౌక వెనుకభాగానికి కొన్నిగజాలదూరంలోనే సమానమైన మట్టంలో ఉన్నాడు. చుక్కాని తెడ్డు పట్టుకొని పైకి రావాలని అతను ప్రయత్నిస్తున్నాడు. మొదట అతను నావ దూలాలు పట్టుకోటానికి యత్నించాడు కానీ ఆ యత్నం ఫలించలేదు. అప్పుడు చుక్కాని తెడ్డు అయినా అందుకోవాలనుకొన్నాడు. అదీ జారిపోయింది పాపం! అతను అక్కడే ఉండిపోయాడు. మేము అతనిదగ్గరకు వెళ్ళలేమని పూర్వానుభవంవల్ల స్పష్టమే. ఒక్కసారి వెనుకపడితే, ఎప్పటికీ వెనుకపడటమే! నేనూ బెంగ్ట్ రబ్బరుడింగీ తెచ్చాము. నట్టు ఎక్కువ జీవిత రక్షకమైన త్రాడు విసరివేశారు ఆ త్రాడు చాలా పొడుగున్నది. దాని ఒక కొన వేణుమందిరానికి బిగించిఉంచాము. అయితే, ఎదురుగాలి కొడుతుండటంవల్ల త్రాడు మళ్ళీ ఎప్పటిచోటికే వచ్చిపడ్డది. మూడుసార్లు ముందుకు రావాలని హెర్మన్ తన శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించాడు. ఫలం మాత్రం లేక పోయింది గాలి తీవ్రంగా వీస్తూ ఉండటంచేత నౌక వేగంగా పోతున్నది. చివరకు దానికి అంతకంటె ఎడం కాకూడదని అతను పట్టుదలతో ఈత మొదలుపెట్టాడు. అయితే మాటి మాటికీ తీవ్రమౌతున్న వాయువేగంచేత అతనికీ నౌకకూ ఉన్న దూరం క్రమక్రమంగా పెరిగిపోతున్నది. ఇది ఇల్లాగే అంతకంతకు పెరిగిపోతుందని హెర్మన్ గ్రహించాడు. ఇప్పటికి మేము రబ్బరుడింగీ నీటిలోకి చేర్చాము. కానీ, దీనివల్ల తన

కేమీ ఉపకారం జరుగదని అతను నిరాశపడ్డాడు. నౌకతో కట్టిన త్రాడు లేకుండా డింగీని ముందుకు నడిపితే, అది హెర్మన్‌ను చేరవచ్చునుగానీ, నౌకనుమాత్రం తిరిగి చేరుకోగలదా; అంటే, అది వేఱేవిషయం. ఏది ఏమైనా, డింగీలో ఉన్న ముగ్గురూ బ్రతుకటానికి కొంచెం అవకాశం ఉన్నది. కాని, సముద్రంలో పడిఉన్న మనిషికి ఆ అవకాశమేలేదు.

ఇంతలో నట్ సముద్రంలో ఉఱికాడు. అతను ఒక చేతిలో జీవితరక్షకబంధం పట్టుకొని ఈదుతున్నాడు. నట్ ముందుకి వెళ్ళినప్పుడల్లా హెర్మన్ తల కనబడుతున్నదికానీ, దగ్గఱకు వెళ్ళేసరికి హెర్మన్ మఱింతదూరపోతున్నాడు. చిట్టచివఱికి ఇద్దఱూకలసి ఈదుకొనిరావటం కనిపించింది. ఇద్దఱూ త్రాడు ఒకచేతితో పట్టుకొనేవస్తున్నారు ఇంతలో రబ్బరుడింగీ నావమీదకు చేర్చాము నలుగురమూ కలసి త్రాడు లాగాము. అలా మిత్రుల ప్రాణాల్ని రక్షించటానికి త్రాడులాగుతూ ఉండగా మామిత్రులిద్దఱికీ కొంచెం వెనుకగా కదలివస్తున్న ఒక నల్లని పదార్థంమీద మా చూపులుపడ్డాయి. ఈ విచిత్ర మృగమే అలలపైన పచ్చని త్రిభుజంవంటిరూపాన్ని ప్రదర్శిస్తున్నది. హెర్మన్‌కోసం బయలుదేఱినప్పుడు దీనివల్ల నట్టు కొంచెం దెబ్బతిన్నాడు ఆ పచ్చని త్రిభుజరూపం ఏ సొరచేపది కానీ, మఱే జలభూతానిది కానీ కాదని ముందుగా హెర్మన్ ఒక్కడే గ్రహించాడు అది టార్‌స్టీన్ పరుపుచుట్ట! తర్వాత ఆ పరుపుచుట్ట ఎంతోసేపు అలా నీటిలో లేదు. మా మిత్రులిద్దఱూ దానిని పైకి తీసికొనివచ్చారు. ఎల్లాగైతేనేమి మా ఆఱుగురం సురక్షితంగా కలిసికోగలిగాము. పరుపుచుట్టను

లాగుకొనిపోయిన దేదైనా కానీ, తనకు చిక్కవలసిన అంత కంటె మంచి ఆహారాన్ని కోల్పోయింది.

"ఆ పశుపుచుట్టలో నేను లేనందుకు చాలా సంతోషిస్తున్నాను" అంటూ, టార్స్టీను అంతకుముందు విడిచివేసిన చుక్కాని తెడ్డును అందుకొన్నాడు.

కాని, పరిస్థితి ఇంకోవిధంగా మారితే సాయంకాలం నావమీద ఇంత కోలాహలం ఉండేది కాదు. నరనరమూ తోడుకొని పోయినట్లూ, ఎముకఎముకా విరిగిపోయినట్లూ, ఆస్వల్ప కాలంలో మేము అసంతమైన బాధపడ్డాము. అందఱం కలసి కొనసరికి, అంతబాధా ఇట్టే మఱచిపోయాము.

ఆ రోజున హెర్మనూ, మిగిలిన నలుగురమూ నట్టుతో ఎంతసేపు ఎంత ఆనందంగా ప్రసంగించాలనుకొన్నామో ! అతనివల్లనే హెర్మన్ బ్రతికి బయటపడ్డాడు; మాకు మిత్ర నష్టం తప్పింది.

అయితే, కబుర్లతో కాలక్షేపం చెయ్యటానికి వ్యవధి కనబడలేదు గతించిన దాన్నిగుఱించి కాకుండా, జరుగబోయే దాన్నిగుఱించి ఆలోచించవలసి వచ్చింది. ఆకాశం కాటుక పులిమినట్లయింది. చలిగాలి బహుముఖాలుగా తీవ్రంగా సాగింది. రాత్రిఅయేసరికి క్రొత్తతుపాను దయచేసింది. నౌకకు చినజీవితరక్షకబంధం సుదీర్ఘంగా కట్టి విడిచిపెట్టాము. మళ్లీ ఎవరైనా నావమీదనుంచి పడిపోతే, చుక్కాని తెడ్డువైపు ఈదుకొనివచ్చి, అక్కడ వ్రేలాడుతున్న త్రాడుపట్టుకొని పైకి రావచ్చును. మేము ఇంతవఱకు పనిచేసినంతలో రాత్రిఅయింది. కన్నుపొడుచుకొన్నా కానరాకుండా లోకం అంధకార

బంధురం అయింది. ఆ ఘోరతమిస్రలో సాగరం విలయ తాండవం ప్రారంభించింది. ఝుంఝు పరవళ్లు త్రొక్కుతూ హోరుమని నినిస్తూ ఉండటం మాత్రం తెలుస్తున్నది. దాని దయవల్ల మా వేణుమందిరం గగనమందిరం కావచ్చు; అప్పుడు మేమూ గగనమందిరులమే కావాలేమో; అనిపించింది. అయితే, దానిని తైలవస్త్రం (కాన్వాసు)తో కప్పి ఉంచటం వల్లనూ, గట్టిగా కట్టి ఉండటంచేతనూ, అటువంటిది జరుగ లేదు. దొరలివచ్చుతున్న తరంగాలచేత కోన్-టికీ ముందు వెనుక లకు ఒరుగుతూఉంటే, అడుగుదూలాలు పైకీ, క్రిందికీ ఊగి పోతున్నాయి. అప్పుడు క్లిక్కు క్లిక్కుమని వినిపిస్తున్నది. తరంగాలు నౌకపార్శ్వానికి దొఱలిరావటం లేదు. అవి కమ్మరి కొలిమి తిత్తుల్లాగా వాయునిస్సారితాలై, వ్యాకోచిస్తూ, సంకో చిస్తూ నౌకాప్రయాణానికి బాగా దోహదంచెయ్యటం మాకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది.

అయిదు అహోరాత్రాలు తుపాను నిలబడే ఉన్నది. అయితే మధ్యమధ్య కొంచెం విరామం కనిపించకపోలేదు. తరంగాలమీద తేలుతున్న తెల్లని నురుగురాసులమధ్య ఉన్న నీలజలాలు, పెద్ద కొండలమధ్యఉన్న లోయలులాగా కనిపించాయి. అయిదవరోజున తుపానుతీవ్రత తగ్గి స్వచ్ఛమైన ఆకాశం కనబడింది. అప్పటికి మా చుక్కాని తెడ్డు విఱిగి పోయింది. తెఱచాప చిఱిగిపోయింది. నావ నడిపలకలు ఊడి వస్తున్నాయి కాని మేమూ, మా సామగ్రీ దెబ్బదినలేదు.

ఈ రెండుతుపానులతో కోన్-టికీ బిగువు తగ్గిపోయింది. దుంగలు బాగా కదలిపోవటంవల్ల, వాటికి బిగించిన త్రాళ్ళు

ఒరవళ్ళుపెట్టి లోపలికి చొచ్చుకొనిపోయాయి. ఇంకాల సంప్ర దాయాన్ని తూ. చా తప్పకుండా అనుసరించి, బాల్సా దూలా లను త్రాళ్ళతోనే ముడివెయ్యటంవల్ల, దూలాలు ఆమాత్ర మైనా నిలిచిఉన్నాయి. అలాకాక, మేకులతో దూలాలను బిగించిఉంటే, అవిముక్కలైపోయేవి. పచ్చికట్టెలకు బదులు ఎండినవాటినే ఉపయోగించిఉంటే, అవి ఇంతదూరం రాక ముందే నీటిని పీల్చుకొని, ఆ బరువుతో మునిగిపోయేవి. పచ్చికట్టెల్లోఉండే నీరు సముద్రజలాన్ని కట్టెలు పీల్చివెయ్య కుండా అడ్డుపడ్డది. బాగా తెలిఉంటాయికదా! అని, ఎండిన కాష్ఠాలను ఉపయోగిస్తే, ఈ సదుపాయం ఎక్కడిది? అయితే త్రాళ్ళు బాగా వదులైపోవటంవల్ల, దూలాలమధ్య సందులు పెద్దవైనాయి. పొరపాటున ఆ సందుల్లో అడుగులుపడితే, ఉత్తరక్షణంలో దూలాల అన్యోన్య ఘర్షణమూలాన పాదం పచ్చడికావలసిందే. దూలాలమీదపడుతూ ఉండే నాచు మొక్కలూ, బనానాఆకులవల్ల, వాటిమీద నడిచేటప్పుడు కాలుజారకమానదు. అది తెలిసి, ఎప్పటికప్పుడు మేము వాటిని తీసివేస్తూనే వచ్చాము. చుక్కాని తెడ్డు దగ్గరకు వెళ్ళే త్రోవలో వెడల్పయిన దూలమే అమర్చి ఉంచాము. కాని అల వచ్చిపోయినంతలో నాచుమొక్కలూ, బనానా ఆకులూ మళ్ళీవచ్చి పడతాయి. వాటిని ఆ క్షణంలో తీసివెయ్య టానికి అవకాశం ఉండదు ఆ సమయంలో అటువైపు నడవ వలసివస్తే, అప్రమత్తత అవసరం. ముఖభాగంలోపడి ఉన్న తొమ్మిది సారచేవల్లో ఒకటి, నావ చలించినప్పుడల్లా, దొర్ల

తున్నది. తెరచాప కర్రలకు కట్టిన త్రాళ్ళలోనుంచి కీచు కీచు మన్న శబ్దం వినబడుతున్నది. అవి తెగిపోతే కర్రలుకూలి పడవచ్చుగూడాను.

చుక్కాని తెడ్డు చంద్రకర్రతో తయారుచేసి, యథాస్థానంలో బిగించాము. ఇప్పుడు ఇది ఉక్కు తెడ్డులాగా అభేద్యంగా ఉన్నది. ఎరిక్కు బెంగ్టులు తెరచాప బాగుచేశారు. ప్రశాంతమైన వాతావరణంలో చుక్కాని తెడ్డు అవలీలగా నీటిని నెట్టివేస్తూఉంటే, కోన్-టికీ పాలినేషియావైపు సుకరంగా ప్రయాణం ప్రారంభించింది. అయితే నడిపలకలు మాత్రం ఏమీ బాగుపడలేదు. అవి నీటిఒత్తిడి తట్టుకోలేక, ఇరుప్రక్కలకూ కొట్టుకొంటున్నవి. నావ అడుగున తొంగి చూడటానికి వీలేలేదు. ఎందువల్లనంటే, ఆ భాగం అంతా నాచుతో కప్పబడి ఉంది. నావపైనుంచిచూస్తే, మూడుచోట్ల మాత్రం ప్రధానపాశాలు తెగిపోయినట్లు కనబడుతున్నాయి. బాల్సాదుంగలు ఎంతోనీరు పీల్చుకొన్నట్లు స్పష్టమౌతూనే ఉన్నది. కాని నౌకమీద వస్తుసామగ్రికి నీటిలో మునిగిపోయే దుర్గతి పట్టలేదు గనుక, ఇప్పటిలో ఏమీభయంలేదు; ఇంకా కొంత నీరు పీల్చుకొన్న తర్వాతగానీ దుంగలు మునిగిపోవు అనుకొన్నాము. మా ఆహారపదార్థాలూ, మంచినీరూ చాలా వరకు తరిగిపోయాయి. రేడియో నిర్వాహకులకు విద్యుద్ఘట శక్తి తరిగిపోయినట్లు విదితమైంది.

ఏమైనప్పటికీ, సత్వరంగా దగ్గరలో ఉన్న ఏద్వీపానికైనా చేరుకోవటం అవసరం; అని తేల్చుకొన్నాము. కాని, ఇక్కడ

మళ్ళీ క్రొత్తసమస్య బయలుదేరింది. అసలు ప్రయాణం ఎలా అంతమవుతుంది ?

ఏదైనా ఖండంగానీ, ద్వీపంగానీ అడ్డు తగిలేదాకా, కోన్-టికీ తిన్నగా పశ్చిమానికి పోతూనే ఉంటుంది. ఆ పాలినేషియన్ ద్వీపాలలో ఏదో ఒక ద్వీపానికైనా ఆరుగురమూ ప్రాణాలతో చేరుకొనేదాకా ప్రయాణం అంతంకాదు.

చివరి తుపానులో కలిగిన అనుభవాన్నిబట్టి, నావ ఎక్కడ మునిగిపోతుందో; అనిశ్చితంగా ఉన్నది. మార్క్వెసాస్ ద్వీపాలుగానీ, ట్వామోటో ద్వీపాలుగానీ మాకు సమాన దూరంలోనే ఉన్నాయి. కాని మా నావ ఈ రెండు ద్వీప సమూహాల్లో దేనినీ చేరక, రెంటికీ మధ్యనుంచి వెళ్ళిపోయేట్టు కనబడుతున్నది. చివరకు ఆ ద్వీపాల్లో ఏవీకూడా, మా దృష్టిపథంలో పడనే పడకపోవచ్చును. మార్క్వెసాస్ ద్వీపసమూహంలో మాకు అత్యంత సన్నిహితమైన దీవి వాయవ్యదిశలో దాదాపు 300 సముద్రపుమైళ్ళదూరాన ఉన్నది. ఇక నైరృతి దిశనున్న ట్వామోటో ద్వీపబృందంలో మాకు చాలా చేరువను ఉన్నదికూడా అంతేదూరంలో ఉన్నది. గాలివాటం కానీ, సముద్రప్రవాహంకానీ ఎప్పటికైనా మారిపోవచ్చుకానీ, అప్పటికి మాత్రం పశ్చిమాభిముఖంగా సాగుతూ, ఈ రెండు ద్వీప కదంబాలకూ నడుమఉన్న సముద్రంవైపు మమ్మల్ని నెట్టివేస్తున్నాయి.

నైరృతిదిశలో మాకు సన్నిహితంగా ఉన్న ద్వీపం పేరు ఫాటుహివా. ఇది వనమయాలైన పర్వతాలతో నిండిఉన్నది. కొంతకాలం నేను ఈ ద్వీపంలో కాలక్షేపం చేశాను. సముద్ర

సామీప్యంలో ఒక చిన్న కుటీరం నిర్మించుకొని, మనోజ్ఞమైన వాతావరణంలో మనస్సు ఆనందపరవశమౌతూ ఉంటే ఒక వృద్ధుడు తమ పూర్వీకుడైన టికీని గురించి చెప్పే సుదీర్ఘ గాథలు వింటూ, ఆనందించేవాణ్ణి. మా నౌక దైవికంగా మళ్ళీ ఆ తీరానికే చేరితే, పూర్వవాసనలతో నా హృదయం ఎంత ఉప్పొంగుతుందో! కాని, పాపం! ఆ వృద్ధుడు మాత్రం కనిపించడు. అతను ఈపాటికి అసలు టికీని కలసికొనే ఆశతోనే శరీరం చాలించిఉంటాడు. ఇందుకు భిన్నంగా నౌక మార్క్వెసాస్ ద్వీపాలలోని పర్వతశ్రేణులవైపు పయనించితే, ఏ కెఱటమైనా చెలరేగి నావను ఆ కొండలలో దేనికైనా ఢీ కొట్టించవచ్చును. అయితే, దీనికి భిన్నంగా మా నౌక ట్యుయమోటో ద్వీపాలలో తీరాల చెంత జలమగ్నాలైన పర్వతశిఖరాలవైపు ప్రయాణించవచ్చును. అక్కడి ద్వీపాలు ఒకదాని కొకటి చాలా దగ్గఱగా ఉండి, విశేషసముద్రభాగాన్ని ఆక్రమించి ఉన్నాయి. కాని ఈ ద్వీప సమూహానికి "నీచమైన ఆర్కిపెలాగో" లేక "అపాయకరమైన ఆర్కిపెలాగో" అనే అపకీర్తి ఉన్నది. తీరంవెంట ఎక్కడ చూచినా, ఱాతిగుట్టలు తప్ప, నౌక చేరదగిన రేవు కనిపించదు. అంతేగాక, తీరానికి దగ్గఱలో నీటిలో మునిగిఉన్న కొండలున్నాయి. ఈ కొండల మీద కొబ్బరిచెట్లు మాత్రం నీటిమట్టానికి ఆఱడుగులు లేక పదిఅడుగులు ఎత్తుగా కనిపిస్తూఉంటాయి. ఈ చెట్లచుట్టూ, ఎక్కడికక్కడ వలయాకారంలో ఉండే అపాయకర గిరిశిఖరాలు ఉన్నాయి. అయితే ఈ రెండు ద్వీపసమూహాలూ ఇంత అగమ్యాలుగా ఉన్నా, రెంటిలోనూ కూడా, పాలినేషియన్లు

తమ ఆధిపత్యాన్ని ప్రకటించి పరిపాలిస్తూ వచ్చారు. రెండు చోట్లనూ ఉన్న రాజకుటుంబాలవారు తమ మూలపురుషుడు "టికీ" అనే చెప్పుకొంటారు.

అయితే, జులై మూడో తేదీకే 'మాకు దగ్గఱలో ఏదో ఒక భూభాగం ఉండిఉంటుంది' అని, దృఢవిశ్వాసం కలిగింది. 'ఆ విశ్వాసానికి ఆధారం ఏమిటి ?' అని ప్రశ్నిస్తే జవాబు చెప్పలేము. అప్పటికి పాలినేషియా ఇంకా 1000 మైళ్ళదూరాన ఉన్నది. ఈ మధ్యలో మా ప్రయాణం ఎల్లా పూర్తిఅవుతుంది ? కాని వెనుకటి రోజులలో పెరూ దేశపు నావికులకు కూడా, ఇటువంటి విశ్వాసం కలిగేది. ప్రకృతి పరిశీలనచేత వారు జరుగబోయే విషయాన్ని గ్రహించగలిగేవారేమో ! వారి విశ్వాసం తప్పకుండా ఫలించేదికూడాను. ఈ నాడు మాకుకూడా అటువంటి విశ్వాసం కలుగుతున్నది. ఇదీ ప్రకృతి చెప్పుతున్నదే. పెరూతీరంనుంచి వెయ్యి సముద్రపుమైళ్లు వచ్చే వఱకూ మాలకాకులగుంపుకనిపిస్తూనే వచ్చాయి. 100° పశ్చిమాన అవి అదృశ్యమైనాయి. తర్వాత కొన్ని సముద్రవిహంగాలు మాత్రమే కనిపిస్తూ ఉండేవి. కాని యీ జూలై మూడోతేదీన మళ్ళీ మాలకాకులు 125° పశ్చిమాన కనిపించాయి. ఇకనుంచీ అప్పుడప్పుడు ఈ పక్షులు కనబడుతూనే ఉన్నాయి. ఒకొక్కప్పుడు మేఘాలలో దాగుడుమూతలాడుతున్నట్లుండేవి. ఇంకొకప్పుడు అలలకొనలమీదనే తిరుగుతూ, వేడిసలనుంచి తప్పించుకొనటానికి ఎగిరే చెక్కలచేపలను కఱచుకొని పోతున్నాయి. ఇవి మాతోపాటు అమెరికా

నుంచి వచ్చినవి కావు. మాకు ఎదురుగాఉన్న ఏ భూభాగం నుంచో వచ్చి ఉండాలి. జూలై 16 వ తేదీన మళ్ళీ ప్రకృతి మమ్మల్ని హెచ్చరించింది ఆరోజున నేము ఒక సొచేపను పట్టుకొన్నాము. దాని ఉదరంలోనుంచి జీర్ణంకాని నక్షత్రమత్స్యం ఒకటి బయటపడ్డది ఆ నక్షత్రమత్స్యం అక్కడికి చేరువలోనే ఉన్న ఏ భూభాగం దగ్గఱనో సొరచేపకు చిక్కి ఉంటుంది.

సరిగా ఆ మఱుసటినాడే పాలినేషియాదీవుల సామీప్యాన్ని సూచించే ఒకదృశ్యం కనబడ్డది. అది మాకు పెద్ద పండుగే అయింది. రెండు పెద్దపక్షులు, పశ్చిమాభిముఖాలై ఆకాశాన్ని దూసుకుపోతున్నట్టున్నవి, క్రిందికి దిగి మాచుక్కాని స్తంభానికి పైగా ఎగురుతూ మాతోకాటు రావటం మొదలు పెట్టాయి. అయిదడుగుల వెడల్పుగా రెక్కలుచాచి నౌకచుట్టూ అనేకపర్యాయాలు తిరిగితిరిగి చివఱకు అవి సముద్రంమీద ఈదుతూ మమ్మల్ని అనుసరించాయి. బేడిసలు తత్క్షణం వాటి దగ్గఱకు వెళ్ళాయి. పోరాటంమాత్రం జరుగలేదు. ఇఱుపక్షాలు అన్యోన్యముఖావలోకనంచేస్తూ నిలబడ్డాయికానీ, ఎదుటి వర్గాన్ని దెబ్బతీయటానికి ప్రయత్నించలేదు. మమ్మల్ని పాలినేషియాకు రావలసిందని స్వాగతం ఇవ్వటానికి వచ్చినది ఈ పక్షిబృందమే. ఇవి సాయంకాలానికి తిరిగిపోలేదు. మాతో బాటు ప్రయాణంచేశాయి. నడిరాత్రి దాటినాకూడా, అవి మాపైన భ్రమిస్తూ, ఒకటేసందడిచేస్తూ వచ్చాయి.

ఇక్కడి రెక్కలచేపలు కూడా అంతవఱకూ కనిపించిన వాటికంటె కొంచెం పెద్దవిగా ఉన్నాయి. ఈజాతి నాకు వెనుక "ఫాటూహీవా" ద్వీపతీరంలో సుపరిచితమైనది. పూర్తిగా

మూడురోజులపాటు మా ప్రయాణం 'ఫాటూహివా' కు సూటిగా సాగింది. తర్వాత ఈశాన్యపవనం ఒకటి వీచి మమ్మల్ని ట్యూమాటో ద్వీపసముదాయపు శిలావలయాలవైపు నెట్టివేసింది. దీనితో మేము భూమధ్యరేఖకు దక్షిణానఉన్న ప్రధాన ప్రవాహానికి దూరమైపోయాము. అక్కడనుంచి కనిపిస్తూ వచ్చిన సముద్రప్రవాహాలను నమ్మి ఉండటానికి వీలులేదని స్పష్టమైంది. ఒకరోజున నావ ఒకప్రవాహాన్ని అనుసరిస్తే, రెండవరోజున ఆ ప్రవాహం కనిపించేదికాదు. మరి అది ఎక్కడ అంతరించిందో ! అసలు ప్రవాహాలనేవి సముద్రంలో అదృశ్యంగానే ప్రవహిస్తూఉండే నదులవంటివి. ప్రవాహం విసురుగా పోతుంటే నీరు విశేషంగా పొంగుతుంది. ఉష్ణోగ్రత ఒక డిగ్రీ తగ్గిపోతుంది. ప్రవాహం ఎటువైపుగా సాగుతున్నదీ, ఎంత వేగంగా ప్రవహిస్తున్నదీ ఎరిక్కు అంచనాగా, యంత్రంద్వారా నిరూపితమైన దానికీ కల తేడావల్ల తెలుసుకొనేవాళ్ళము.

పాలినేషియా ముఖద్వారంలో వాయువు మమ్మల్ని "ఇలాపోండి" అన్నట్టు, ఒక బలహీనమైన ప్రవాహానికి అప్పగించి పోయింది. ఆ ప్రవాహం అంటార్కిటిక్ మహాసముద్రాభిముఖంగా వెళ్ళుతున్నది. మాకు కొంచెం ఆశకలిగి, చురుకుగా ఉన్నాము. అది నిజంగా ప్రవాహమేనా! అన్నట్టున్నది. కాని ప్రవాహలక్షణాలు కనిపిస్తున్నాయి. కాబట్టి సందేహం అక్కఱలేదు. అటువంటిది అంతవఱకు మాకు కనబడలేదు. గాలి అంతవేగంగా లేనప్పుడు మాకు దొరికిన ప్రతి జీర్ణవస్త్రమూ తెఱచాపకు తోడుగా కట్టేవాళ్ళం. తిరిగి అమెరికావైపు నావ కొట్టుకుపోవటం జరుగలేదు. కనీసం వాయువు బల

హీనమైనవన్నీకు రోజుకు తొమ్మిది సముద్రపుమైళ్ళైనా పురోగ మిస్తూ వచ్చాము. మొత్తంమీద ఆ ప్రయాణంలో రోజుకు 42 1/2 సముద్రపు మైళ్ళు వెళ్ళాము.

వ్యాపారపవనం ఈ తుదిఘట్టంలో మమ్మల్ని విడిచి పెట్టదలచుకోలేదు. అది మళ్ళీ కొంచెం విజృంభించింది. నవీన మైన ఒక అద్భుత ప్రపంచాన్ని ప్రవేశించనున్న మా జీర్ణ నౌకను ఈడ్చుకొని లాగుకొని పోయింది.

ప్రతిదినమూ సముద్రవిహంగాలు అధికసంఖ్యలో గుమిగూడివచ్చి, మాపైన తిరుగుతూ వచ్చాయి. ఒక సాయం కాలం సూర్యుడు అస్తమించనున్న సమయాన ఈపక్షుల్ని ఏదో బలవంతంగా నెట్టివేస్తున్నట్లయింది. అవి మమ్మల్ని గానీ, తెరకట్టలచేపల్ని గానీ గమనించకుండా, పశ్చిమానికి ఎగిరి పోయాయి. నౌకాస్తంభాన్ని ఎక్కిచూస్తే, అవి మొదట ఎలా వచ్చారో అలాగే ఏకోన్ముఖంగా పోతున్నట్లు స్పష్ట పడింది. బహుశః అవి ఇంకా ఎత్తున మాకు కనిపించని దానిని దేనినో చూచి ఉంటాయి. లేదా, ఊరకే అల్లాపోదామనే కుతూహలంతో వెళ్ళుతూ ఉండవచ్చును. ఏమైనా, ఏదో ఒక అభిప్రాయంతోనే అవి అల్లా బయలుదేరి ఉంటాయి. అక్క డికి సమీపంలో ఉన్న ఏదైనా ద్వీపంలో అవి నివసిస్తూ ఉన్నా యేమో! ప్రొద్దుక్రుంకుతున్నదని స్వస్థానాలకు బయలుదేరి ఉంటాయేమో!

మేము చుక్కానిని సరిచేసి, తిన్నగా పక్షులు పోయిన జాడనే నౌకను నడిపించాము. చీకటిపడినప్పటికీ, తర్వాత చాలాసేపటివఱకుకూడా, మాకు పక్షుల కలకలధ్వనులు విని

పిస్తూనే ఉన్నాయి. ఆరాత్రి చాలా వింతగా ఉన్నది. చంద్రుడు దాదాపు పరిపూర్ణంగా ఉన్నాడు. మా ప్రయాణం మొదలు పెట్టిన తర్వాత ఇది మూడవ పౌర్ణమి. మఱునటిరోజు తిరిగి అనేక పక్షులు కనిపించాయి. అయితే ఈసారి వీటినే అనుస రించి వెళ్ళవలసిన అవసరంలేదు. ఒక మబ్బు కనిపించింది. ఇది కదలుతున్నట్లు లేదు. మిగిలిన మబ్బులన్నీ తెల్లని ప్రోగుల్లాగా దక్షిణాన కనిపించి, వ్యాపారపవనంతో బాటు పశ్చిమానికి వెళ్ళిపోయేవి. 'ఫాటూహీవా' ద్వీపానికి వ్యాపారపవనంతో ఇటువంటి మబ్బులువస్తూ ఉండటం నాకు తెలిసినవిషయమే. అటుతర్వాత పగలూ రాత్రీకూడా, కోన్-టికీమీద నిల్చుంటే, ఇవి కనిపిస్తూవచ్చాయి కాని, ఈ ఏకాంత మేఘం నైఋతి దిశాభిముఖంగా కదలనేలేదు. తక్కినమబ్బులన్నీ కొట్టుకొని పోతూఉంటే, పట్టి పొగమబ్బులాగా లేచిన ఈ విచిత్రమేఘం యథాప్రకారం నిలిచే ఉన్నది. ఈ రకం మేఘాన్ని లాటిన్ భాషలో "కుములునింబస్" అంటారు. పాలినేషియన్లకు ఈ పేరైతే తెలియదుగానీ, ఇటువంటి మబ్బులకు అడుగున భూమిఉంటుందని తెలుసు. సూర్యుడు ఇసుకనేలలమీద తీక్ష్ణంగా ప్రకాశిస్తూఉంటే, వడగాలివంటిది తీవ్రంగావీస్తూ, ఇసుక రేణువులను పైకితీసికొని పోతుంది. ఆకాశంలో అవి రిటో కూడిన చల్లగాలి వీచేచోటికి చేరగానే, ఈసైకతం అక్కడ నిలిచిపోతుంది. ఇదే మబ్బులాగా కనిపిస్తుంది.

సూర్యాస్తమయంతో మబ్బు కనిపించకుండా పోయే వఱకూ, మేము దానిమీదనే కన్నులు పెట్టుకొన్నాము. వాయుగతి దృఢంగా ఉన్నది. ప్రశాంతవాతావరణంలో

మాదిరిగానే చుక్కాని తెడ్డు అప్రతిహతంగా ఉండటంవల్ల నౌక ముందుకు సాగిపోతున్నది. చుక్కానిపట్టే మనిషికి కావలసినంత తీరుబడి. హాయిగా కూర్చొని, ఎక్కడైనా నేలకని పిస్తుందేమోనని చూస్తూ ఉండటంతో కాలం గడచి పోతున్నది.

ఆ రాత్రి పక్షుల కోలాహలంతో మాకు మెళుకువచ్చి నట్లైంది. చంద్రుడు దాదాపు పరిపూర్ణుడైనాడు.

## దక్షిణ ద్వీపాలకు

జూలైనెల 30 వ తేదీకి గతరాత్రి కోన్-టికీ చుట్టూ ఒక అపూర్వ వాతావరణం ఏర్పడ్డది. అది విహంగమండలం కోలాహలంతోపాటు మాకు చుట్టూ కానవచ్చిన మత్స్యసముదాయంవల్ల ఏర్పడ్డది కావచ్చును. మూడునెలలనుంచీ, సముద్రంలో త్రాళ్ళ కిట్టుకిట్టులు, మొదలైన నిర్జీవపదార్థాలవల్ల పుట్టిన ధ్వనులతో, విసిగివిసిగిఉన్న మాకు ఈ సజీవపదార్థాల కోలాహలం కర్ణపర్వంగా ఉన్నది. చంద్రుడు వెనుకటికంటె వర్ధిల్లి, మరీ గుండ్రంగా కనబడుతున్నాడు. నౌకాస్తంభానికి పైగా చంద్రబింబం కనబడుతూఉంటే, కొబ్బరిచెట్టును చూచి నట్లే ఉన్నది. ఏవో శృంగారభావాలు మనస్సులో మొలకెత్తుతున్నాయి. సముద్రోపరిభాగాన మత్స్యసముదాయంమీద ప్రసరించే వెన్నల పసుపుపచ్ఛదనం వహించలేదు.

ప్రొద్దున ఆరుగంటలకు బెంగ్ట్ నౌకాస్తంభంమీద నుంచి దిగివచ్చి, హెర్మనును మేల్కొల్పి లోపలికి వచ్చాడు.

హెర్మన్ పైకి వెళ్లేసరికి సూర్యోదయం అయింది. తర్వాత పది నిముషాలకు అతను క్రిందికి దిగివచ్చి, నన్ను లేవగొట్టుతూ ఇలా అన్నాడు.

"లేచి రావోయ్! నీ ద్వీపాల్ని ఒకసారి చూతువుగాని."

అతనిముఖంలో నూతనోత్సాహం ఉట్టిపడుతున్నది. నేను తత్క్షణం బయటికి ఉరికాను. బెంగ్టు ఇంకా నిద్రపోలేదు. అతను నా వెనుక బయలుదేరాడు. మేము క్రింద నిలవలేక పోయాము. గబగబ నౌకా స్తంభాన్ని ఎక్కగలిగినంత ఎత్తు దాకా ఎగ్రాకి చూచాము. మా చుట్టూ అనేకపక్షులు ఉన్నాయి. ఆకాశనీలిమ సముద్రంలో ప్రతిఫలిస్తూఉంటే, అంత రిస్తున్న నిశాశిథిలతాచిహ్నంలాగా ఉన్నది తూర్పున ఆకాశం అంతా అరుణచ్ఛాయావిలసితమై నేత్రపర్వం చేస్తున్నది ఆగ్నేయభాగాన అరుణకిరణప్రసారంతో రక్తచ్ఛాయమైన భూభాగం ఒకటి కనిపించింది ఇంకా సూర్యకిరణాలు చేరని ప్రాంతానచూస్తే సముద్రంమీద ఒక నీలరేఖ గీచినట్లున్నది.

అది నేల! ఒక ద్వీపం! ఆ దృశ్యం మమ్మల్ని ఎంత ఉత్సాహపటచిందో చెప్పలేము. వెంటనే వచ్చి తక్కిన మిత్రులను మేల్కొలిపాము వారు తడబడుతూ, బయటికివచ్చి నలువైపులూ పరికించారు. నావ సరిగా తీరానికే చేరిందనుకొన్నారు పాపం! కిలకిలలాడుతున్న పక్షులు మా నౌకదగ్గఱ నుంచి, సముద్రంమీదుగా ద్వీపంవఱకూ నిర్మించిన ఒక పెద్ద వంతెనలాగా కన్పిస్తున్నవి. ఇంతలో విస్తృతమైన సూర్య కాంతిలో ఆ ద్వీపం సువర్ణమయంగా కనబడుతూ, క్షణక్షణ ప్రవర్ధమానం అవుతున్నట్లు కన్పించసాగింది.

మాకు మొట్టమొదట "ఆ ద్వీపం అసలు ఉండవలసిన చోట లేదు." అని తోచింది. అయితే ద్వీపం కొట్టుకొని రావటం అసంభవం కనుక, రాత్రిపూట నావ ఉత్తరాభిముఖమైన ఏ ప్రవాహంలోనైనా చిక్కుకొనివస్తూ ఉండాలి. సందేహనివృత్తికోసం సముద్రం పరిశీలించాము. మేము ఉన్న చోటినుంచి ద్వీపంవైపు నావను నడిపించటానికి వాయువు ప్రతికూలమైంది. ట్యూమాటో ఆర్కిపెలాగో చుట్టూ అతివేగంగా ప్రవహించే సముద్రప్రవాహాలు ఉన్నాయి. అవి అన్నీ ద్వీపంవైపుగానే ప్రవహిస్తాయి. అయితే వాటిలో చాలావఱకు భిన్నభిన్న మార్గాల్లో పోతూ, పెద్దపెద్ద కెఱటాలు బయలుదేరినప్పుడు వాటితో కలసి సముద్రముగ్నా లైన పర్వతశిఖరాలపైగా, శిలావలయాలమీదకూడా ప్రవహించిపోతాయి.

మేము చుక్కాని తెడ్డును బలంకొద్దీ త్రిప్పివేయటానికి ప్రయత్నించాము. అయితే ఆ ప్రయత్నం ఎంతమాత్రమూ కొనసాగదని తెలుసు. ఆఱున్నరగంటలకు ఉదయించిన సూర్యుడు తిన్నగా నెత్తిమీదకు వస్తున్నాడు. ఉష్ణమండలాలలో మాదిరిగా సూర్యకిరణాలు నిప్పులు క్రక్కుతున్నాయి. ద్వీపం మాకు కొన్ని సముద్రపుమైళ్ళదూరాననే ఉండి, ఆకాశానికి ఎగబ్రాకుతున్న మహారణ్యమేమో అన్నట్లు కనిపించింది. సన్నని సముద్రతీరానికి కొంచెందూరంలోనే వృక్షపంక్తులు కనిపిస్తున్నవి. తీరంవంక చూస్తే, కెఱటాలు ఉద్ధృతంగా వచ్చినప్పుడు అది మునిగిపోతూఉంటుందని తోచింది. ఎరిక్ గుర్తుల ప్రకారం ఇది "పుకా పుకా" అనే ద్వీపం. ట్యూమాటో బృందంలో ఇదే మొదటిది. 1940 వ సంవత్సరంలో ప్రకటిత

మైన "పసిఫిక్ ద్వీపాలకు సముద్ర ప్రయాణానికి సూచనలు" అనే పుస్తకమూ, మా దగ్గఱ ఉన్న రెండురకాల ఛార్టులూ, ఎరిక్కు పరిశీలనలూ, నాలుగూ నాలుగువిధాలుగా ఈ ద్వీపం ఉనికి సూచిస్తున్నాయి. అయినప్పటికీ, ఆ ప్రాంతంలో మరే ద్వీపమూ చేరువలో కనిపించనందున, ఇదే "పుకా-పుకా" అనటంలో సందేహం అక్కఱలేదు.

ఇప్పుడు నౌకమీద ఇందాకటి కోలాహలంలేదు. తెఱచాప తిరిగిపోయి, చుక్కాని దానికి అనుకూలంగా సంఘటిత మైన తర్వాత, మేము నౌకా స్తంభంమీదకు ఎక్కిగానీ, వేణు మందిరం వెలుపల నిలబడి కానీ, మౌనంగా, ఆ కదలిపోతున్నట్లున్న ద్వీపం వైపు వింతిగా చూస్తున్నాము. చిట్టచివఱకు ఈ మూడు నెలలనుంచీ మేము ప్రయాణంచేస్తూనేఉన్నామనటానికి, ప్రత్యక్షసాక్ష్యం లభించింది. మేము బయలుదేఱినప్పుడు మమ్మల్ని పరివేష్టించిఉన్న గగనభాగం క్రిందనేలేము అంతో ఇంతో కదలివచ్చినమాట సత్యం. మాకు ఆద్వీపం ఒక సంచారద్వీపమే అనిపించింది. 'అప్పుడే అది ఆకస్మికంగా మాకు చిరకాల నివాసస్థలంగా ఉన్న సముద్రాన్ని ప్రవేశించిందేమో!' అనికూడా తోచింది. మా నౌక పశ్చిమాభిముఖంగా పోతూఉన్నప్పటికీ, ద్వీపంవైపు గ్రుడ్లప్పగించి చూడటంకంటే, అక్కడికి చేరుకో గల అవకాశం కనిపించనప్పటికీ, 'పాలినేషియా ప్రాంతంలో ప్రవేశించాములే!' అన్న సంతృప్తి మాత్రం కలిగింది.

సూర్యోదయం అయిన కొద్దిసేపటిలోనే ద్వీపంలోని వృక్షాగ్రాలకు వెనుకగా, దీప నడిమికి కొంచెంపడమరగా, ఒక ధూమరేఖ ఉదయించి, నిట్టనిలువుగా పోవటం చూచాము.

అది ఎంతవఱకు ఎదుగుతున్నదో చూచిచూచి, ఆ ద్వీప వాసులు ప్రాతఃకాల భోజనాలకోసం వంటలు ప్రారంభించి ఉంటారని ఊహించాము 'తీరాన సముద్రం పరిశీలిస్తూఉండే వారు మాకు ఆహ్వానసూచనగా ఆ పొగ సృష్టించి ఉంటారన్న ఆలోచనే రాలేదు. ఏడుగంటలకు ఆ పొగలోనుంచి ఒక విధమైన పరిమళం సాగివచ్చి, లవణవాతావరణంతో చిర కాలంగా నవసిపోయిన మా నాసికలకు చుంచివింపు చేసింది. దానితో ఫాటుహివాద్వీపంలో ఉన్నప్పుడు నాకు అనుభూత మైన సువాసన ఒకటి జ్ఞాపకానికి వచ్చింది. ఒక అరగంట గడిచేసరికి సద్యఃఖండితాలైన దారుమండలాల పరిమళమూ, స్వచ్ఛమైన వనసౌరభమూ వీతెంచాయి. ఇప్పటికి ద్వీపం మాకు క్రమక్రమంగా వెనుకపడటం ప్రారంభించింది. దాని మీదనుంచి వచ్చే స్వేచ్ఛావాయువు తెరలు తెరలుగా వస్తూ, మాకు చక్కలిగింతలు పెట్టింది. ఒక పావుగంట అలా జరిగిన తర్వాత, నేనూ, హెర్మనూ నౌకాస్తంభానికి ఎగబ్రాకి, పచ్చని ఆకులలోనుంచి దూసికొనివచ్చే సురభిళానిలాన్ని ఆఘ్రాణిస్తూ ఆనందించాము. ఇది పాలినేషియా ద్వీపమే! తొంభైమూడురోజులపాటు సముద్రంలో ఉప్పుతో మునిగి తేలినమాకు, సాగరాచుంబితమైన భూమధ్యంనుంచి వచ్చే విశిష్ట సౌరభం ఎంత ప్రమోదహేతువైందో; మాటలలో చెప్పటం ఎలాగు! బెంగ్టు అప్పటికే వేణుమందిరంలో దూరి గాఢంగా నిద్రిస్తున్నాడు. ఎరిక్కు టార్‌స్టీనులు వేణుమందిరానికి ఆను కొని ధ్యానముద్రలో ఉన్నారు. నట్ లోపలికీ, బయటకూ

పరుగెత్తుతూ, వనసౌరభాన్ని ఆఘ్రాణిస్తూ, దినచర్య పుస్తకంలో ఆ అనుభవాన్ని గుఱించి వ్రాసికొంటున్నాడు.

ఎనిమిదిన్నరకు పుకా-పుకా మాకు కేవలం వెనుకగా ఉండిపోయింది కానీ, తెఱచాప స్తంభంమీదికి ఎక్కితే కన బడుతూనే ఉన్నది. పదకొండుగంటలదాకా రేఖామాత్రంగా కనిపిస్తూ ఆపైన అదృశ్యంఅయింది. తర్వాత 'కుములూనింబన్' మబ్బుమాత్రం ద్వీపం ఉన్నట్లు గుర్తుగా కనబడుతూ వచ్చింది. పక్షులన్నీ అదృశ్యమైనాయి. అవి ద్వీపాభిముఖమైన వాయువునే అభిమానించినట్లున్నాయి. ఉదరపూజ ముగించుకొని, సాయంకాలానికి తనుతావులకు చేసికొంటూ ఉండేటప్పుడు, అవి ఆ సురభిళ పవనాన్నికూడా తముతోబాటు తీసుకువెళ్ళాయేమో; అనిపించింది. బేడిసలుకూడా అరుదుగా కనబడుతున్నాయి. ఇక కొన్ని చుక్కానిచేపలు మాత్రమే నావ అడుగున దూరాకి ఉన్నాయి.

ఆ రాత్రి తనకు ఒకకుర్చీ, నేజాబల్ల కావాలన్నాడు బెంగ్టు. వెలికిల పరుండి చదువుతూఉంటే చాలా శ్రమగా ఉన్నదట! ఆశ్రమ గనుక లేకపోతే, ద్వీపానికి చేరుకోలేకపోయినందుకు అతను విచారపడేవాడు కాడట! ఇంకా మూడు పుస్త-కాలు చదువవలసినవి ఉన్నాయి పాపం! టూర్స్టీనుకు ఆపిల్ పండు మనసైంది. ఒక రాత్రిపూట నాకు అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. కారణం మాంసపుసొట్టెల వాసనా ఉల్లిపాయల వాసనా వచ్చినట్లుండటం; తీరాచూస్తే, అది ఉల్లిపాయల వాసనాకాదూ మఱే సుగంధమూకాదు, ముక్కుపుటాలు పగిలిపోయే ముఱికికొంపు!

ఆ మరుసటి ఉదయమే మిన్నుమన్నూ కలిసే చోటికి కొంచెం ఇవతల, రెండు క్రొత్త మబ్బులు కనిపించాయి. ప్రపంచపటం పరిశీలించగా, ఆ మబ్బులకు అడుగు భాగాన ఫాంగహీనా, అంగాటౌవ్ అనే శిలామయద్వీపాలు ఉన్నట్లు తెలిసింది. అంగాటౌవ్ పైభాగాన కనిపించిన మబ్బు అక్కడకు మమ్మల్ని ఆహ్వానిస్తున్నట్లున్నది. గాలివాటం అటు వెళ్ళటానికి అనుకూలంగా ఉన్నది. వెంటనే తెరచాపను తదనుగుణంగా త్రిప్పి, చుక్కాని సరిచేసి, ఉల్లాసంతో నావను నడపించాము. ఈనాడు కోన్-టికీ మీద ఆనంద దేవత నెలకొన్నది. ఇక మా యీ సుదీర్ఘ సముద్రయానం త్వరలో పరిపూర్తి అవుతుంది. ఎన్ని ఆటంకాలు వచ్చినా, ఆ ద్వీపానికి మేము చేరుకోగలమని దృఢవిశ్వాసం కలిగింది.

మూడు అహోరాత్రాలు ఏ అవరోధాలూ లేకుండా పురోగమించాము. నాలుగవరోజు ఉదయాన హెర్మన్ చుక్కాని విడిచివచ్చాడు. టార్స్టీను అతని స్థానంలో పని చేస్తున్నాడు. "వెన్నెలలో దూరాన ఒకపల్లపునేల కనిపించినట్లున్నది" అన్నాడట హెర్మన్. సూర్యోదయం కాగానే హెర్మన్ వేణుమందిరంలోపలికి తొంగిచూస్తూ ఇల్లా కేక వేశాడు:

"అదిగో నేల !"

అందఱమూ ఒక్కసారి బయటికి దుమికాము. తత్క్షణమే మా నావలో దాచిఉన్న పతాకాలన్నీ బయటికి తెచ్చి ప్రతిష్ఠించటం మొదలుపెట్టాము. మొదట నార్వే పతాకం ఎగరవేశాము. తర్వాత ఫ్రెంచి వలసప్రాంతానికి చేరుకొంటు

న్నాము కనుక, ఫ్రెంచివతాకాన్ని నౌకా స్తంభంపైన కట్టాము. అటుతర్వాత అమెరికా బ్రిటన్ పెరూ స్వీడన్ దేశాల పతాకాలు కట్టాము. ఇవికాక మానావిక పరిషత్పతాకం ప్రత్యేకంగా ప్రతిష్ఠించాము. పతాక వితానంతో నౌక అపూర్వ సౌందర్యం ఒలుకబోసింది. కోన్-టికీ విశిష్టత దర్శనీయమైనాతున్నది. ఇప్పుడు ఈ ద్వీపం సరిగా మాకు త్రోవలోనే ఉన్నది. నాలుగురోజుల క్రిందటి ఉదయాన పుకా-పుకా ఇదేవిధంగా కనిపించింది. అయితే అప్పుడు నావకూ ఆ ద్వీపానికీ ఉన్న యెడంకంటె ఇప్పుడు ఇది మాకు కొంచెం ఎక్కువ దూరానే ఉన్నది.

మాకు వెనుకవైపున సూర్యుడు ఉదయించి బాగా పైకి వచ్చేసరికి, ద్వీపంపైన అంతరాళంలో ఒక ఆకుపచ్చనికాంతి కనిపించింది. ద్వీపాన్ని ఆవరించి సముద్రంలో మునిగిఉన్న పర్వతశిఖరాలమీద అత్యంతహరితంగా ఉన్న శిలా వలయాల లోని కాసారచ్ఛాయే అలా ప్రతి ఫలిస్తున్నది. శిలా వలయాల లోపలి కాసారచ్ఛాయ ఈ విధంగా ఆకాశాన ప్రసరించటం వల్ల పూర్వకాలపు నావికులకు చాలాదూరంలో ఉండగానే ఆ ఆకుపచ్చనికాంతికి అడుగున సముద్రంలో మునిగిన కొండలు ఉన్నాయని తెలుసుకోటానికి వీలుకలిగేది.

పదిగంటలకు చుక్కానిపట్టటం అవసరమైంది. మేము ద్వీపాన్ని చేరుకోటం నిస్సందేహమైనా, ఏవైపు తీరానికివెళ్ళటం సుకరమో తేల్చుకోవలసి వచ్చింది. ఇప్పటికే ఆ ఆకుపచ్చని నీడకు ఎదురుగా ఉన్న చెట్లను గురించి ఏవి ఏచెట్లో చెప్పగలిగినంతదగ్గరకు వెళ్ళాము. కొంతసేపటికి వృతాగ్రాలే

కాకుండా ప్రకాండాలుకూడా అతి విస్పష్టంగా కనిపించాయి. ద్వీపానికీ, మాకూమధ్య సముద్రంలో ఒకకొండ ప్రచ్ఛన్నంగా ఉన్నదనీ, దానిదగ్గఱకే వెళ్ళితే అపాయం తప్పదనీ గ్రహించాము. ఈ కొండ తూర్పుముఖంగాఉన్న ఒక ప్రవాహానికి అడుగునఉన్నది. ఆ ప్రవాహం ఈ కొండచేరగానే అటుతర్వాత పల్లంగా ఉన్నందున, కొనదేరిన శృంగంనుంచి తటాలున క్రిందపడేటప్పుడు రోషంతో గర్జిస్తున్నట్లు ధ్వనిస్తున్నది. ట్యూమాటో ద్వీపసముదాయందగ్గఱ, ఇటువంటి సముద్రగత పర్వతశిఖరాలకు తాకి, అనేక నౌకలు ఛిన్నాభిన్నమై పోయాయి.

సముద్రంనుంచి చూస్తే, ఈ అంతర్గత కారాగారం మాకు కనిపించనేలేదు. అలలను అనుసరించి పోతూఉంటే, తరంగంవెంట తరంగం ఈ ప్రాంతాన సుడితిరిగిపోయి, తర్వాత ద్వీపంవైపు వెళ్ళటం కనిపించింది. ఆ పర్వతశిఖరమూ, దానిమీదనుంచి దొఱలిపడుతున్న ప్రవాహమూ, మా ముందు పయనించే కెఱటాల విజృంభణంలో మాటుపడి ఉన్నాయి. కాని, ద్వీపం ఈ చివఱనుంచి ఆ చివఱకుచూస్తే, ఉత్తరానా, దక్షిణానా కూడా, తీరందగ్గఱనుంచి కొన్నివందల గజాల దూరంలో, సలసల క్రాగుతున్న తెల్లని ద్రవపదార్థంలాగా, సముద్రజలం ఉప్పొంగుతూ, ఎంతోఎత్తుగా ఎగిరిపడటం కాన్పించింది.

ద్వీపం దక్షిణాగ్రానికి సుదూరంగా ఈ అపాయకర ప్రదేశాన్ని తప్పించుకొని పోవటానికి చుక్కాని సరిచేసి, ప్రయాణం సాగించాము. ఈ శిలావలయానికి ప్రదక్షిణంగా

నావను నడిపించి ద్వీపంవైపు పోవాలనీ, ఒకవేళ ఏ కారణం చేతనైనా ఈ చోటనే మేము చిక్కుపడితే, లంగరు వేసికొని అనుకూలవాయువు వీచేవఱకూ నిరీక్షించాలనీ నిశ్చయించుకొన్నాము.

మధ్యాహ్నసమయానికి దూరదర్శినీ యంత్రంవల్ల, ద్వీపంపైన ఉన్న చెట్లలో కొన్ని కొబ్బరిచెట్లుకూడా ఉన్నాయని తెలిసికొన్నాము. అవి బాగా ఏపుగా ఎదిగిఉన్నాయి. వాటికి ముందటిభాగంలో తీరంవెంట పెద్దపెద్దపాషాణవంక్తులూ, వాటిచుట్టూ సికతాస్థలాలూ ఉన్నాయి ఇవితప్పితే కొబ్బరి చెట్ల తోపులమీద విహరించే తెల్లని పిట్టలుగాక, ప్రాణులున్నజాడ యేకోశానా కనబడటంలేదు.

రెండుగంటలయేసరికి, మేము ద్వీపం ప్రక్కగా ప్రయాణిస్తున్నాము. రెండవప్రక్క ఆ దారుణ పర్వతశిఖరం కనిపిస్తున్నది. దగ్గఱపడుతున్నకొద్దీ, ఆశిఖరంమీదనుంచి విఱిగిపడుతున్న సెలయేటిహోరు కర్ణగోచరమవుతున్నది. ఆ ఘోషం వింటూఉంటే మా నావకు సమాంతరంగా ఒక ఎక్స్ప్రెస్ రైలుబండి పరుగెత్తుతున్నట్లున్నది. కొండకూ మాకూ నడుమ ఉన్న అలలపైనుంచి ఎగిరిపడుతున్న నీటితుంపురులు విశదంగా కనిపిస్తున్నాయి. సరిగా అక్కడనే రైలుబండిమ్రోత వినిపిస్తున్నది.

ఇప్పుడు ఇద్దరేసి మనుష్యులు చుక్కానితో అవస్థపడుతున్నారు. వారు వేణుమందిరానికి వెనుకభాగంలో ఉండటంవల్ల నావకు ముందు ఏమున్నదీ వారికి కనిపించదు. ఎరిక్కు వంటఇంటిమీద నిలబడి నావికత్వం వహించి, ఏ సమ

యానికి చుక్కాని ఎటు త్రిప్పవలసినదీ తెలియజెప్పుతున్నాడు. అపాయం సంభవించనంతసేపుదాకా, ఈ కొండకు సమీపంలోనే ప్రయాణం చెయ్యాలని మా ఉద్దేశం. నౌకా స్తంభం చివరిదాకా ఎక్కి, పర్వతశిఖరాన్ని పరిశీలిస్తున్నాము. ఎక్కడైనా కొంచెం సందు చిక్కితే, ఆ సందునుంచి నావను నడిపించవచ్చుననుకొంటున్నాము ప్రవాహం కొండప్రక్కనుంచే సాగుతున్నది కానీ, ఎక్కడా మెలికలు తిరుగలేదు. వదులుగా ఉన్న నడివలకలు వాయుగతికి 20° అటుకాని, ఇటుకాని నౌకను త్రిప్పటానికి వీలుగా ఉన్నాయి

ఎరిక్కు యథాపూర్వంగా చుక్కానివద్ద నున్నవారికి మార్గదర్శకత్వం వహిస్తున్నాడు. నేనూ, హెర్మనూ రబ్బరు డింగీలో ఎక్కి బయటకు వెళ్లాము. డింగీకి నావకూ త్రాడు బిగించిఉన్నాము కనుక, మాకు ఏమీ భయంలేదు. నావ కొండకు బాగా లోపలిభాగానికి వచ్చేసరికి, మేమూ దాని తోనే ప్రయాణించి, సెలయేలు దుముకుతున్న ప్రాంతం పరిశీలించాము. అలలు వెనుకకు ఏ విధంగా మళ్ళిపోతున్నదీ చూచాము. పచ్చనిగాజులాగా ప్రకాశిస్తున్న నీళ్ళలోనుంచి, త్రుప్పుపట్టిన చుక్కాని తెడ్డుమాదిరిగా కనిపిస్తున్న పర్వతశిఖరాన్నీ చూచాము; తీరంవెంట మా కనుచూపుమేరలో ఎడం అన్నది కనిపించలేదు. అందువల్ల ఎరిక్కు నౌకను వెనుకకు త్రిప్పించి, అపాయస్థలంలో చిక్కకుండా చెయ్యటానికి ప్రయత్నించాడు.

పర్వతశిఖరంపైపునుంచి అవతలికి వెళ్ళటానికి కోన్-టికీ దుమికినప్పుడల్లా డింగీలో ఉన్న మా యిద్దరికీ ప్రాణాలు

గుప్పిట్లో పెట్టకోవలసివచ్చింది. నౌక వెనుకకు ఊగేటప్పటికి, మేము కేవలం అలలమీదనే ఉన్నట్లున్నాము. వాటి ఘోషం కర్ణకఠోరంగా ఉండటమేకాకుండా, గుండెలవియజేస్తున్నది. ప్రతిపర్యాయమూకూడా ఎరిక్కు దూరంగా వెళ్ళిపోయాడనీ, కోన్-టికీ ద్వీపానికి చేరుకొనే యోగం మాకు లేదనీ భయ కంపితులమవుతున్నాము. "త్రాడు తెగనే తెగింది; పుట్టి మును గనేమునిగింది." అనుకొంటున్నాము. సెలయేటి వేగం మమ్మల్ని కొండవైపు నెట్టివేస్తుందని అనుకోక తప్పటంలేదు. కాని ప్రతి పర్యాయము ఎరిక్కు అపాయానికి గురికాకుండా, ఎంతో చురుకుగా వ్యవహరిస్తున్నాడు. నావ సురక్షితంగా బయట బడుతున్నది. ఈ సమయంలో మేము ద్వీపానికి బాగా దగ్గఱ గానే ప్రయాణిస్తున్నాము. అందువల్ల తీరభూమి విస్పష్టంగా కనిపిస్తున్నది. అయితే దానికి అవతలనే ఉన్న సౌందర్యలక్ష్మి పర్వతశ్రేణిమాటున ఉండటంచేత, మాకు ఎంత ప్రయత్నిం చినా దర్శనం ఇవ్వలేదు.

సుమారు మూడుగంటలవేళకు తాటిచెట్లతోపు ఒకటి తీరంమీద కనిపించింది. అక్కడ కొంతదూరంనుంచి శిలావల యాలను చూచాము. అంతవఱకూ కూడా ఉన్న పర్వతశిఖరం ఎఱ్ఱని కోఱలు బయటబెట్టి, మమ్మల్ని మ్రింగేట్టు కనిపిస్తున్నది. అక్కడా సందు కనిపించలేదు. అందువల్ల ముందుకుపోయాము. తాటిచెట్లతోపు అదృశ్యమయింది. వాయువు మమ్మల్ని బాగా ముందుకు త్రోసివేస్తున్నది. తాటిచెట్లతోపు చూపుమేఱ దూరం దాటిపోగానే గిరిమయద్వీపం లోపలిభాగం కొంత కనిపించింది. దీనిచుట్టూఉన్న ఒక శిలావలయం లోపలి ఉప్పు

నీటి సరస్సు అతి సుందరంగా ఉన్నది. సరస్సు చుట్టూ గాలికి కదలుతున్న కొబ్బరిచెట్లు కనిపించాయి. అక్కడక్కడ రేవులూ ఉన్నాయి. ఈ ఒంటరికీవిచుట్టూ వెడల్పయిన ఇసుక నేల ఉన్నది. దీనిచుట్టూ ఇంకొక శిలావలయం ఉన్నది. అది గ్రుష్పపట్టి ఎత్తుగా ఉన్న కత్తిలాగా ఉండి. స్వర్గద్వారాలను చేరనియ్యని పెనుభూతమేమో; అనిపిస్తున్నది.

మొత్తంమీద ఈ పగలంతా అంగాటూవ్ చుట్టూ తిరగటంతోనే సరిపోయింది. వేణుమందిరం బయట కూర్చుని, ఆ ద్వీపంపంక చూస్తూ, గుక్కిళ్ళు మింగటంకంటె, ఏమీ చెయ్యలేక పోతున్నాము. సూర్యకాంతి తాటిచెట్లమీద ప్రస రించి, మనోజ్ఞంగా ప్రకాశిస్తున్నది. ద్వీపంలోపల సర్వం సుసం పన్నమే! అయితే అది మాకు అందరాని ద్రాక్షపండే!

ఈ ప్రదక్షిణం నిత్యకృత్యంగా కనిపించేసరికి, ఎరిక్కు తన గైటర్ వాద్యం తీసుకొని, సంగీతం ప్రారంభించి, దక్షిణ సముద్రాన్ని గూర్చినగేయాలు ఆలపిస్తున్నాడు. బెంగ్టు తన శక్తి సామర్థ్యాలన్నీ భోజనంమీద ప్రకటిస్తున్నాడు. మేము పెరూనుంచి తెచ్చుకొన్న ఒక పురాణ నారికేళం మూతిదగ్గఱ కన్నంపెట్టి, దాని నీటితో దాహం తీర్చుకొని, ద్వీపంలో చెట్ల నుంచి వ్రేలాడుతున్న లేతకొబ్బరి బొండాల్లోని ఎడనీరు త్రాగి నట్లే సంతృప్తిపడ్డాము. ద్వీపంమీద వ్రేళ్ళుపాతుకొని స్థిరంగా నిలబడ్డ తాళవృక్షాగ్రాల మనోజ్ఞతా, వాటిపైన యథేచ్ఛగా విహరిస్తున్న తెల్లని పక్షులనూ చూస్తూఉంటే, కలిగే ఆనం దమూ, గుండ్రని అద్దంలాగా కనిపిస్తున్న లవణాసార సౌంద ర్యమూ, అరుణపర్వతశిఖరం కౌటిల్యమూ, రివ్వున వీస్తున్న

గాలిలోని సంగీతమూ మమ్మల్ని ఆటుగుర్చి మరేమీ ఆలో చించనివ్వలేదు. అప్పటి అనుభూతి ఎప్పటికీ మఱపురానిది. పారావారానికి రెండవ ఒడ్డు చేరుకొన్నామనటంలో సందేహం లేదు. ఇంతకంటె నిశ్చిష్టమైన దక్షిణసముద్ర ద్వీపం మఱొకటి మేము చూచేదిలేదు. భూమిమీద కాలుపెట్టనీ; పెట్టకపోనీ! ఎల్లాగైనాసరే, మేము పాలినేషియా చేరుకొన్నాము! విశాల సముద్రం అంతా మాకు వెనుకవైపుననే ఉన్నది!

అంగాటాన్ సందర్శనంవల్ల సంతృప్తి పొందుతున్న ఈరోజుకు, మేము సముద్రయానం ప్రారంభించి తొంభై ఆఱు రోజులు గడిచాయి. ఇది తొంభై ఏడవరోజు. మఱొకవిధంగా కూడా, ఈరోజు మాకు ఉత్సాహజనకమైంది. న్యూయా ర్కులో ఉండగా, పాలినేషియాలో దగ్గఱి ద్వీపానికి చేరుకొన టానికి తొంభైఏడురోజులు పట్టుతుందని మేముఅనుకొన్నాము. ఆ అనుకొన్నమాట ఇప్పుడు ఫలించింది.

సుమారు అయిదుగంటలవేళకు తీరంపైన రెండు కుటీ రాలు కనిపించాయి. కాని, వాటిలో మనుష్యులున్న జాడ లేనేలేదు.

అయిదున్నరగంటలకు మళ్ళీ మాకు ఎదురుగా పర్వత శిఖరం కనిపించింది. ఇప్పటికి ద్వీపం పశ్చిమాగ్రం సమీపిస్తు న్నాము. ఇక్కడనయినా స్రోవపక్షైనా కనిపిస్తుందేమో, అనే ఆశతో కడసారి పరీక్షచేశాము. సూర్యుడు బాగా సముద్రం మీదికివచ్చి, మాకు కేవలం ఎదురుగా ఉండటంవల్ల కండ్లలో పొడుస్తున్నాడు-ద్వీపం చివఱికొనకూ, పర్వతశిఖరానికి మధ్య సముద్రంమీద ఇంద్రధనుస్సు ప్రత్యక్షమైంది. ఇదిమాకు ముందు

ఒకవంతెన ఉన్నట్లు భ్రమింపజేస్తున్నది. తీరానికి కొంచెం లోపలభాగంలో నల్లనిమచ్చలవంటివి నివసింపాయి. ఆ మచ్చలలో ఒకటి మెల్లగా తీరందగ్గరకు వచ్చింది మిగిలిన వాటిలో అనేకం నృత్యపక్షులవైపు పరుగెత్తుకొని పోయాయి. అవి మచ్చలు కావు. మనుష్యులు! మేము సాహసించి పర్వతశిఖరం ప్రక్కనుంచి పోవటం మొదలుపెట్టాము. అప్పటికి గాలిఅన్నదే లేదు. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా, ద్వీపానికి అనుగున పడి మునిగిపోతాము. ఇంతలో ఒక తాటిబోదెలో ఇద్దరు మనుష్యులు కూర్చుండి, ద్వీపంనుంచి బయలుదేరి వస్తున్నారు. తాటిబోదె డోల్లు డింగీలాగా ఉపయోగించటం సర్వసాధారణమైన విషయమే. ఆ విధంగా ద్వీపంనుంచి బయలుదేరిన యిద్దరూ పర్వతశిఖరం అవతలివైపునుంచి ప్రయాణిస్తూ అలలతో తాటిబోదె దుమికిపడుతుంటే, నిర్భయంగా ద్వీపానికీ, పర్వతశిఖరానికీ మధ్యనుంచి మా దగ్గరకు వస్తున్నారు.

మేము ఉన్నచోటికి దిగువ సన్నని సందు ఉన్నదన్నమాట. ద్వీపానికి చేరుకోవాలంటే, మేమూ అటే ప్రయాణం చెయ్యాలి. ఇప్పటికీ, మాకు తాటితోపుల మధ్యనుంచి ఊరు కన్పిస్తున్నది. కాని నీడలు క్రమక్రమంగా విస్తరిస్తున్నాయి. వెలుతురు అంతరించి పోతున్నది.

ద్వీపవాసు లిద్దరూ మా వైపుచూచి, చేతులు ఆడించారు. మేమూ సకౌతుకంగా హస్తచాలనం చేశాము. వారు తొందరగా తెడ్లువేస్తూ ప్రయాణవేగం హెచ్చించారు. అది పాలినేషియావాసుల సముద్రతరణ సాధనం. దానిలో కూర్చున యిద్దరూ గోధుమవర్ణంగా ఉన్నారు. మా వైపే

చూపులు నిగుడ్చి తెడ్లు వేస్తున్నారు ఇక్కడ భాషాసమస్య తల యెత్తింది. నేను ఫాటుహీవా లో ఉండగా, మార్క్వెసాస్ మాటలు కొన్ని నేర్చుకొన్నాను. కాని, పాలినేషియన్ భాష కొంచెం జటిల గా ఉంటుంది. అభ్యాసం లేకపోవటంవల్ల, నేను నేర్చుకొన్న నాలుగుముక్కలూ మఱపున పడ్డాయి.

పాలినేషియన్ల డింగీ మా నావప్రక్క ఆగింది. ఆ యిద్దఱువ్యక్తులూ కోన్-టికీ పార్శ్వంమీదికి వచ్చారు. వారిలో ఒకడు మాతో కరచాలనంచేస్తూ, నవ్వుతూ, ఇంగ్లీషులో 'గుడ్ నైట్;' అని సాదరంగా అన్నాడు. అంతటితో మా భాషాసమస్య పరిష్కృతమైనట్లు తోచింది.

నేను ఆశ్చర్యంతో 'గుడ్ నైట్!' అని "మీకు ఇంగ్లీషు వచ్చునా?" అన్నాను.

అతను వెనుకటి మాదిరిగానే నవ్వుతూ, తల అడ్డంగా త్రిప్పుతూ "గుడ్ నైట్! గుడ్ నైట్!" అన్నాడు.

విదేశభాషలలో అతనికి వచ్చిన పదజాలం అంతా ఈ "గుడ్ నైటు" అన్న రెండుమాటలు మాత్రమే. వీటినే అలా పునరుక్తిగా పలికి, అతను తనవెనుకనే ఉన్న స్వదేశమిత్రుణ్ణి వెన్నుచరుస్తూ, "ఏమంటావన్నట్లు చూచాడు. అతనుకూడా, ఏదో గొణుగుతూ, అనుభవశాలిగా కనబడుతున్న తన మిత్రుణ్ణి ప్రశంసించాడు.

నేను ద్వీపంవైపు వ్రేలితో నిర్దేశిస్తూ "అంగాటావ్?" అని ప్రశ్నార్థకంగా ధ్వనించాను.

అతను ఔనన్నట్లు శిరఃకంపంచేస్తూ "హంగాటావ్." అన్నాడు.

ఎరిక్ సగర్వంగా తల పంకించాడు. అతను చెప్పింది నిజమైంది. సూర్యగ్రహ పరిశీలనవలనల్ల అతను నిర్ధారణచేసి చెప్పినచోటికే మేము చేరుకొన్నాము.

'మేయ్ మేయ్ హీం ఇయుటా', అని నేను నా పాలినేషియన్ భాషాపాటవం ప్రదర్శించాను.

"ఫాటుహివా"లో నేను నేర్చుకొన్న పదజాలంలో ఇది ఒకటి. దీనికి సరిఅయిన అర్థం "ఒడ్డుకు చేరాలనుకొంటున్నాము." అని.

అంగాటావ్ వాసులిద్దఱూ పర్వతశిఖరాన అగోచరంగా ఉన్న మార్గంవైపు అంగుళీనిర్దేశం చేశారు. మేము ఆ నిర్దిష్ట మార్గాన ప్రయాణంచెయ్యటానికి చుక్కాని సరిచేసి, మా అదృష్టం ఎలా ఉన్నదో; పరీక్షించుకోటానికి బయలుదేరాము.

అంతలోనే, ద్వీపంనుంచి నూతనవాయువు సాగింది. చిన్నవర్షామేఘం శిలావలయస్థ కాసారంపైన కనిపించింది. ఆ గాలికి కోన్-టికీ జలమగ్న పర్వతశిఖరంనుంచి దూరమయ్యేట్టు తోచింది. మేము పోవలసిన మార్గం వెంట నావ పయనించనట్టు కనబడ్డది. అక్కడి నీటిలోతు ఎంత ఉన్నదీ, తెలుసుకోవాలనుకొన్నాము కానీ, లంగరుత్రాడు చాలదనిపించింది. ఇప్పుడు వెడల్పయిన చిన్న తెడ్లతో నావను నడపుకొని పోవటం కంటె మఱొక ఉపాయంలేదు. అది కూడా చాలా చుఱుకుగా సాగాలి. ఏ కొంచెం బద్ధకించినా, గాలికి లొంగిపోవలసిందే. కనుక తత్క్షణం తెఱచాప దించివేసి, అందఱమూ తలకొక వెడల్పు తెడ్డూ తీసికొని. చుఱుకుగా పని ప్రారంభించాము. అంగాటావ్ వాసులిద్దఱూ మేము ఇచ్చిన సిగరెట్లు కాలుస్తూ,

నావపార్శ్వాన నిలబడ్డారు. వారి కిద్దటికీకూడా చెరొక తెడ్డూ ఇస్తే, కొంత సాయం జరుగుతుందనుకొన్నాను.

కాని వారు అనంగీకారం సూచిస్తూ, శిరఃకంపం చేసి, మార్గంపైపు చూస్తూ భయచలితులైనారు. "మనం అందఱ మూ తెడ్లువెయ్యాలి!" అని సంజ్ఞ చేస్తూ, నేను "ఒడ్డుకు చేరుకోవాలనుకొంటున్నాము!" అని చాలాసూన్లు చెప్పాను. వారిద్దటి లోనూ ముందుకు పోయే మనిషి క్రిందికి వంగి, కుడిచెయ్యి గిఱ్ఱున త్రిప్పుతూ "బర్ ర్ ర్ ర్ ర్ ర్ ర్ ర్ ర్" అని సుదీర్ఘంగా మూలిగాడు.

అతని ఉద్దేశం మాకు బోధపడ్డది. చాలన యంత్రాన్ని (ఇంజను) పనిచేయించవలసిందని అతని అభిప్రాయం. మా నావలో చాలనయంత్రం ఉన్నదని వారు భ్రమించారు. అప్పుడు మేము వారిని నౌక వెనుకభాగానికి తీసికొనివెళ్ళి శాల్వాసుంగలను చూపి, ఇక్కడ ఎటువంటి ఇంజనూ లేదని సంజ్ఞలద్వారా తెలియజేశాము. పాపం వారు మూగవోయి నట్లయినారు. సిగరెట్లు విసరిపాఱవేశారు. అత్యాతురతతో, తెడ్లు వేస్తున్న మమ్మల్ని గమనించకుండానే, నావచివఱకు వెళ్ళారు. అప్పుడే సూర్యాస్తమయ మైంది. ద్వీపం వైపునుంచి ఇంకా గాలి తెఱలు వస్తున్నవి. మేము ఒక్క అంగుళమైనా పురోగమిస్తున్నట్లు లేదు. అంగాటావ్ వాసులిద్దఱూ బెదటి పోయారు. తత్‌క్షణం వారి స్వదేశపు డింగీలో దుమికి అదృశ్యులైనారు. నిశాంగన జుట్టువిఱబోసికొన్నది. మళ్ళీ మేము ఒంటరివారమే అయినాము. ముందుకు పోగలమనేఆశ లేక పోయినా, తెడ్లు విడిచిపెట్టలేదు. మళ్ళొకవైపు కొట్టుకొని

పోకుండాఉంటే, అంతేచాలు ననుకొన్నాము. ద్వీపం అంధకారబంధురం కాగానే, నాలుగుతాటిడొల్లలు మా నౌకను సమీపించాయి. వాటిలోనుండి పాలినేషియన్లు అనేకులు కోన్-టికీ మీదకు వచ్చారు. మాతో కరస్పర్శచేశారు. నేను అందరికూ సిగరెట్లు బహూకరించాము. అనుభవశాలురైన ఇంతమంది ఉండగా, ఇకమాకు భయపడవలసిన పనిలేదను కొన్నాము. మేము సముద్రంలో మునిగిపోతుంటే వారు ఉపేక్షించరు. అప్పూట మేము తీరానికి చేరుకోగలము!

క్షణమైనా ఆలసించకుండా, అంగాటావ్ డింగీలను నాలుగింటినీ కోన్-టికీకి ముడిపెట్టాము. అవి దానికి ముందు విసనకఱ్ఱ ఆకారంగా నిలిచాయి. వేటగానికి ముందు నడచే కుక్కలలాగా కనిపించాయి. నట్ మా రబ్బరు డింగీలో దుమికిపోయి, ఒక అంగాటావ్ డింగీలో తిష్ఠవేశాడు. మేము అయిదుగురమూ కోన్-టికీ ఉభయపార్శ్వాలా కూర్చుని, తెడ్లు చేతబట్టాము. ఇక అప్పటినుంచీ, తూర్పుగాలితో పోరాటం ప్రారంభమైంది.

చంద్రోదయం అయ్యేవఱకూ, చీకటిరాజ్యంచేసింది. నవీనవాయువు పరవళ్ళు త్రొక్కింది. ద్వీపంమీద అక్కడి గ్రామవాసులు పెద్దపెద్దమంటలు వేశారు. ఆ వెలుగులో మేము త్రోవ గమనించుకొంటూ, ఒడ్డుచేరుకోవాలని వారి అభిప్రాయం. ఒక మహాజలపాతం మాదిరిగా చప్పులు గింగుర్లు పెట్టుతున్న సెలయేటిపొద అంతకంతకు తారస్థాయి నందుకో జొచ్చింది.

అంగాటావ్ డింగీలను నడుపుతున్న పాలినేషియన్లు

ప్రాకు కనపడటంలేదుగానీ, వారు పాడుతున్న వీరగీతాలు మాత్రం చక్కగా వినిపిస్తున్నాయి. పాలినేషియన్ల స్వరాలు తగ్గినప్పుడల్లా నార్వే చర్చిసుంలోని బృందగేయాలు వీనుల విందుకావటంవల్ల ఆ గాయకుడు నట్ మాత్రమేననీ, అతను వారితోనే కలిసిఉన్నాడనీ గ్రహించాము. ఆ అవ్యవస్థిత గానాన్ని పరిపూర్తి చెయ్యటానికి మేము అయిదుగురమూ "టామ్యుబ్రౌను పట్టికీ-ఎటారుముక్కు చిట్టచివరా-కురుపున్నదీ -ఒక కురుపున్నదీ" అని ఐక్యకంఠంగా పాడుతూ, మేమూ పాలినేషియన్లూకూడా, భరించరాని నవ్వుతో మెలికలు తిరిగి పోతూనే సత్వరంగా నౌకను ముందుకు నడిపిస్తున్నాము.

ఆనంద పారవశ్యంతో మేము తబ్బిబ్బు పడిపోతున్నాము. తొంభైఏడురోజులు! పాలినేషియాలో ప్రవేశం! మాపటికి గ్రామంలో బలేవిందు జరుగుతుంది! అంగాటావ్ వాసులు హర్షధ్వానాలు చేస్తున్నారు; కేకలు వేస్తున్నారు; చప్పట్లు కొట్టుతున్నారు. తహాతీనుంచి కొబ్బరికోసం అంగాటావ్‌కు ఓడ సంవత్సరానికొక్కసారే రావటంవల్ల, ఈ ద్వీపానికి క్రొత్త మనుష్యులు వచ్చారంటే, అదొక వింత. అందువల్ల గ్రామం ప్రవేశించినతర్వాత, తప్పకుండా నెగళ్ళ వెలుగులో విందు జరుగుతుంది.

కాని ఆగ్రహావిష్టుడైనట్లున్న వాయువు తీవ్రంగా విజృంభించాడు. కీలుకీలూ నొచ్చిపోయేటంతగా మేము శ్రమించాము. ద్వీపానికి చేరువ అయినాము కాని మంటల వెలుగు చేరువ కాలేదు. పర్వతశిఖరంమీదనుండి వినవస్తున్న భీకర గర్జ యథాపూర్వంగానే ఉన్నది. క్రమక్రమంగా సంగీతం

అంతరించింది. అందఱూ మౌనం వహించి నిరుత్సాహులైనారు. మనుష్యయత్నం ఎంతవఱకు జరుగనచ్చునో అంతా జరిగింది; అంతకంటె ఎక్కువకూడా జరిగింది. మరేమీ జరుగలేదు. మేము అలలమీదనుంచి ఎగిరిపడుతున్న వ్యాఢుమాత్రం మాతో పాటు నాట్యంచేస్తున్నట్లున్నది. మూడుగంటలసేపు శ్రమ పడ్డాము తొమ్మిదిగంటలైంది. మేము శ్రేండకు తూలిపో జొచ్చాము. మా శక్తి సర్వమూ హరించుకొనిపోయింది.

ఊరినుంచి ఇంకా కొంత సాయం అవసరమని గ్రామ స్థులకు వివరపఱిచాము. "మనుష్యులైతే కావలసినంతమంది ఉన్నారుగానీ, ద్వీపం మొత్తానికి సముద్రయానసాధనాలు నాలుగు తాటి బోదెలే!" అని వారు మాకు తెలియజేశారు.

తర్వాత చీకట్లో నట్ డింగీమీద బయలుదేరటం కని పించింది అతనొకటి ఆలోచించాడు. ఆ డింగీమీద కొంత మందిని తీసికొని రావచ్చును. అతను రబ్బరుడింగీతో ద్వీపా నికి చేరగలడు. కొంతమంది గ్రామస్థులను ప్రోగుచేయగలడు. అయిదారుగురిని తీసికొనిరాగలడు.

ఇది సుకరమైన పనికాదు. నట్టుకే ఇక్కడి స్థానికపరిస్థి తులు తెలియవు. ఆ గాఢాంధకారంలో అతనికి మార్గం ఎలా తెలుస్తుంది ? అందువల్ల మాతో కలసిఉన్న గ్రామస్థులలో నాయకుడులాగా కనిపిస్తున్న వ్యక్తిని మార్గదర్శకుడుగా తీసి కొని వెళ్లాలనుకొన్నాడు. కాని నాకు ఈ ఉపాయంకూడా నిరపాయంగా తోచలేదు. అసిధారలాగా తనుతరమూ, అపాయభరితమూ అయిన మార్గంలో, త్రుళ్ళిపాట్లతో పయ నించే రబ్బరు డింగీలో కూర్చోటం ఈ గ్రామస్థులకు

అననుభూతమైన విషయం. అందువల్ల ఆ నాయకుణ్ణి పిలిచి, అతని సలహా తీసుకొందామని, నట్‌తో అన్నాను. ఆ నాయకుడు మాకు ఎట్టయెదుటనే తాటిబోదె నడుపుతున్నాడు. ఇక ఎంతోసేపు ఈ విధంగా నిలబడలేమనీ, వెనుకకు కొట్టుకొని పోక తప్పదనీ మాకు అందఱికీ స్ఫురించింది.

నాయకుడికోసం అన్వేషించటానికి నట్ వెళ్ళాడు. తర్వాత కొంతసేపు గడిచింది నట్ నాయకుణ్ణి వెంటబెట్టుకొని రాలేదు. మేము ఎంతపిలిచినా, పాలినేషియన్ల కోలాహల ధ్వనులుతప్ప నట్ దగ్గఱనుంచి జవాబు వినిపించలేదు. ఆ గాఢాంధకారంలో అతను అదృశ్యుడైనాడు. వెంటనే జరిగిందేమిటో మాకు అర్థమైంది. ఆ మహా కోలాహలంలో మా మాటలు సరిగా వినిపించుకోకుండా, నట్ పాలినేషియన్ నాయకుడితో కలసి వెళ్ళిపోయాడు. మేము పెట్టిన పొలికేకలన్నీ నిరర్థకాలైనాయి. నట్ ఇప్పుడు సెలయేటికి చేసువలో ఉన్నాడు. ఆ ఝరీఘోషంలో మా ఘోష మా కంఠశోషకే కారణమైంది కాని, నట్ కర్ణరంధ్రాలను మాత్రం సమీపించలేక పోయింది.

మేము వెంటనే మోర్సులాంతరుతో ఒకమనిషిని నౌకా స్తంభంమీదికి ఎక్కించి, "వెనుకకురా! వెనుకకురా!" అని పిలిపించాము. మేమూ పిలిచాము.

ఒక్కడూ తిరిగి రాలేదు.

ఇద్దఱు బయటికి వెళ్ళగా, ఒకరు నౌకాస్తంభంమీద నుంచి కేకలువేస్తూఉంటే, తెడ్లువేసే మనుష్యులు తక్కువ కావటంచేతగానీ, వ్యతిరిక్తవాయువు చేతగానీ, మా నౌక వెను

కను కొట్టుకొని పోతున్నది. మేమేమో పూర్తిగా అలసిపోయాము. అందువల్ల నౌకాచిహ్నాలైన పతాకాలు మొదలయినవి తీసివేశాము. మేము మెల్లమెల్లగా వెనుకకు కొట్టుకొనిపోతున్నాము. ఆ పోవటంఅంతా అపమార్గంలోనే. ద్వీపంమీద వెలుగుతున్న మంట అంతకంతకు చిన్నదౌతున్నది. సెలయేటి గొందకూడా వెనుకటిస్థాయిలో లేదు. తాటిచెట్ల తోపు అడుగుభాగానకు మేము చేరువ అవుతున్నకొద్దీ, తూర్పుగాలి తనప్రభావం మామీద అధికాధికం చేస్తూవచ్చింది. ఈ విషయము మేము తిరిగి గమనించాము. ఇప్పుడు కేవలం విశాల సముద్రంమీద పయనిస్తున్నట్లే ఉన్నది. ఆశలన్నీ అడియాసలైనాయని గ్రహించాము. సముద్రంవైపు కొట్టుకొని పోతున్నాము. అయినాసరే, తెడ్లువెయ్యటం మానటానికి వీలులేదు. నట్ క్షేమంగా తిరిగివచ్చేవఱకూ, మా సర్వశక్తులూ వినియోగించి, నౌకను కొట్టుకొనిపోకుండా ఆపటానికి ప్రయత్నించవలసిందే.

అయిదు నిమిషాలు గడిచిపోయాయి. పది నిమిషాలు ! అరగంట గడిచింది! ద్వీపంమీదిమంట ఇంకా తగ్గిపోయింది. అలలమధ్యలో, మేము చిక్కుకొన్నప్పుడు అది అసలే కనిపించటంలేదు ఝరీ నినాదంకూడా మందరస్థాయికి దిగింది.

ఇప్పుడు చంద్రోదయం అయింది. ద్వీపంమీది తాళవృక్షాల వెనుకభాగాన చంద్రికావిలాసం దర్శనీయంగానే ఉన్నది. కాని ఆకాశం అంత నిర్మలంగా లేదు. దాదాపు సగం వఱకు మేఘచ్ఛన్నమైంది.

అంగాటాపు వాసులు తమలోతాము గుసగుస

లాడుతూ, ఏదో ఏకాభిప్రాయానికి వచ్చినట్లు కనబడ్డారు. హఠాత్తుగా ఒక తాటిబోదెకు కట్టిఉన్న త్రాడు ఎగిరి ఇవతల పడ్డది. బోదె కాస్తా అదృశ్యమైంది. మిగిలిన మూటిలోనూ ఉన్నవారు అలసిపోయారు; భయభ్రాంతులూ అయినారు. కోన్-టికీని దానిలో పెట్టటానికి చెయ్యగలిగినంతపని చెయ్యటం లేదు. కోన్-టికీకి సముద్రమే శరణమయింది.

మఱికొంచెంసేపటికి ఈ మూడు తాటిబోదెల త్రాళ్లు కూడా ఇవతలకు వచ్చిపడ్డాయి. ఆ బోదెలు మా ప్రక్కకు వచ్చాయి. ఒక గ్రామస్థుడు మాదగ్గఱకు వచ్చి ఒక్కమాఱు శిరఃకంపంచేసి "ఇయుటా" (ద్వీపానికి) అన్నాడు.

అతనిచూపు ద్వీపంమీద అదృశ్యమాతున్న మంట వైపు ప్రసరిస్తున్నది. మేము అదేపనిగా కొట్టుకొని పోతు న్నాము. సెలయేటిరొద వినబడటమేలేదు. ఒక్కసముద్రపు పొద మాత్రమే వినిపిస్తున్నది. కోన్-టికీ మీద నిరాశ తాండ విస్తున్నది.

మేము గ్రామస్థులందఱికీ సిగరెట్లు బహూకరించాము. నట్ కనుక కనిపిస్తే య్యివవలసింవని, నేను వారికి ఒక చీటీ వ్రాసియిచ్చాను. దానిలో ఉన్నదిది : "నువ్వు డింగీలో బయలుదేఱి వచ్చేటప్పుడు, తాటిబోదెలో ఇద్దఱు గ్రామస్థు లనుకూడా తీసికొనిరా. ఒంటరిగా డింగీలో రావద్దు."

నట్ డింగీతోబాటు అతనికి సాయంగా తమ స్వదేశపు డింగీలో మా నౌకదాకావచ్చి, అతనిని దిగబెట్టటానికి గ్రామ స్థులు సమ్మతించినట్లు మేము గ్రహించాము. వారు అంమకు

అంగీకరించకపోతే, ఒంటరిగా నట్ డింగీలో బయలుదేరి రావటం మంచిదికాదు.

వారు ఆ చీటీతీసికొని, తమ స్వదేశపు డింగీలలో ఎక్కి, స్వల్పకాలంలోనే అదృశ్యులైనారు. ఆ చీకటిలో కడసారిగా మేమువిన్నది మా ప్రథమమిత్రుడైన పాలినేషియన్ పలికిన "గుడ్ నైట్" అన్న పీడ్కోలు లాంఛనం.

మా భాష తెలియని గ్రామస్థులందరూ అతన్ని అభినందిస్తూ ఉండగానే, క్రమంగా వారికీ మాకూ ఉన్న అంతరం పెరిగిపోయింది. ఎటుచూచినా, రెండు వేల సముద్రపు మైళ్ళ లోపల భూభాగం లేనినాడు అనుభవించిన ఒంటరితనం, ఈ నాడు మళ్ళీ అనుభవానికి వచ్చింది.

ఇక తెడ్లు వెయ్యటం అనవసరం. గాలి తీవ్రంగా నౌకను వెనుకకు త్రోసివేస్తున్నది. అయినా నౌకా స్తంభం పైన దీపాన్ని అలాగే ఉంచాము. అయితే "తిరిగిరా" అని మాత్రం పిలవటంలేదు. నట్ కనుక గ్రామస్థులతో కలసి తిరిగి వస్తుంటే, అతనికి మా ఉనికి తెలియటంకోసం దీపాన్ని క్రిందికి తేకుండా ఉంచాము. ఎటుచూచినా చీకటే! అప్పుడప్పుడు మబ్బు తెరచాటునుంచి చంద్రుడు కనబడుతూ, అంతలోనే అదృశ్యుడవుతున్నాడు. ఆ మబ్బు అంగాటావ్ పరిభాషలోని "కుములూనింబస్ మేఘమే" అయి ఉండాలి.

పదిగంటలయేసరికి, 'నట్ తిరిగిరావటం అసంభవం.' అనుకొన్నాము. నావ అంచున, నిశ్శబ్దంగా బిస్కట్లు ముందు పెట్టుకొని కూర్చున్నాము. వంతులప్రకారం ఎవరో ఒకరు నౌకా స్తంభానికి ఎగబ్రాకి, దీపపు వెలుగులు అంగాటావ్ వైపు

ప్రసరింపజేస్తున్నారు. ఆ దీపం వెడల్పయిన తెలిచాపకు సంబంధంలేని ప్రత్యేక దీపగృహంవలె కనిపిస్తున్నది.

నట్ ఎక్కడ ఉన్నదీ తెలిసేవరకూ, రాత్రి అంతా ఆనవాలుగా దీపకాంతి ప్రసారం జరుపుతూనే ఉందామని, నిశ్చయించాము. 'అతను సెలయేటి సుడిగుండాల్లో పడిపోయాడేమో!' అనుకోటానికి మా మనస్సు అంగీకరించటంలేదు. ఎంతటి అలలలో పడ్డా, సుడిగుండాల్లో పడ్డా నట్ మునిగిపోడు. అతను జీవించే ఉంటాడు. పసిఫిక్ ద్వీపానికి చుట్టుదారిలో పాలినేషియన్లతో పాటు అతన్ని విడిచిపెట్టి రావటం శోచనీయం. ఎంత నింద్యమైనపని! అంతదూరం ప్రయాణంచేసి మేము సాధించినది ఏమున్నది? తోడు లేకుండా ఒక మిత్రుణ్ణి అపాయభరితమైన మార్గాన ద్వీపానికి పోయిరమ్మని పంపటమేకదా! కోన్-టికీకి తటస్థించిన విపత్తు తమకుకూడా తటస్థించకుండా ఉండటానికి కదా, మొట్టమొదట మమ్మల్ని కలసికొన్న పాలినేషియన్లిద్దరూ ఇకిలిస్తూ, మా దగ్గర సెలవుపుచ్చుకొని పోయారు! ఇంతకూ అది మాకు దుష్కాలం. నౌకకు బిగించిన త్రాళ్లు అన్నీ తెల్లవార్లూ కీచుకీచుమంటూనే ఉన్నాయి. ఆ రాత్రి మాకు ఎవరికీ నిద్రపోదామని బుద్ధిపుట్టనేలేదు.

పదిగంటల ముప్పైనిమిషాలు అయింది నౌకా స్తంభం మీదనుంచి బెంగ్టు దిగివస్తున్నాడు. చీకట్లో ఎక్కడో దూరం నుంచి కొన్ని కంఠాలు వినిపించాయి. మేము అందరమూ ఆ వైపు చూడటానికి లేచాము. మళ్ళీ మాటలు వినబడ్డాయి. ఆ మాటలు పాలినేషియన్లవి. ఆ గాఢాంధకారంలో మేము ఎలుగెత్తి అరిచాము. పాలినేషియన్లు మాకు ప్రత్యుత్తరంగా

కేకలు వేశారు. ఆ కేకలలో నట్ కంఠంకూడా వినిపించింది! మేము ఉద్రిక్తతతో కేవలం ఉన్మత్తులమైనాము. అంతవఱకూ కలిగిన అలసట అంతా ఏమైందో తెలియదు. ఉత్సాహంతో పెద్దపెట్టున కేకలు వేశాము. అంగాటావ్‌కు చేరకుండా మేము సముద్రంమీద ఎటుపోతేనేమి? సముద్రంలో ఇంకా ఇతర ద్వీపాలున్నాయి. మేము ఆరుగురమూ కలసి ఉన్నంతవఱకూ, కోన్-టికీ తొమ్మిది బాల్సాదుంగలు వాటియిష్టానుసారం ఎక్కడికో ఒకచోటికి తీసికొనిపోతూనే ఉంటాయి.

మూడు అంగాటావ్ డింగీలు అలలమీద చిందులాడుతూ చీకట్లో మావైపే వచ్చాయి. వాటిలోనుంచి కోన్-టికీమీదికి మొట్టమొదట దూకినవాడు నట్టే. అతనివెంట ఆరుగురువచ్చారు. వారు పాలినేషియన్లు ఆ సమయంలో ఎక్కువ మాట్లాడటానికి వ్యవధి లేదు. ఆ పాలినేషియన్లకు ఏదో ప్రతిఫలం ఇచ్చి పంపించాలి. నేలఅనేది కనిపించకుండా, దీపమైనా లేకుండా, అప్పుడప్పుడు ద్వీపంమీద మండే మంటలవెలుగే మార్గదర్శకంగా, ప్రాణాంతకమైన మార్గాన పయనించివచ్చి, వారు మా మిత్రుణ్ణి మాకు ఒప్పగించారు. మేము వారికి అనేకమైన ఆహారపదార్థాలూ, సిగరెట్లూ, ఇంకా ఎన్నో వస్తువులూ పుష్కలంగా బహూకరించాము. వారు చాలా సంతోషించి మాతో కరస్పర్శచేశారు. మా భవిష్యత్తునుగుఱించి వారు ఆందోళనపడ్డారు. మానావ తిన్నగా ఆ భయంకరపర్వతశిఖరంవైపే పోతున్నదని అంగుళితో నిర్దేశించారు. పాలినేషియన్ నాయకుడు కన్నీరుకారుస్తూ, నా చుబుకమెత్తి మృదువుగా చుంబించాడు. దానితో నా పొడవైన గడ్డంమీద నా కెంతో

గౌరవం కలిగింది. తర్వాత వారు వారి డింగీలలో ఎక్కి వెళ్ళి పోయారు. యథాప్రకారంగా మేము ఆరుగురమూ కోన్-టికీ మీద మిగిలాము.

ఇక మేము నావను నిరభ్యంతరంగా పోనిస్తూ నట్ కథ విన్నాము.

పాలినేషియన్ నాయకుడితో డింగీలో వెళ్ళితే, ద్వీపం చేరుకోగలనని నట్ విశ్వసించాడు. ఆ నాయకుడే డింగీ నడిపాడు అంతలోనే కోన్-టికీనుంచి మేము చేసే హెచ్చరికలు గమనించి ఆశ్చర్యపడ్డాడు. డింగీ వెనుకకు త్రిప్పవలసిందని, ఆ నాయకుడితో చెప్పాడు కానీ, అతను అందుకు అంగీకరించ లేదు. అప్పుడు నట్ తెడ్లు తీసికోబోయాడు. అతడు నట్‌ని ప్రతిఘటించాడు. ఆ సమయంలో తగవులాట సాగిస్తే, డింగీ వెళ్ళి సెలయేటి సుడిగుండాల్లో పడిపోతుంది. అందువల్ల, నట్ ఏమిచెయ్యటానికీ వీలులేకపోయింది. ఇంతలో ఒక అలవచ్చి, డింగీని ద్వీపంవైపు నెట్టివేసింది. అక్కడ గుమికూడిఉన్న ద్వీప వాసులు డింగీనిపట్టుకోని, ఒడ్డుకు తీసికొనిపోయారు. నట్ ఒక్కడూ తాటిచెట్లక్రింద నిలబడ్డాడు. అతనిచుట్టూ కొంత మందిచేరి, వారిభాషలో ఏమేమో మాట్లాడుకొంటున్నారు. వారు అందరూ గోధుమవర్ణంగా ఉన్నారు. ఎవరికాళ్ళకూ చెప్పులుగానీ, బూట్లుగానీ లేవు. పిన్నలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ అనేకులు అతిన్ని పరివేష్టించి అతని దుస్తులవైపు ఆశ్చర్యంతో చూస్తున్నారు. వారూ ఐరోపియన్ పద్ధతిలోనే వేషధారణ చేశారుకానీ, ఆ బట్టలు అంత పరిశుభ్రంగా లేవు.

చాలామంది దుస్తులు చినిగిపోయినవి కూడాను. శ్వేతవర్ణులు మాత్రం ఎక్కడా లేరు.

నట్ ఆ గుంపులో మంచి ఉత్సాహవంతులైన వారిని దగ్గఱకుపిలిచి, తనతోబాటు డింగీలో ప్రయాణమై రావలసిందని, సంజ్ఞలద్వారా తెలియజేశాడు. ఇంతలో ఆజానుబాహువైన ఒక స్థూలకాయుడు అతనిదగ్గఱకు వచ్చాడు. నట్ అతని టోపీనిబట్టీ, అధికారిక స్వరాన్నిబట్టీ వారి నాయకుడై ఉంటాడని ఊహించాడు. అతను వస్తుంటే, అంజఱూ ప్రక్కలకు తొలగి త్రోవ ఇచ్చారు. తనతోబాటు కొంతమందిని డింగీలో పంపాలనీ, నావ దూరానికి కొట్టకొనిపోకముందు డింగీ నావకు చేరాలనీ నట్ ఆ పెద్దమనిషికి నార్వే ఇంగ్లీషు భాషలు రెంటిలోనూ చెప్పాడు. అతను నట్ చెప్పిన మాటలన్నీ విన్నాడు. అయితే, అతనికి ఒక్కమాటకూడా అర్థంకాలేదు. తన అనర్గళ వాగ్వైభవం అంతా ఆ విధంగా నిరర్థకమయ్యేసరికి, నట్ నిరుపాయుడైనాడు. ఆ జనసమూహం అతన్ని ఊరిలోనికి బలవంతంగా నెట్టుకొనిపోవటం మొదలుపెట్టింది. కొంత దూరం వెళ్లేసరికి అతనికి కుక్కలూ, పందులూ ఎదురుపడ్డాయి. పండ్లగంపలు తెస్తున్న చక్కని అంగాటావ్ కన్యలుకూడా కనిపించారు. ఆ గ్రామస్థులు ఏవిధంగానైనా ద్వీపంలో ఆగిపోవటానికి నట్‌ని సమ్మతింపజేయాలని ప్రయత్నించారు కాని నట్ కోన్-టికీని తలచుకొని కన్నీరు మున్నీరైనాడు. నట్‌ని ఆపటంలో వారిఅభిప్రాయం సుస్పష్టమైనదే. మా సాంగత్యం వారికి చాలాప్రియమైంది. శ్వేతవర్ణులనౌకలలో అమూల్యవస్తువులూ, అద్భుతవస్తువులూ అనేకం ఉంటాయని వారికి తెలుసు. నట్

కోసం మేము ద్వీపానికి తప్పక రాగలమని వారి విశ్వాసం. ఏ శ్వేతజాతి నౌకవారు అయినా అంగాటాన్ వంటి మారుమూలద్వీపంలో స్వజాతీయుణ్ణి విడిచి వెళ్ళరు.

కొన్ని విచిత్రానుభవాలు కలిగిన పిమ్మట నట్ తిరిగి డింగీవద్దకు రాగలిగాడు. అతని మంచితనాన్నికానీ, దేహమహిమనుగానీ చూచి ముగ్ధులైన స్త్రీ పురుషు లనేకులు అతన్ని అనుసరించారు. అతని కలుపుగోలుతనాన్నీ, ఋజుప్రవర్తననూ అందఱూ అర్థంచేసికొన్నారు. తత్క్షణమే దూరమై పోతున్న నౌకను అతను చేరుకొని తీరాలనీ, అందుకు అతను ఎంత సాహసమైనా చేస్తాడనీ తెలిసికొన్నారు.

ఐతే, అప్పటికీ వారొకయుక్తి పన్నారు. మేము అందఱమూ మఱొక్కదిక్కున ద్వీపానికి చేరుకొంటున్నామని, అతనికి సంజ్ఞలద్వారా బోధపఱిచారు. కొన్ని నిమిషాలు నట్ విభ్రాంతిలో మునిగిపోయాడు స్త్రీలూ పిల్లలూ మంటలు వేసే చోట పెద్ద సందడి బంధులు దేఱింది. మమ్మల్ని సముద్రాన విడిచివచ్చిన మూడు తాటిబోదెలూ అక్కడికి వచ్చాయి. వాటిలోనుంచి దిగినవారు అతనికి చీటీ యిచ్చారు. పాపం! అతను నిరాశాహతుడైనాడు. ఒంటరిగా బయలుదేఱి రావద్దని మా సలహా. అయితే అతనివెంట రావటానికి ద్వీపవాసు లెవరూ అంగీకరించలేదు.

కొంతసేపు ద్వీపవాసులందఱూ తర్జనభర్జనలు జరిపారు. నౌక పరిస్థితుల్ని చూచినవారు నట్టుని ఆపటంవల్ల ప్రయోజన మేమీ లేదని గ్రహించారు. అంతర్జాతీయ భాషలో నట్టు చేసిన శపథాలూ, బెదరింపులూ కొంత సఫలమైనాయి. అందు

వల్ల మూడుతాటిబోదెల్లో కొందరు ద్వీపవాసులు అతన్ని అనుసరించి, కోన్-టికీ దాకా రావటానికి సిద్ధపడ్డారు. రబ్బరు డింగీతోసహా, వారు అతనితో కలసి బయలుదేరుతూ, మిగిలిన వారు విస్మయంతో 'వచ్చిన నూతనుడు వచ్చినట్లే వెళ్ళి పోతున్నాడే!' అని నిశ్చేష్టులై, మంటలదగ్గఱ నిలబడి, డింగీ వైపు చూస్తున్నారు.

తాటిబోదెలు అలలమీదికి లేచివచ్చినప్పుడల్లా, నట్టుకీ, అతనితోడివారికీ కోన్-టికీ దీపప్రసారం మినుకు మినుకు మంటూ కనిపిస్తున్నది. పాలినేషియన్ డింగీలు శరవేగంతో ప్రయాణిస్తూనే ఉన్నాయి కానీ, 'నౌకను ఎప్పుడు చేరుకో గలనా!' అనే ఆతురతలో ఉన్న నట్టుకి అది చాలా దీర్ఘ కాలమే అనిపించింది.

"తీరంపైన కులాసాగా గడిచిందా?" అని టార్స్టీన్ సానూయంగా ప్రశ్నించాడు.

'ఓ! ఆ హావేలియన్ నాట్యకత్తెలను నీవు తప్పక చూచి ఉండవలసింది!" అని నట్ అతన్ని ప్రలోభపెట్టాడు.

మేము తెఱచాపదించివేసి, తెడ్డులోపల పాఱవేసి, వేణుమందిరంలో దూఱి నిశ్చింతగా నిద్రించాము.

మూడు రోజులపాటు నావ అనిశ్చిత గమ్యామై పోతూనే ఉన్నది. ఎక్కడా నేలఉన్నజాడ కనబడనేలేదు.

మాకు ఎదురుగా 40, 50 మైళ్ళమేర సముద్రాన్ని ఆక్రమించిన టేకూమ్, రజోరా, అనే సముద్రగత పర్వతపంక్తి వైపు నావ సాగిపోతున్నది. ఈ భయంకర పర్వతాలకు ఉత్తరంగా నావను నడపటానికి అతిప్రయాస పడ్డాము. పరిస్థితులు

అనుకూలంగానే కనిపించాయి కాని, ఒకరాత్రి కాపలామనిషి ఆందోళనపడుతూవచ్చి, మమ్మల్ని అందరినీ బయటికి రావలసిందని పిలిచాడు.

వాయుగతి మారిపోయింది. మేము తిన్నగా టేకూమ్ పర్వతశిఖరానికి దగ్గఱపడుతున్నాము ఇంతలోనే వానకూడా ప్రారంభమైంది. అంతా అయోమయంగా ఉన్నది. టేకూమ్ శిఖరం ఇక ఎంతో దూరంలేదు.

ఆ నిశీథంలో, మేము 'రానున్న అపాయాన్ని ఎదుర్కోవటం ఎల్లాగా!' అని ఆలోచించటానికి, ఒక అత్యవసర సమావేశం ఏర్పాటుచేశాము. ఇక ఉత్తరదిక్కుగా ప్రయాణించటం అసంభవం. ఇక గిరి దక్షిణపార్శ్వానికైనా చేరుకోవటానికి ప్రయత్నించాలి. అందుచేత మళ్ళీ తెఱచాప ఎత్తి తెడ్లు చేతపట్టాము. ఉత్తర దిక్కునుంచి వచ్చేగాలి నమ్మటానికి వీలులేకుండా ఉన్నది. ఈ వలభై యాభైమైళ్ళ పర్వత పంక్తినీ దాటేలోపుగా, తూర్పుగాలి సాగిందా; మేము సుడిగుండాలపాలు కాక తప్పదు.

'నౌక విచ్ఛిన్నం కావటమే జరిగితే, ఏమి చెయ్యాలి!' అనేదికూడా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాము. ఏమైనా సరే! కోన్-టికీ మీదనే ఉంటాము. నౌకాస్తంభముమీదికి ఎవరమూ ఎక్కము. ఎక్కితే చెట్టుమీదనుంచి రాలినపండులాగా క్రిందపడిపోతాము. కాని అలలు నీటిని చిమ్ముతున్నప్పుడు నౌకాస్తంభాన్ని చుట్టూ బిగియబట్టిన త్రాళ్ళను పట్టుకొని వ్రేలాడవచ్చును. రబ్బరు డింగీని నౌకాపార్శ్వంమీద చేర్చి, అందులో మా యంత్రసామగ్రి, ఆహారపదార్థాలూ

పెట్టి గట్టిగా కట్టివేశాము. మేము సురక్షితంగా గిరిశిఖరాన్ని చేరుకోటం సంభవమైతే, రిక్తహస్తాలతో బయలు దేఱిపోకుండా, ఈ డింగీనికూడా తీసికొనిపోవాలనుకొన్నాము. నౌకలోని కలపకు పెద్ద త్రాడు కట్టాము. నౌక పర్వతశిఖరంవద్ద దెబ్బ తింటే, శిఖరంమీద ఉన్న మేము ఈ త్రాటిని పట్టుకొని కలప అంతా పైకి లాగవచ్చును. తర్వాత నావతో తడుస్తున్న చుక్కానిమనిషికి నౌకారక్షణభారం ఒప్పగించి, మేము వేణు మందిరం ప్రవేశించి శయనించాము.

ఉత్తరపుగాలి వీస్తూ ఉన్నంతవఱకు గిరిపంక్తికి దిగువగా నెమ్మదిగా నౌక వెళ్లుతూనేఉన్నది. కాని ఒక మధ్యాహ్నం గాలి ఆగిపోయింది. తిరిగి అది కదలేసరికి హఠాత్తుగా తూర్పు వైపుగా వీచటం మొదలుపెట్టింది. ఎరిక్క గుర్తుల్ని బట్టి, మేము ఈ గిరిపంక్తికి చాలా దిగువను ఉన్నాము. జాగ్రత్తగా నౌకను నడిపితే,దక్షిణానఉన్న రజోరాగిరుల్ని చుట్టిపోవచ్చును. అటుతర్వాత ఇటువంటి కొండలపాలు కాకుండా సురక్షిత మార్గం చూచుకొనిపోతాము.

ఆ రాత్రికి మేము సముద్రయానం ఆరంభించి నూఱు రోజులు గడచింది. చాలారాత్రి గడచిపోయిన తర్వాత అస్వస్థతతో నిద్రపట్టకపోవటంవల్ల నాకు మెలకువవచ్చింది. అలల కదలికలలో అసహజత గోచరించింది అటువంటి ఘట్టాలలో కోన్-టికీ వెనుకటి నడకను బట్టిచూస్తే, ఇప్పటి నడక చాలా భిన్నంగా కనబడుతున్నది. నావదూలాలు విచలితాలౌతున్నట్లు గ్రహించాను. గిరిపార్శ్వాన సుడిగుండం ఏదో మా నావను ఆకర్షిస్తున్నదనుకొన్నాను. నౌకాపార్శ్వానికి వెళ్ళి, స్తంభంమీది

ఎక్కి చూచాను. సముద్రం తప్ప మరేమీ కనబడటంలేదు. ఇక నాకు నిశ్చింతగా నిద్రపట్టనేలేదు. అలాగే కొంతకాలం గడచింది.

తెల్లవారుతూఉండగా, ఆరుగంటలకుముందే టార్‌స్టీను హడావిడిగా నౌకాస్తంభంమీదనుంచి దిగివచ్చాడు. అతనికి చిన్నచెట్లతో నిండిఉన్న ద్వీపాలు కొన్ని కొంతదూరాన నౌకకు అభిముఖంగా ఉన్నట్లు కనిపించాయి. వెంటనే అన్ని పనులూ కట్టిపెట్టి దక్షిణాభిముఖంగా సాధ్యమైనంతదూరం వెళ్ళాలని, తెడ్లువెయ్యటం మొదలుపెట్టాము.

టార్‌స్టీనుకు కనిపించినవి రజోరా శిఖరానికి వెనుక దారానికి గ్రుచ్చిన ముత్యాలమాదిరిగా ఉన్న చిన్న జాతి గుట్టలు అయిఉండాలి. ఉత్తరదిఙ్ముఖమైన ప్రవాహంలో మేము చిక్కుపడి ఉంటాము.

ఏడున్నరగంటలకు తాటి మొక్కలతో నిండిన లంకలు పశ్చిమాన ఒకవరుసగా కనిపించాయి. పర్వతదక్షిణాగ్రం ఇంచు మించు మా నౌకాముఖానికి సూటిగా ఉన్నది. అక్కడనుంచి లంకలు వరుసగా కన్పిస్తున్నాయి. ముందుకు వెళ్ళినకొద్దీ ఒకొక్కలంక అదృశ్యమైపోతున్నది. బాగా దగ్గరగా కన బడుతున్నవి సుమారు నాలుగైదు సముద్రపుమైళ్ళ దూరంలో ఉన్నాయి.

నౌకాస్తంభంమీదనుంచి పరిశీలించటంవల్ల ఈ గుట్టల వరుసలో నట్టనడిమిగుట్ట మా నౌకాముఖానికి ఎదురుగా ఉన్నది. కాని నావ ప్రక్కకు కొట్టుకొనిపోతూఉండటంవల్ల, ఆ ఎదురుగాఉన్న గుట్టను మేము సమీపించటం జరుగదు. నడి

పలకలు బిగించుకొనిఉంటే, అపాయంనుంచి తప్పించుకోటానికి కొంతఅవకాశం ఉన్నది. కాని నావ వెనుకనే సొరచేపలువస్తూ ఉండటంవల్ల, నీళ్ళలో మునిగివెళ్ళి క్రొత్తత్రాళ్ళతో ఆ పలకలను బిగించటానికి సాహసించలేకపోయాము.

ఇక కోన్-టికీమీద కొన్నిగంటలుమాత్రమే ఉండగలం. పర్వతశిఖరానికి నౌక తాకి భగ్నం అయితే, ప్రాణరక్షణకు తీసుకోవలసిన జాగ్రత్తలు ఇప్పుడే ఆలోచించుకొని, ఇప్పటి నుంచీ అందుకు సిద్ధపడాలి. ఆ సమయమేవస్తే, ఎవరు ఏమి చెయ్యాలో, అందఱికీ తెలుసు. ఎవరిబాధ్యత యెంతవఱకు ఉన్నదీ గుర్తించుకొన్నారు. ఇందువల్ల, ఆ తుదిక్షణాలలో, ఆతురతతో కాళ్ళు విఱుగద్రొక్కుకొనవలసిన పనిఉండదు. గాలి లోపలికి త్రోసివేస్తున్నకొద్దీ, పైకీ, క్రిందికీ లేస్తూ, పడుతూ కోన్-టికీ ఘూర్ణిల్లుతున్నది. గిరిశిఖరం దగ్గఱ, అలలు నుడిపడేచోటికి వచ్చామని విదితమైంది. ఉవ్వెత్తున సాగి వస్తున్న అలలు కొండకొమ్ముకు తాకి, చిందఱవందఱ అవు తున్నాయి.

ఇంకా మాకు నిరాశ కలుగలేదు. జాగ్రత్తగా ఉంటే, ప్రమాదం కలుగకుండా పోవచ్చుననుకొంటూనే ఉన్నాము. కొంతవఱకు ముందుకుపోతూ, మళ్ళీ అంతలోనే ప్రక్కకు కొట్టుకొనిపోతూ ఉండగా, ఆ చిన్నచిన్న గుట్టలకూ, పర్వత శిఖరానికీ ఉన్న సంబంధం ఏమిటో, పరిశీలించాము. పర్వతా గ్రం కొంత నీటిలో మునిగినా, కొంత నీటిమట్టానికి ఎగువగా ఉన్నది. తెల్లని నురుగుమధ్య ఇది ఒక మచ్చలాగఉన్నది. రజోరామీదఉన్న శిలావలయం కోలగాఉన్నది. దానివ్యాసం

సుమారు 25 మైళ్ళు. అదిన్నీ దానితో అనుబంధించిఉన్న ఓకూమ్ పర్వతాన్ని కలుపుకోకపోతేనే. దాని దీర్ఘ పార్శ్వం మాకు అభిముఖంగా ఉన్నది. ఆకాశం ఈ వంపునుంచి ఆ వంపువఱకూ వ్యాపించినట్లున్న పర్వతాగ్రం కొన్ని వందలగజాల పొడుగుమాత్రమే దృశ్యమానమవుతున్నది. తక్కిన దాని మీద ఈ చిన్న చిన్న గుట్టలన్నీ లవణ కాసారంచుట్టూ దారం కట్టినట్లుగా ఉన్నది.

శాంతమహాసముద్రపు నీలజలరేఖ బహుధా విచ్ఛిన్నమై, గిరిపొడుగునా ఎగిరిపడుతూఉంటే, మాగుండెలు అవిసిపోతున్నాయి. జరుగబోయేది నాకు తెలుసు! ఒకప్పుడు నేను ట్యూమాటో పర్వతశ్రేణిని చూచాను. శాంతమహాసముద్రపు కెఱటాలు పర్వతాలవద్ద నిహతాలై విఱిగిపడుతూఉంటే, ఒక ద్వీపం ఒక్కన నిల్చుండి, శక్తిమంతాలైన సులోచనాలగుండా ఆ దృశ్యాన్ని వీక్షించాను. దక్షిణానికిపోయినకొద్దీ క్రొత్త కొండకొమ్ములూ, క్రొత్తక్రొత్త లంకలూ కనబడుతూ వచ్చాయి. అందువల్ల మేము ఈ భీకర శిలాకుడ్యానికి సరిగా మధ్యభాగాన ఉన్నామన్నమాట.

కోన్-టికీ పార్శ్వాన సముద్రయానం ముగింపు కావటానికి అవసరమైన యేర్పాట్లన్నీ చుఱుకుగా సాగుతున్నాయి. విలువైన వస్తువులన్నీ వేణుమందిరంలో చేర్చి, దృఢంగా భద్రపరుస్తున్నారు. నీళ్ళు తగిలితే, చెడిపోయే అవసరపత్రాలూ, కాగితాలూ నీరు చొఱని సంచులలో పెట్టి కట్టివేస్తున్నారు. ఛాయాగ్రాహక పత్రాలు మొదలైనవికూడా, ఇలాగే భద్రపరిచారు. వేణుమందిరంపైన తైలవస్త్రం (కాన్వాసు) కప్పివేసి,

త్రాళ్ళతో గట్టిగా బిగించాము. తప్పుకుపోవటానికి అవకాశం ఏమీ లేదని స్పష్టపడి, ఆశలు అడియాసలైన తర్వాత నౌక ముందటి పార్శ్వాన ఉన్న వాసాలన్నీ ఊడదీసి, త్రాళ్ళన్నీ కోసివేసి, నడిపలకలనుకూడా ఊడదీశాము. నడిపలకలను పైకి లాగటం అసాధ్యం. పెద్దపెద్ద నత్తగుల్లలతో అవి ఆవృతాలై, పట్టుకోటానికి వీలులేకుండా ఉన్నాయి. నడిపలకలతోకలుపుకొని నావ పైఅంచుదాకా ఎంతో ఎత్తులేదు. వెనుక ఉన్న దూలాల మందం ఎంతో, ఇదీ అంతే! అందువల్ల మేము తేలికగా గిరి శిఖరంమీదకు తేలిపోవచ్చును. ఇప్పుడు నడిపలకలు లేవు; తెఱచాప దించి ఉన్నది. నౌక కేవలం గాలీ, అలలూ ఎటు వైపు నెట్టితే అటువైపే పోతున్నది. మానవయత్నానికి ఇక అవకాశమేలేదు. దైవేచ్ఛ ఎలా ఉన్నదో!

వెనుక మేము సొంతంగా ఒక లంగరు తయారుచేసి కొని ఉన్నాము. నౌకా స్తంభానికి అడుగుభాగాన ఒక పొడు గైన త్రాడుకట్టి, రెండవకొన లంగరుకు బిగించాము. గిరి శిఖరం పైనుంచి జాఱిపడే కెఱటాలను చేరినప్పుడు లంగరు వేస్తే, నౌక అలలతాకిడికి తట్టుకొని, మునిగిపోకుండా నిలబడ గలుగుతుంది. లంగరు అంటే మరేమీకాదు. పట్టిచేదలు. వాటి నిండా నిరుపయోగాలైన నిస్తంత్రీ విద్యుద్ఘటాలూ, చంద్ర తుంపులూ, ఇంకా రకరకాల బరువైన తుక్కూ చేర్చి, లంగ రుగా ఉపయోగించటానికి తగినట్లు చేశాము. మా మిత్ర మండలి సమావేశంలో ఆమోదించిన శాసనాలలో మొదటిదీ చివరిదీకూడా "నౌకను అంటిపెట్టుకొనిఉండాలి" అనేది. ఏది ఏమైనా నౌకాపార్శ్వాన్నే పట్టుకొని వ్రేలాడుతూ, తొమ్మిది

దుంగల్ని పర్వతశిఖరాన కలిగే ఒత్తిడికి విడిచివేయాలి. మా మీదకు వచ్చిపడే కెరటాలతాకిడికి తట్టుకోవటంతోనే మాపని సరిపోతుంది. నావమీదనుంచి దుమికితే, సుడిగుండాల్లో చిక్కు పడక తప్పదు. అప్పుడు ఏ నిశిత శిలాగ్రాలకో తాకి రూపు మాసిపోతాము. పోనీ, రబ్బరుడింగీలో కూర్చుందామా అంటే, అది అంతకంటె అపాయకరం. డింగీ ఏ తాకిడికి కొట్టు కొన్నప్పటికీ, ముక్కముక్కలై పోతుంది. దూలాలుమాత్రం ఎల్లాగైనా గట్టుకు చేరుకొంటాయి. వాటిని విడిచిపెట్టకుండా ఉంటే, మేముకూడా గండంనుంచి గట్టెక్క వచ్చును.

"అందరూ చెప్పులు తొడుగుకొని ఉండాలి" అని కూడా నిశ్చయించుకొన్నాము. సముద్రయానం ఆరంభించిన తర్వాత నూరురోజులలోనూ చెప్పులు తొడుగుకోవాలనుకోవటం ఇప్పుడే. "జీవిత రక్షకబంధం అందరూ ధరించవల సిందే" అనేది ఇంకొక నియమం. అయితే ఈ నియమానికి అంత ప్రాధాన్యంలేదు. ఎందువల్లనంటే నావమీదనుంచి పడి పోయినవాడు గాయాలువడి చావడమేగాని, మునిగిపోవటం అనేది సాధారణంగా సంభవించదు. సముద్రయానం చెయ్యటానికి పుచ్చుకొన్న అనుమతిపత్రాలూ, స్వల్పంగా మిగిలి ఉన్న డాలర్లూ జేబుల్లో భద్రపరుచుకొన్నాము. ఇప్పుడు మాకు ఏమి చెయ్యటానికైనా వ్యవధిలేదనే చింతలేదు. ప్రమాదం పాలుగాకుండా జీవించగలమా; అనేదే పెద్దప్రశ్న. దీనికి జవాబు చెప్పవలసిందిగానీ, చెప్పగలిగేదికానీ మేము కాదు.

అడుగడుగుకీ, నిస్సహాయంగా గిరి శిఖరంవైపు వెళ్లిపో తున్నాము. నౌకమీద నిశ్శబ్దత తాండవిస్తున్నది. వేణు

మందిరం లోపలగానీ, బైటగానీ ప్రాకుతూ మా అంతిమకర్తవ్యాలు నెఱవేర్చుకొంటున్నాము. 'జరుగబోయేది ఏమిటి ?' అనే విషయంలో ఎవరికీ సందేహంలేనట్టు, ముఖాల్లో ద్యోతకమవుతున్నది. ఒక్కరికి కూడా అధైర్యం కలుగలేదు. నౌక ఎల్లాగైనా ఒడ్డుకు చేరుస్తుందనే విశ్వాసం అందటికీ ఉన్నది. అది అలలమీాదుగా పోగలిగితే, తప్పకుండా ఒడ్డుకు చేర్చగలదు.

వేణుమందిరం లోపల చిందఱవందఱగా ఉన్న ఆహారపదార్థాలూ, ఇతరసామగ్రీ మూటలుగట్టి దూలాలకు కట్టివేశాము. నిస్తంత్రీయంత్రం ఉన్నమూల టార్ స్టీను చేరాడు. యంత్రం పనిచేస్తున్నది ఇప్పటికి నేము కొల్లాకు 4200 సముద్రపు మైళ్ళదూరాన ఉన్నాము. అక్కడి పెరూదేశీయ నావికసంస్థకు వార్తలు పంపటమూ, అక్కడినుంచి వార్తలు అందుకోవటమూ జరుగుతున్నది. ఇంతేకాక, అమెరికా సంయుక్తరాష్ట్రాలలో హాలూ, ఫ్రాంకూ మొదలైనవారి దగ్గఱనుంచి కూడా సందేశాలు గ్రహించటమూ, వాటికి మా పరిస్థితులు తెలియజెయ్యటమూ జరుగుతున్నది. కాని దైవికంగా ఆ గతదినమే కుక్ ద్వీపాలలోని రాటరాంగాలో ఉన్న ఒక నూతనవ్యక్తితో నిస్తంత్రీ యంత్రంద్వారా పరిచయం కలిగిందికానీ, అక్కడి నిస్తంత్రీ కార్యాలయోద్యోగులు మేము అతనిని పిలిచినప్పుడు మా విషయం అతనికి తెలియబఱచకుండా, అంతకుముందే మత్తెవరో అతనితో సంభాషించగోరిన కారణాన మా పిలుపు అతనికి చేరనియ్యలేదు. ఈ మధ్యకాలంలో నేము అంతకంతకు గిరిశిఖరానికి చేరువౌతున్నాము. టార్ స్టీను యంత్రంముందు కూర్చుని రాటరాంగాకోసం కలవరిస్తున్నాడు.

కోన్-టికీ దినచర్య పుస్తకంలో ఈ సందర్భాన ఇలా వ్రాసికొన్నాము. "8-15: మేము నెమ్మదిగా గట్టు సమీపిస్తున్నాము. నౌకమీదనుంచి చూస్తూఉంటే తీరంలోపలి తాటి చెట్లు విశదంగా కనిపిస్తున్నాయి. 8-45: గాలి మళ్ళీ వ్యతిరేకంగా వీస్తున్నది. ఇక దీనినుంచి విముక్తి కలుగుతుందనే ఆశ లేదు. చురుకుగా ఎవరిబాధ్యతవారు నిర్వహించుకోటం తప్ప ఒక్కరుకూడా భయవిచలితులు కావటం లేదు. మాకు ఎదురుగా గిరిశిఖరంమీద ఒక పగిలిపోయిన నౌకవంటిది కనిపిస్తున్నది. కాని ఇది సముద్రంనుంచి కొట్టుకొనివచ్చిన కలప అయి ఉండవచ్చును.

"9-45: గిరిశిఖరానికి వెనుకమాకు కనబడుతున్న చివరి ద్వీపానికి ఇవతలి దీవివైపు గాలి మమ్మల్ని త్రోసివేస్తున్నది. ఇప్పుడు మొత్తం పర్వతం ఆ చివరనుంచి ఈ చివరవరకూ కనిపిస్తున్నది. చిన్నచిన్న గుట్టలన్నింటికీ పటకావలె ఉన్న ఈ సుదీర్ఘ పర్వతం, ఎత్తైన చాలుగల తెల్లని మహాకుడ్యంవలె కనబడుతున్నది. పర్వతం పొడుగునా నురుగు చిమ్ముతూ పడుతున్న కెరటాలు ఆకాశాన్ని చుంబించబోతునట్లు నీటిని ఎగజిమ్ముతున్నవి జరుగబోయే అపాయం అతిసన్నిహితంగా కనబడుతుంటే, బెంగ్టు వేడివేడి భోజనం వడ్డిస్తున్నాడు! గిర్యగ్రానికి వెనుక తేజోనంతంగా కనబడుతోన్న లవణకాసారమూ, దానికి రెండవవైపున ఉన్న చిన్నలంకలవరుసలూ కనిపించేట్లుగా గిరిశిఖరానికి బాగా చేరువైనాము."

ఇంతవరకు వ్రాసేసరికి, కొండమీదనుంచి జారిపడుతున్న కెరటాలు మళ్ళీ దగ్గరపడ్డవి. అవి ఈ పర్వతం పొడు

గునా లేచివస్తూ, భయంకరధ్వనులతో భూనభోంతారాళాల్ని నింపివేస్తున్నాయి ఆ భీకరనినాదం 'కోన్-టికీ అంతిమకాలం ముగుస్తున్న'దని, కాలపురుషుడు ఎలుగెత్తి చాటుతున్నట్లున్నది.

«9-50 : ఇప్పుడు ఎంతో ఎడంలేదు. కొండప్రక్కనుంచే కొట్టుకుపోవటం. ఒక సందగజాల దూరం ఉంటుందేమో! రాటరాంగా మనిషితో టార్స్టీన్ మాట్లాడుతున్నాడు - భవిష్యత్తు సుస్పష్టం! దూలానికి అంటిపెట్టుకోవాలి! అందరూ ధైర్యంగానే ఉన్నారు. అపాయం ప్రత్యక్షమౌతున్నది; కాని, మేము దాన్ని అధిగమించాలి!»

తర్వాత కొన్నినిమిషాల్లో లంగరు దించివేశాము. అది సరిగా అడుగున దేనినో పట్టుకొని నిలిచిపోయింది. నౌక గిఱ్ఱున తిరిగిపోయింది. దాని వెనుకభాగం సెలయేటివైపు తిరిగింది. కాని మునిగిపోలేదు. ఆ కొలదినిమిషాలు అమూల్యాలు. టార్స్టీన్ ఇంకా యంత్రందగ్గఱకూర్చుని అవస్థపడుతున్నాడు. ఇప్పటికి రాటరాంగా సంబంధం కలిగింది. కాని సెలయేటి ఘోషం దుర్భరంగా ఉన్నది. ఒక కెరటం మహోన్నతంగాలేచి విఱిగిపడ్డది. అందఱమూ దూలాల్ని కౌగిలించుకొని పడుండిఉన్నాము. టార్స్టీను వార్త రాటరాంగాకు చేరింది. మేము రజోరాశిఖరంవైపు కొట్టుకొనిపోతున్నామని అతను అక్కడిమనిషికి తెలియజేశాడు. గంట గంటకూ మేము పంపేవార్తలకోసం కనిపెట్టుకొని ఉండవలసిందనికూడా అభ్యర్థించాడు. 36 గంటలపాటు మాదగ్గఱనుంచి ఏవార్తా అందకపోతే వాషింగ్టన్లోని నార్వేరాయబారికి ఆ విషయం తెలియ

జెయ్యవలసిందని కోరాడుకూడాను. ఆ సమయంలో టూర్ స్టీను చిట్టచివఱమాటలు ఇవి : "కుశలం. 50 గజాలు పడమటికి — ఇక్కడితో సరి. నమస్తే." అంతటితో యంత్రం మూసి వేశాడు. నట్ కాగితాలు అన్నీ కట్టి ముద్రవేశాడు — ఇద్దఱూ మెల్లగా ప్రాకుతూ మా దగ్గఱకు వచ్చారు. లంగరు పట్టుతప్పి నట్లున్నది. సముద్రపుపోంగు చాలా విపరీతమైంది. అలలనడుమ అగాధంగా కనబడుతున్నది. నౌక ముందుకూ వెనుకకూ ఊగి పోతోంది. తలక్రిందులైపోతున్నట్లు కనిపించింది.

మళ్ళీ తుది హెచ్చరిక జరిగింది : "నావను గట్టిగా పట్టు కోండి! ఏది పోయినా పరవాలేదు. పట్టు మాత్రం వదలకండి." మేము ఇప్పుడు జలపాతానికీ కొండకూ నడిమిభాగానికి వచ్చాము. అందువల్ల సెలయేటి రొద బయట ఉన్నప్పుడు వినిపించినంత ఎడతెగని ఘోషంగా వినిపించటంలేదు. మా సమీపాన దొర్లిపడుతున్న ఒక కొద్ది ప్రవాహం స్రోతి మాత్రమే సవ్యవధానంగా వినబడుతున్నది.

మాకు జీవితరక్షకబంధం ఒక్కటే సర్వస్వంగా కన బడ్డది. దానితో నౌకకు మమ్మల్ని సుదృఢంగా బంధించు కొన్నాము. ఎరిక్కు ఒక్కడు మాత్రం చివఱిక్షణంలో వేణు మందిరంలో దూరాడు. అతనికి ఇంకా కొంతపని మిగిలి పోయింది—పాపం! అతని చెవ్వులు కనిపించలేదు!

నౌక వెనుకకు ఎవరూ చేరలేదు. గిర్యగంగొచ్చి సంభ వించే తీవ్రాఘాతం సరిగా అక్కడనే తగులుతుంది. నౌకా స్తంభాగ్రంనుంచి వెనుకభాగానికి బిగించిన మోకులు బిగువుగా లేవు. అందువల్ల స్తంభం గనుక కూలిపోతే, ఆ మోకులను పట్టు

కొన్న వారు నీళ్ళలోనయినా పడతారు; గిర్యగ్రానికైనా కొట్టు కొంటారు. హెర్మన్, బెంగ్టు, టార్‌స్టీనులు వేణుమందిర కుడ్యానికి కట్టివేసిన పెట్టెలమీదికి ఎక్కారు. పై కవ్వాలకు బిగించిన త్రాళ్ళను పట్టుకొని హెర్మన్ వ్రేలాడుతున్నాడు మిగిలిన యిద్దరూ నౌకా స్తంభానికి బిగించివున్న మోకుల్ని పట్టుకొన్నారు. ఆ మోకులు తెరచాపను కావలసినవైపు త్రిప్పటానికి కూడా ఉపయోగపడతాయి. నట్టూ, నేనూ నౌకా ముఖభాగం నుంచి స్తంభాగ్రానికి ముడివేసిన త్రాళ్ళను పట్టుకొన్నాము. ఎందుచేతననగా "నౌకా స్తంభమూ, వేణుమందిరమూ సమస్తమూ పడిపోవటమే సంభవిస్తే, ముఖభాగానవున్న ఈ మోకులు మాత్రం ఇక్కడే పడతాయి కాని నౌకకు దూరంగా పడవు;" అనుకొన్నాము. ఈ సమయంలో మేము కెరటాలలో ఆకంఠం మునుగుతున్నాము.

కెరటాల్లో మేము చిక్కుపడ్డామని గ్రహించేటప్పటికి, లంగరుత్రాడు తెగిపోయింది. నౌక తత్క్షణం కొట్టుకుపోయింది. ఒక కెరటం సరిగా మా నావ అడుగునుంచి లేచింది. నావ ఎగిరిపోతున్నదనుకొన్నాము. ఆ అద్భుతక్షణం రానే వచ్చింది. అలమీద ఊపిరాడకుండా కొట్టుకొనిపోతున్నాము. నావ యావత్తూ కంపితమౌతూ, విషాదగీతం ఆలపిస్తున్నట్లున్నది. ఆ భయంకరస్థితిలో మాస్థితి ఎల్లావున్నదో; చెప్పటానికి వీలులేదు. రక్తము సలసలక్రాగిపోతున్నది. ఆ ఉద్రేకంలో ఏమనాలో కూడా తోచక చెయ్యి ఊపుతూ "సెబాస్!" అని అరిచినట్లు నాకు జ్ఞాపకం. అలా అరవటంవల్ల కొంత మనశ్శాంతి కలిగినట్లున్నది కానీ, మరేమీ కీడు జరుగలేదు. నా మిత్రు

లంగా నాకు మతిపోయిందనుకొన్నారు. కాని వారుకూడా అయోమయస్థితి లో పడి, ఏమేమో గొణుగుతున్నారు. కెరటాలు నెట్టివేస్తుంటే, మేము ఎక్కడికో వెళ్ళిపోతున్నాము. ఈ ఘట్టం కోన్-టికీకి అగ్నిపరీక్ష; సర్వం శుభంగా పర్యవసించి తీఱుతుంది. కాని ఈ గర్వం అంతలో నే ఎగిరిపోయింది. మాకు వెనుకనుంచి వచ్చిన మహావీచిక వచ్చిపడ్డది. అది మమ్మల్ని నిలువునా ముంచివేసింది. నన్ను ఏదో గిరగిర త్రిప్పివేస్తున్నట్లయింది. నా శరీరం నాకు వశం కాకుండా పోతున్నట్లు తోచింది. కాని, "పట్టువిడవకండి! పట్టువిడవకండి!" అన్న మిత్రమండలి శాసనం ఇంకా నా చెవులలో మ్రోగుతూనే ఉన్నది. అయితే, నేను ఎంత గట్టిపట్టు పట్టినా, చేతులు ఊడిపోవేట్టున్నది కానీ, నా సంకల్పం కొనసాగేట్టు లేదు. మనోబలం ఎంతఉన్నా, శరీర బలం తక్కువైతే, నేను చెయ్యగలిగేదేమిటి? నా శరీరం మీదనుంచి ఒక జలపర్వతం ప్రయాణిస్తున్నదనిపించింది. కొంత సేపటికి గుక్క త్రిప్పుకొని చూచేసరికి వఱద వెళ్ళిపోయింది. నేను హర్మన్ కోసం చూచాను. అతను నా వెనుకనే ఉండ చుట్టుకొన్నట్లుండి త్రాడు పట్టుకొని వ్రేలాడుతున్నాడు. కెఱటాన్ని వెనుకనుంచి చూస్తుంటే, అది అప్పటికి చదునైపోయినట్లు కనిపించింది. అది నౌకమీద పడినప్పుడు వేణుమందిరం పై భాగాన్ని మాత్రమే తుడిచిపెట్టింది. మందిరం లోపల వ్రేలాడుతున్న ముగ్గురూ నీటి ఒత్తిడికి పైకప్పుకు కొట్టుకొన్నారు.

మేము ఇంకా కొట్టుకొని పోతూనే ఉన్నాము. ఒక్కసారి వీలుచూచుకొని నేను త్రాడు కాళ్లు చేతులతో పెనవేసికొని, గట్టిపట్టుపట్టాను నట్టుక్రిందికి దిగి, పెట్టెలమీద ఉన్న

వారి వద్దకు పులిలాగా దూకాడు. వీరిబరువుతో వేణుమందిరం క్రుంగిపోయేట్లున్నది. వారు కుశలంగా ఉన్నట్లు సంజ్ఞలు చేశారు. నేను మళ్ళీ ఏదో చెప్పాలనుకొన్నాను. ఇంతలోనే ఇంకొక జలపర్వతం మామైపే రానటం కనిపించింది. తత్క్షణం హెచ్చరికగా ఒక కేక వేసి, కాళ్ళూ, చేతులూ బాగా ముడుచుకొని, భల్లూకపు పట్టుతో . రానున్న అపాయాన్ని ఎదుర్కొనటానికి సంసిద్ధుణ్ణయినాను. ఒక్క-క్షణంలో మళ్ళీ నరకంలో పడ్డాము. కోన్-టికీ నీటిలో పూ ర్తిగా మునిగిపోయింది. ఆ తరంగం రివ్వునవచ్చి, అభాగ్యమానవశరీరాలను నర నరమూ పీడించిపోయింది. దానివెనకనే మరొకటీ, మళ్ళీ ఇంకొకటీ, అంత తీవ్రంగానూ పీడించి వెళ్ళాయి.

ఆ తర్వాత త్రాడుపట్టుకొని వ్రేలాడుతున్న నట్ విజయునినాదం ఇలా వినిపించింది :

"నావ చూడండి! అది అభిన్నంగానే ఉన్నది." ఈ మూడు కెరటాలతో రెండు నౌకా స్తంభాలూ, వేణుమందిరమూ కదలిపోయి ముందుకు ఒరిగాయి. అయినా మళ్ళీ మేము ప్రకృతిని జయించినట్లు తోచింది. విజయగర్వంతో మాకు క్రొత్తసత్తువ చేకూరింది.

మళ్ళీ ఇంకొక కెరటం రావటం చూచాను. అది వెనకటి మూడింటికంటెనూ మహోన్నతంగా ఉన్నది. నేను తత్క్షణం మొరకుపట్టుకొని, వీలైనంతపైకి ప్రాకిపోతూ, మా మిత్రుల్ని హెచ్చరించాను. ఇంతలోనే తరంగం మమ్మల్ని ముంచివేసింది. అది సుమారు ఇరవై అయిదు అడుగుల ఎత్తుదాకా వచ్చింది. దానిమీద నురుగు మఖోపరిభాగాను అడు

గులు ఉన్నది. నేను తక్కినవారికి కనిపించటంలేదు. వారందరూ తరంగతీవ్రతకు వివశులైనారు. అయినా "పట్టుకోండి! పట్టుకోండి! పట్టుకోండి! పట్టువదలకండి!" అన్న హెచ్చరిక అందరి మనస్సుల్లోను మెదలుతూనే ఉన్నది.

అప్పటికి నేము గిరిశిఖరానికి తాకిఉంటాము. మోకు విడవకుండా ఉండటం నాకు మహాకష్టమైంది. అది ముందుకూ వెనుకకూ ఊగిపోతున్నది. ఆ ఊపు అంతా క్రిందినుంచే వస్తున్నదో, పైనుంచేవస్తున్నదో; నాకు తెలియటం లేదు. ఈ ముంపు అంతా కొన్ని సెకనులు మాత్రమే ఉన్నది. కాని, అది మా ఓపిక అంతా హరించివేసింది. మనుష్యుని కండరాలలో కంటె అస్థిపంజరంలోనే ఎక్కువశక్తి ఉన్నది. నేను మరణించటమే సంభవిస్తే, ఈ మోకును చుట్టుకొని, ఇలాగే మరణించాలని, నిశ్చయించుకొన్నాను. సముద్రం మమ్మల్ని ముంచివేస్తున్నప్పుడూ, విడిచిపోతున్నప్పుడూ కూడా, తీవ్రంగా ఘోషిస్తూనే ఉన్నది. ఆ ఘోష కోన్-టికీ విధ్వస్తమైనదని చాటింపువేస్తున్నట్లున్నది. ఎవడో ఇంద్రజాలికుడు మాయచేసినట్లుగా, కోన్-టికీ రూపం పూర్తిగా మారిపోయింది. అనేక వారాలుగా నెలలుగా మాకు సుపరిచితమైన నౌక యిక లేనే లేదు. కొన్ని క్షణాలలో మా ఆనందలోకం పరిభగ్నమైపోయింది.

నా వెనుక ఒక్క మనిషిమాత్రమే కనిపించాడు. వేణుమందిరము వెనుకభాగానా, ముందుప్రక్కనా కూలిపోయింది. అతను దానికి అడుగున బోరగిల బడిఉన్నాడు. చేతులు రెండు వైపులకూ చాచిఉన్నాడు. ఆ నిశ్చేతన విగ్రహం హెర్మన్.

గిరి శిఖరంనుంచి జాఱిపడే మహాజలప్రవాహం ఘోషం తప్పితే ఎక్కడా చైతన్యమనేదే కనబడటం లేదు. నౌక పార్శ్వందగ్గర ఉన్న స్తంభం అడుగుభాగాన రెండు చీలికలయింది. దానిపై భాగం ఎగిరి వేణుమందిరం దూసుకుపోయింది. ఆ దెబ్బతో నౌకా స్తంభం వేణుమందిరం మీందికి బాగా ఒరిగింది. చుక్కానిదగ్గర సర్వనాశనమైంది. తెడ్డు నుగ్గునుగ్గై పోయింది – నౌకాముఖభాగం చెప్పనే అక్కఱలేదు.

నాకు నెత్తురు గడ్డకట్టుకొని పోయింది. నేను ఒక్కణ్ణే ఈ మోకపట్టుకొని, వ్రేలాడి ప్రయోజనం ఏమిటి? ఇక్కడ ఒక్కమనిషిని కోల్పోయినా, సర్వం నాశనమైనట్లే! అప్పటికి కనిపిస్తున్నది, నేనుగాక మఱొక్కడు మాత్రమే. అంతలో నౌకకు బయట ముద్దగట్టుకొన్నట్లున్న టార్స్టీను ఆకారం కనిపించింది. అతను నౌకా స్తంభానికి బిగించిన మోకుల్ని కోటిపట్టు పట్టాడు. అక్కడనుంచి మెల్లగా దూలాలమీందికి వచ్చి వేణు మందిరం ద్వారానికి కొంచెం చేరువకు వచ్చాడు. ఇప్పటికి హెర్మన్ తలఎత్తి "ధైర్యంగా ఉండు" అన్నట్లు సంజ్ఞ చేశాడు. కాని తన తావునుంచి వీసమైనా కదలలేదు. నేను మిగిలినవారు ఎక్కడెక్కడ ఉన్నదీ తెలిసికోవటానికి కేకలు వేశాను. అందఱూ నావమీందనే ఉన్నారని బెంగ్టు ప్రశాంతస్వరంతో బదులు చెప్పటం వినబడింది. వారందఱూ వేణుమందిర కుడ్యాలకు కట్టిన త్రాళ్ళను విడువకుండా పట్టుకొనిఉన్నారు.

ఇప్పుడు చెప్పిందంతా కొన్ని క్షణాల్లో జరిగింది. కోన్-టికీ సుడినుంచి బయటపడుతూఉండగే లోపున మఱొక అల

వచ్చింది. "పట్టు వదలకండి!" అని ఎలుగెత్తి మిత్రుల్ని హెచ్చ రించాను – అదే నా తుది హెచ్చరిక. ఆ తర్వాత నేను ఏమి చేశానో నాకే తెలియదు. నౌక దూలాలకొనలు ఒక పాషా ణాన్ని దాటిపోవటానికి బదులు దానికి కొట్టుకొన్నాయి. దానితో మళ్ళీ మేము చిక్కుపడిపోయాము. వేణుమందిరపు పైకప్పును పట్టుకొని ఊగుతున్న మణి యిద్దఱు మిత్రులు కని పించారు. ఎవరిముఖానా చిఱునవ్వు లేదు. వాసాలు కూలిన వైపునుంచి అతి ప్రశాంతమైన ఒకకంఠంనుంచి ఇలా వినిపించింది.

"ఇదేమీ లాభం లేదు."

నేనూ అల్లాగే నిరుత్సాహ పడిపోయాను. నౌకా స్తంభాగ్రం ఒరిగిపోతూ ఉన్నకొద్దీ త్రాడు వదులైపోతూ ఉండటంవల్ల నేను నౌకకు దూరంగాపోయే త్రాటితో పడి పోయేట్టున్నాను. మళ్ళీ అల వచ్చింది. అది దాటిపోయేసరికి నేను మృతకల్పుణ్ణైపోయాను. ఇక నాకు కలిగిన ఆలోచన : మెల్లగా దూలాలమీదకు చేరి వేణుమందిరంచాటున పడుండా మని మాత్రమే. గిర్యగ్రంనుంచి నీరు జాఱిపోగానే తుప్పుపట్టిన ఇనుములాగా మెరుస్తున్న పర్వతశిఖరం సరిగా నాకు వెనుకనే ఉండటం చూచాను. ప్రప్రథమంగా అంత విస్పష్టంగా ఆ శిఖ రాన్ని నేను చూడగలిగింది అప్పుడే. టాన్‌స్టీను నౌక మోకులు ఒక చేతితో పట్టుకొని ఒక జాతిమీద వంగిఉండటం చూచాను. నట్టు కొంచెం వెనుకగా ఉన్నాడు. అతనూ దుమికి పోబో తున్నాడు. 'మనము అందరమూ దూలాలతో ఉండవలసిందే!'

అని నేను కేక వేశాను. నీటొత్తిడికి నావనుంచి క్రిందకుజారిన టార్స్టీను అప్పుడే పిల్లి లాగా ఇవతలికి దూకాడు.

ఇంకా రెండో మూడో కెరటాలు వచ్చాయి. అవి మమ్మల్ని క్రిందికి లాగివేసేట్టు కనిపించాయి. నీరు నురుగులు గ్రక్కుతూ చెల్లాచెదఱవుతుంటే, మేము దాటిపోవలసిన పర్వతశిఖరంవైపు మునుగుతూ తేలుతున్నాను. వట్టి నీటి జల్లులూ, నురుగుమాత్రమే వస్తూఉన్న సమయంలో, నౌకలో చేరుకోగలిగాను. అది శిఖరంలో అత్యున్నమైన చోటు. దూలాల్ని అక్కడనుంచి అవతలికి లాగవలసిఉన్నది.

అంతలోనే నట్ నౌక వెనుకభాగంనుంచి చేతితో నౌక త్రాడు పట్టుకొని శిఖరంమీదకి దుమికాడు. వెనుకనుంచి అల నౌకను నెట్టుతూఉండటంవల్ల అతను శిఖరానికి ముప్పై అడుగులు అవతలికి వెళ్ళగలిగాడు. తర్వాత వచ్చిన అల అతనిముందే విరిగి వెనుకకు తిరిగివచ్చింది. అతను నిరపాయంగా నిల్వగలిగాడు.

ఎరిక్కు అప్పటికి పాదరక్షలు ధరించి, పగిలిన వేణు మందిరం లోపలినుంచి ప్రాకుతూవచ్చాడు. అతనివలెనే మేము కూడా దాగిఉంటే ఇంత అవస్థ ఉండేదికాదు. మందిరం ఎగిరి పోక కూలిపోవటంవల్లనూ దానిమీద తైలవస్త్రం (కాన్వాసు) కప్పిఉండటంవల్లనూ, ఎరిక్కు అలల ఆర్భాటం అంతా గమనిస్తూనే నిరపాయంగా పడుండిఉన్నాడు. తెఱచాప స్తంభం కూలినప్పుడు బెంగ్టు చాలా అనుమానించాడు. అయినప్పటికీ ఆటు పిమ్మట అతను లోపలికి ప్రాకివెళ్ళి ఎరిక్కు ప్రక్కనే శయనించాడు. నీటొత్తిడికి వేణుమందిరంలోని సామగ్రి యావత్తూ అణగి

ఉంటుందనీ, దానిని దూలాలకు బిగించిఉండటంచేత కొట్టుకొని పోవటానికి అవకాశం ఉండదనీ మేము ముందుగా ఊహించి ఉంటే, ఎరిక్కు బెంగ్టుల మాదిరిగానే మేముకూడా అక్కడే శయనించి ఉండేవాళ్ళము.

ఎరిక్కు ఇప్పుడు నౌక వెనుకభాగాన నిలిచిఉండి, కెరటం తిరోగమించగానే గిరిశిఖరంమీదికి లంఘించాడు. తరువాత హెర్మన్ వంతు, ఆటుపిమ్మట బెంగ్టు వంతూ అయినాయి. టార్‌స్టీనూ, నేనూ దుముకబోయేటప్పటికి నౌక గిరిశిఖరంపైకి చాలవరకు వచ్చింది. అందువల్ల ఇక అక్కడ నుంచి త్వరగా బయటపడడానికి పూనుకొన్నాము.

ఇప్పుడు మేము గిరిశిఖరంనుంచి అలలు విరిగిపడే అపాయకరస్థలానికి ఇరవై అడుగులు పైకి చేరుకొన్నాము. ఇక్కడి శిఖరం చాలా ఎత్తున ఉండటంవల్ల ఎప్పుడో మరీ ఉన్నతంగా వచ్చే కెరటం తప్ప సామాన్యతరంగం ఇంతవరకు రాదు. ఈ శిఖరానికి అవతల లవణకాసారం ఉన్నది. అత్యున్నత తరంగాలవల్ల అప్పుడప్పుడు సముద్రజలం ఈ కాసారం లోపలికివస్తూఉంటుంది. కాసారంచుట్టూ శిలామయమైన గట్టు ఉండనే ఉన్నది. ఇక్కడనుంచి వన్నెవన్నెల పాషాణాలు అనేక రూపాల్లో కనిపిస్తూఉన్నాయి.

శిఖరంమీద చాలాదూరాన నీటితో నిండి కొట్టుకొని పోతూఉన్న రబ్బరు డింగీ కనిపించింది. వెంటనే కొందరు వెళ్ళి దానిని ఇవతలికి లాగుకొనివచ్చారు. దానిలో రేడియోసామగ్రి మొదలయిన అవసరవస్తువులన్నీ పెట్టి, మెల్లగా కొండశిఖరం ప్రక్కకుచేర్చి ఒక పెద్ద పాషాణానికి బంధించివేశాము. తరువాత

పగిలిన నౌకలో మిగిలిఉన్న సామానంతా తీసికొనిరావటానికి వెళ్ళాము. "వీచికాప్రవాహాలు చుట్టుముట్టితే ఏమవుతుంది?" అనే విషయం ఎవరమూ ఆలోచించలేకపోయాము.

శిఖరానికి ఇవతల నీళ్ళలో తళతళ మెరుస్తున్న వస్తువులు కొన్ని కనిపించాయి. అవి తీసికొనిరావటంకోసం వాటిని సమీపించేసరికి పూర్తిగా విస్మితులమైనాము. అవి రెండు ఖాళీ డబ్బాలు! ఆ మెరిసే వస్తువులు ఇవి అయిఉంటాయని మేము అనుకోలేదు. వాటిమీద అంటించిఉన్న కాగితాలు కనబడేసరికి ఇంకా ఆశ్చర్యపడ్డాము. ఆ కాగితాలమీద "పైనాపిల్" అని ఉన్నది. ఆ డబ్బాలు సరిక్రొత్తవి వాటిమూతలు తీసికూడా ఎంతోకాలం కాదు. మేము మా ప్రయాణానికి ముందు కావలసిన వస్తువులను సమకూర్చుకొనేటప్పుడు, బాగోగులు పరీక్షించటానికి తెచ్చినట్లు వాటిమీద వ్రాసివున్నది. మేము వాటిలోని సరుకు ఆరగించినతర్వాత నౌక ప్రక్క ఒకమూలకు విసరివేశాము. అవి మాకంటె ముందుగానే పైకి కొట్టుకొని వచ్చాయి.

ఇప్పుడు మేము నిలుచున్న నేల అంతా సూదులవలె మొనలుతేలిన ఱాళ్ళతో నిండిఉన్నది. ఒక్కొకచోట నీరు చీలమండలలోతు ఉన్నది. ఇంకొకచోట రొమ్ములలోతు. ఒకచోట ఉన్నట్లు మఱొకచోట లేదు. అంతా ఎగుడు దిగుడుగా ఉన్నది. పైగా ఎక్కడచూచినా చిన్నచిన్న వాగులు, అప్పుడప్పుడు వచ్చిపడే వీచికలు ప్రవహిస్తూ ఉన్నాయి. అది అంతా ఒక పాషాణవనం అనవచ్చును. వాటిమీద నిరంతరంగా నీరు ప్రవహిస్తూ ఉండటంవల్ల పాచిపట్టి, కొన్నిచోట్ల

ఆకుపచ్చగా కనిపిస్తున్నది. తక్కిన చోట్ల కొంతవఱకు ఎఱుపూ తెలుపూ పసుపూ రంగులు కనబడుతున్నాయి. ఇన్ని నానాట లెందుకు ? అక్కడ కనిపించనిసంగు లేదు. అక్కడక్కడ రంగు రంగుల నత్తగుల్లలూ, చేపలూ కనిపిస్తున్నాయి. అవి ప్రవాహ వేగానికి అటూ ఇటూ చెదఱిపోతున్నాయి. లోతైన వాగుల్లో నాలుగు అడుగుల పొడవైన చిన్న చిన్న సొరచేపలుకూడా ఉన్నాయి. అవి దగ్గఱకు వచ్చినప్పుడు దోసిళ్ళతో నీళ్లు ఎగ జిమ్మి వాటిని బెదఱించి, ముందుకు సాగిపోతున్నాము.

మేము ప్రయాణించేచోట చిన్నచిన్న మడుగులు కన బడుతున్నాయి. అవి తప్పితే తక్కిన భూమి కేవలం ఊబి నేల. అది అంతా నీళ్ళతో తడిసిఉన్నది. దూరాన లవణాకా సారం ఉన్నది సముద్రపుపోటు వస్తూనే ఉన్నది. మా పరి సరాల్లో ఎటుచూచినప్పటికీ, నీటిబయటికి పొడుచుకొనివచ్చిన కత్తులవంటి ఱాళ్ళు కనిపిస్తున్నాయి. శిఖరంమీద విఱిగిపడే కెఱ టాలు వడివడిగా క్రిందికివచ్చి పడుతున్నాయి. ఏదైనా కెఱటం తీవ్రంగావచ్చి తాకితే, మాగతి ఏమకాతుందో చెప్పలేము. మేము తొందఱగా గండందాటిపోవాలి.

ఉత్తరానికి పెరిగిపోతూ, దక్షిణాన పల్లమాతూ, క్రమంగా కానరాని గిరివంకి దాదాపు సగం జలమగ్నమైన కోటమాదిరిగా కనబడుతున్నది. ఈ కోటకు బాగా దక్షిణాన కొబ్బరిచెట్లతో అడవిలాగా కనిపిస్తున్న ఒక ద్వీపం ఉన్నది. మాకు సరిగా ఉత్తరాన ఇటువంటిదే మఱొక చిన్నదీవిఉన్నది. అదీ శిఖరానికి లోపలిభాగాననే ఉన్నది. అక్కడి కొబ్బరి చెట్లు చాలా ఎత్తుగా ఉన్నాయి. మంచువలె తళతళలాడే ఇసుకనేల

కూడా చాలా ఉన్నది. ఆ మొత్తం దీవి పువ్వులతో నిండిన ఒక ఆకుపచ్చని గంపలాగా కనిపిస్తున్నది.

మేము ఈదీవికే చేరాలనుకొన్నాము.

హెర్మన్ తన పొడుగాటి గడ్డం నాకు తగులుతూ ఉండే టట్లు మరీదగ్గరగా నడుస్తున్నాడు. అతను చెయ్యిచాచి మంద కోసం మాత్రం చేస్తూ మౌనంగా నడుస్తున్నాడు. కోన్-టికీ పాపం నిస్సహాయంగా లవణవర్షంలో తడుస్తూ గిరిశిఖరం పైననే పడిఉన్నది. అది శిథిలమైపోయింది. కాని దానిచరిత్ర యిప్పటికీ నిష్కళంకంగానే ఉన్నది. భౌతికరూపం పోకుండా ఉండదు. కీర్తిరూపంమాత్రం చెదఱగూడదు. ఎవరికైనా అంత కంటే కావలసిందేమిటి? నౌకమీదఉన్న సర్వం ధ్వంసమై పోయినా, ఈక్వేడార్ లోని క్వివెడో అరణ్యంనుంచి తెచ్చిన తొమ్మిది బాల్సాదుంగలూ అలాగే ఉన్నాయి. మా సామగ్రిలో సముద్రం పాలైంది చాలాతక్కువ. తక్కినదంతా వేణు మందిరంలో చెక్కు చెదఱకుండానే ఉన్నది. మాకు అత్యవసరాలైన సర్వవస్తువులూ రబ్బరుడింగీలో చేర్చి పెట్టుకొన్నాము కదా! అది నిటికాకిడికి దూరంగాఒక ఉన్నత శిలాగ్రంమీద భద్రంగా ఉన్నది.

నేను నౌకమీదనుంచి లంఘించింది మొదలుకొని చుక్కానిచేవ లన్నవే కనబడటంలేదు. అవి అన్నీ మా నౌక ముఖభాగంలోనే నిలిచిపోయాయి. తొమ్మిది బాల్సాదుంగలూ శిఖరానికి ఇవతల ఆఱంగుళాల లోతునీటిలో పడిఉన్నాయి. గోధుమవర్ణపు పీతలు నౌకఅడుగున చేరిఉన్నాయి. ఇప్పుడు చుక్కానిచేవలూ లేవు; తెడ్డుచేవలూ లేవు. మాకు ఏనాడూ

తెలియని పలకచేపలు మాత్రమే కనిపిస్తున్నాయి. ఇవి నెమలి పించెపురంగుల్లో ఉండి, స్ఫాలపుచ్ఛాలతో దుంగలమీద ఎగిరి పడుతున్నాయి. మేము ఒక నూతనలోకం ప్రవేశించాము. జోహాన్సు తన వివరం విడిచివెళ్లాడు. అతనికి ఇక్కడ మరొక అనుకూల ప్రదేశం కనబడి ఉంటుంది.

కోన్-టికీని విడిచివచ్చేటప్పుడు ఒక్కసారి నేను దానిని నలువైపులా పరీక్షించాను. వేణుమందిరానికి అవతల అణగిపోయిన గంపలో ఒక చిన్న కొబ్బరిమొక్క కనిపించింది. అది పద్దెనిమిది అంగుళాల పొడుగున్నది. కాయక్రిందుగా రెండు వేళ్లు కనిపిస్తున్నాయి. అది తీసుకొనే నేను మా అభిమత ద్వీపానికి బయలుదేరాను. నాకుకొంచెం ముందుగా నట్ ఒక చిన్న నౌకబొమ్మను తీసికొనిపోతున్నాడు. కోన్-టికీ మీద ఉండగా దానికి ప్రతికృతిగాఉండాలని ప్రయాసపడి నిర్మించుకొన్నాడు. మేము త్వరలోబెంగ్టును దాటిపోయాము మా అందఱిలోనూ అతనే సంసార కష్టసుఖాలు తెలిసినవాడు. తలమీద పెద్దబరువు పెట్టుకొని, గడ్డంనుంచి లవణజలం జాఱిపడుతుండగా, బాగా వంగి ఒక పెద్ద పెట్టెను ముందుకు త్రోసుకొనివస్తున్నాడు. అది అలలతాకిడి తగిలినప్పుడల్లా నృత్యంచేస్తూ ఎగిరిపడుతున్నది. అతను సగర్వంగా దాని మూత తీశాడు. అది మా వంట సామగ్రి పెట్టె. దానిలో మాప్రైమస్‌స్టౌ, తక్కిన వంటసామానులూ భద్రంగా ఉన్నాయి.

దగ్గరకు చేరినకొలదీ సువిశాలంగా కనబడుతున్న దివ్య ద్వీపాభిముఖంగా, గిరిశిఖరం ప్రక్కన నీటికి అడ్డపడి, చేసిన

ఆ ప్రయాణం నాకు ఎప్పటికీ మఱపురాదు. రవికిరణప్రసారంతో మనోహరంగా కనబడుతున్న సైకతతీరం చేరగానే, పాదరక్షలు విడిచివేశాను సితధూళి వఱచినట్లున్న వెచ్చని యిసుకలో అడుగులు గ్రుచ్చిగ్రుచ్చినడవటం మొదలుపెట్టాను. నారికేళ వృక్షాలచు సన్నిహితవఱచే ఆ నడకలో ప్రతిపాదముద్రా నాకు ఎంతోప్రియంగా కనిపించింది. కొంచెంసేపటికే నేను ఆ నారికేళ వృక్షచ్ఛాయలకు చేరుకొన్నాను. అక్కడనుంచి ఆ చిట్టిదీవి నడిబొడ్డుదాకా వెళ్లాను. పచ్చని కొబ్బరి బొండాలు ఆ తరుసంతానంతాల్చిన మరకత మణికుండలాల మాదిరిగా ప్రకాశిస్తూ ఉంటే, దట్టంగాఎదిగిన నికుంజాలనుంచి వీతెంచే సురభిళమారుతం సోకగానే, నయనపర్వమూ, నాసాపర్వమూ ఏకకాలంలో సంభవించటంచేత నేను ఆనంద పారవశ్యంతో ఉక్కిరిబిక్కిరయాను. ద్వీపం మధ్యభాగానకు చేరేసరికి రెండు సముద్రవిహంగాలు చాలా చనువుగా నా బుజాలమీదుగా ఎగిరిపోయినాయి. అవి శరత్స్వ్నప్నఘశకలాలవలె అతిధవళంగానూ, అతిలఘువుగానూ కనిపించాయి. చిన్న చిన్న బల్లులు నారాక గమనించగానే పాఱిపోతున్నాయి. అక్కడి ప్రాకృతికంలో ముఖ్యంగా ఎన్నదగినవి రక్తారుణాలైన పెద్దపెద్ద ఎఱ్ఱకాయలు. అవి దొంగిలించిన పెద్దనత్తగుల్లలను పొదివిపట్టుకొని నడవలేక నడవలేక నడుస్తున్నాయి.

నేను అడుగుతీసి అడుగుపెట్టలేని స్థితికివచ్చాను. వెంటనే ఇసుకమీద బోరగిలపడుండి, వేళ్లు వెచ్చని ఇసుకలో చొప్పించి, విశ్రాంతిపొందాను.

సముద్రయానం సమాప్తమైంది. అందఱమూ ప్రాణా

లతో బయటపడ్డాము. దక్షిణ సముద్రంలో నిర్జనమైన చిట్టి దీవిలో గట్టెక్కాము అది ఎటువంటి దీవి! టార్‌స్టీన్ నా సమీపానికి రాగానే ఇసుకమీద వెలికిలపడి నారికేళ వృక్షాగ్రాలనూ, మాచుట్టూ నిశ్శబ్దంగా పరిభ్రమిస్తున్న లఘుతర ధవళతరవిహంగాలనూ విలోకిస్తూ ఉన్నాడు. కొంచెంసేపట్లో ఆటుగురమూ అక్కడే విశ్రాంతులమైనాము. నిత్యోత్సాహి అయిన హెర్మన్ ఒక చిన్న కొబ్బరిచెట్టు ఎక్కి పెద్దబొండాలు గెల భిన్నంకాకుండా కోసి తెచ్చాడు. మేము వెంటనే లేచి కూర్చొని, చాకులతో బొండాల పైభాగాలను కోడిగ్రుడ్లను చెక్కినట్లు చెక్కివేసి మూతివద్ద రంధ్రంచేసి, తీయనైన - స్వచ్ఛమైన లోపలి ఎడనీరు మహాతృప్తిగా త్రాగివేశాము. ఆ బొండాలలో కొబ్బరి పట్టనేలేదు. ఈ స్వర్గద్వారాలకు అవతలనుండి శిఖరంనుంచి జాఱిపడే సెలయేటిరొద మృదంగధ్వనిలాగా లయయుక్తంగా వినిపిస్తున్నది.

"పతితపావన సీమ (నరకం) అయితే ఊహించినదానికంటె కొంత భయంకరంగానే ఉన్నదికానీ, స్వర్గంమాత్రం నా ఊహాకు రవంత తేడాతో సరిపోతున్నది." అన్నాడు బెంగ్టు.

నిర్విచారంగా వసుంధరమీద శయనించి, నారికేళ వృక్షాగ్రాలమీదనుంచి పయనిస్తున్న పలుచని తెలిమబ్బులను సకౌతుకంగా పరికిస్తూ ఉన్న మా ముఖాలలో ఆనందలక్ష్మి తాండవిస్తున్నది. వెనుకటివలె నిస్సహాయులమై మేము వాటిని అనుగమించటంలేదు. అక్షరాలా పాలినేషియాలో అచంచలమైన దీవిమీద నిర్భయంగా శయనించి ఉన్నాము.

మేము ఇల్లా పరిధులెఱుగని ప్రమోదపు పాలవెల్లిలో

ఆకాశపు అంచులు అందుకొంటూ ఉంటే, గిరిశృంగందగ్గఱ సెల యేటి ప్రవాహాలు ముందుకూ వెనుకకూ ఉయ్యాలలూగుతూ ధూమశకటంవలె ఆక్రందిస్తూ గగనాంచలాల వెంట కదలి పోతున్నాయి.

బెంగ్టు అన్నది నిజం – ఇది స్వర్గమే!

## పాలినేషియన్లతో

మా చిట్టిదీవిలో (మేము తప్ప) మనుష్యుడన్నవాడే లేడు. ద్వీపం అంతా కలిసి రెండువందలగజాలకన్న ఎక్కువ వెడల్పు లేనందున, అందులోని ప్రతివృక్షమూ, సముద్ర తీరమూ మాకు త్వరలోనే సుపరిచితాలైనాయి. లవణకాసారం కంటె దీని ఎత్తు ఆఱడుగులకులోపు మాత్రమే.

తల ఎత్తితే నారికేళవృక్షాగ్రాలనుంచి వ్రేలాడుతున్న పచ్చని గొండాలు కనువిందుచేస్తున్నవి. వాటిలో కదలాడు తున్న ఎడనీటివల్ల కొన్ని వారాలవఱకూ మేము తృష్ణ చల్లార్చుకోవచ్చును. కొన్నికాయలు బాగా తయారైనవీ ఉన్నాయి. పీతలు సమృద్ధిగా కనబడుతున్నాయి. కాసారంలో చేపలకు కొదువలేదు. అందువల్ల ఆహారంకోసం అంగలార్చ వలసిన పనిలేదు.

దీవికి ఉత్తరపువైపున, పాడువడ్డ ఒక కొయ్యవంతెన కనిపించింది. దానిలో సగం ఇసుకతో పూడిపోయింది. ఇక్కడ నుంచి ఉత్తరానికి చూస్తే అంచులంచులుగా విఱిగిపడ్డ పర్వత శిఖరం కనబడుతుంది మేము సముద్రంలో కొట్టుకొని

వచ్చినప్పుడు దగ్గఱగా కనిపించింది ఇదే. ఇంకా ఉత్తరానికి దృష్టిసారి స్తే, మఱొక చిన్నద్వీపంలోని కొబ్బరిచెట్ల తలలు కనిపిస్తున్నాయి. దక్షిణపు వైపున ఇంకొక చిన్నదీవి కనిపించింది. దీనిలో కొబ్బరిచెట్లు దట్టంగా పెరిగినట్లు కనబడుతున్నాయి. మాకు మఱీ దగ్గఱగా ఉన్నదీవి ఇదే.

ఎరిక్కు రెండుచేతులతో తన పెద్ద గడ్డిటోపీలో పీతలను నింపుకొనివచ్చాడు. నట్ కొన్ని ఎండుచితుకులు ప్రోగుచేసి మంటవేశాడు. దానిమీద పీతలను కాల్చుకొని తిని, కొబ్బరినీళ్లూ, కాఫీ త్రాగాము.

"ఇక్కడ ఒడ్డుకుచేరటం చాలా హాయిగా ఉన్నది కాదూ! ఏమంటారు బాలురు?" అని నట్ ఆనందంతో ప్రశ్నించాడు.

మా సముద్రయానానికి పూర్వమే అతనికి ఇటువంటి అనుభవం జరిగిఉన్నది. అలా ప్రశ్నిస్తూ, అతను ముందుకు తూలాడు. వెంటనే అక్కడ త్రాగుతూఉన్న నీటిపాత్ర చెప్పులులేని బెంగ్టు కాళ్ళమీదకు ఒరిగిపడ్డది. పాపం! ఆ వేడివేడినీళ్ళతో అతని పాదాలు తడిసి బొబ్బలెక్కాయి. నూట ఒక్కరోజు నావమీద గడిపిగడిపి, ఒడ్డుకు చేరుకొన్నందువల్ల ఆ నాడు మేము అందఱమూ చాలా సంభ్రమంగా ఉన్నాము. సముద్రపు కెఱటాలు వచ్చిపడనిచోటికి రాగలిగామన్న ఆనందంతో కొబ్బరిచెట్ల తోపులో తిరుగాడాము.

మా మా భోజనపాత్రలను బెంగ్టు అమర్చిపెట్టాడు. అవి చూడగానే ఎరిక్కు హర్షధ్వానం చేశాడు. నావమీద చివఱిసారి భోజనం చేసినప్పటిమాట నాకు జ్ఞాపకం వచ్చింది.

అప్పుడు పర్వతశిఖరం చెంత నేను నా భోజనపాత్రలు కడుగుతూఉంటే, ఎరిక్కు ఇవ్వాళ నేను నా భోజనపాత్రలను కడగటానికి శ్రమ పడనక్కరలేదు అన్నాడు. ఈనాడు చూస్తే, నా పళ్లెమూ గ్లాసూ ఎంత శుభ్రంగా ఉన్నాయో, అతనివీ అంత శుభ్రంగా ఉన్నాయి.

భోజనానంతరం మేము బాగా నానిఉన్న మా వైర్లెస్ సామగ్రిని బాగుచేసికోవటం మొదలుపెట్టాము. రారోటాంగాలోని వ్యక్తి మా ప్రయాణం విషాదాంతమైనట్లు ప్రకటించటానికి ముందుగా టార్స్టీనునన్నా, నట్టునన్నా మా కుశలం మిత్రమండలికి తెలియచెయ్యాలి. అందుచేత ఇది చాలా త్వరగా జరుగవలసి ఉన్నది.

వైర్లెస్ పరికరాలలో చాలాభాగం ఒడ్డుకు చేర్చాము. పర్వతశిఖరం దగ్గఱ మఱికొన్ని వస్తువులు మునుగుతూ తేలుతూఉంటే, బెంగ్టు అటువెళ్ళి ఒక పెట్టెమీద చెయ్యి వేశాడు. తక్షణం రివ్వున ఎగిరిపడ్డాడు. పాపం! అటువంటి విద్యుదాఘాతం తగులుతుందని అతను ఊహించలేదు. అయితే ఆ అనుభవంవల్ల దానిలో వైర్లెస్సామగ్రి ఉన్నదని స్పష్టపడ్డది. ఆపరేటర్లు వాటినన్నిటినీ ఊడదీసి పరీక్షిస్తూఉంటే, మిగిలినవాళ్ళం తలదాచుకునే వసతి ఏర్పాటు చెయ్యటానికి మొదలు పెట్టాము.

బయట నీళ్ళలో మునుగుతూ తేలుతున్న తెఱచాప కనబడ్డది. తక్షణం అది తీసికొనివచ్చి, రెండు కొబ్బరిచెట్లకు లాగి కట్టివేశాము. మిగిలిన రెండుప్రక్కల రెండుగడలు పాతి మొత్తంమీద ఒక పటకుటీరం నిర్మించామనిపించుకొన్నాము.

ఈ కుటీరానికి మూడువైపులా దట్టంగాఉన్న పూబోదరిండ్లు మూడుగోడలుగా ఉన్నవి. నాలుగవవైపుమాత్రం ద్వారంగా ఉన్నది. అక్కడనుంచి చూస్తే లవణకాసారం స్పష్టంగా కని పిస్తున్నది. ఘ్రాణతర్పణంగా సాగుతున్న పూలకన్నెల వలపుతో మా మనస్సులు దివ్యపథాలకు తేలిపోతున్నాయి. ఇక్కడ ఉండటం చాలాహాయిగా ఉంది. ఆనందపారవశ్యంతో మేము ఉప్పొంగిపోయాము. లేతలేత కొబ్బరిఆకులతో సెజ్జలు ఏర్పాటుచేసికొన్నాము. ప్రశాంతంగా పడుండి పైకి చూస్తుంటే, పొడుగాటిగడ్డం కల వృద్ధ కోన్-టికీ ముఖం మాకు ప్రత్యక్షమౌతున్నది. తూర్పుగాలితో అతనివక్షం ఉబికి పోవటంమాత్రం లేదు. పాలినేషియామీద మిలమిల లాడుతున్న తారామండలాన్ని అతను నిశ్చలుడై విలోకిస్తున్నాడు.

పరిసరాల ఉన్న పొదలమీద పతాకాలనూ, పరుపుచుట్టలనూ ఆరుగట్టాము. సముద్రజలంతో నానిపోయిన వస్తువులను ఇసుకమీద ఆరబెట్టాము. మళ్ళీ ఎండ కాచేసరికి అన్నీ ఆరిపోతాయి. వైర్లెస్‌సామగ్రికూడా ఆరవలసి ఉన్నందున ఆ యంత్రనిర్వాహకులకున్నూ అప్పట్లో మరేమీ పని లేకపోయింది. పరుపుచుట్టలు చెట్లమీదనుంచి తీసి రెండవవైపు ఎలాఉన్నదో చూచాము. అటుకూడా ఆరటం గమనించగానే మాకు ఎంతోసంతోషం కలిగింది. బెంగ్టు పరుపుచుట్ట త్రిప్పి చూచాడు. అది ఎక్కడా తడిగాలేదు. భగవంతుడు మాకు సుఖంగా నిద్రించటానికి తగిన పరిస్థితి అనుగ్రహించాడు.

మఱునాటి ఉదయం మేము నిద్రలేచేసరికి తెరచాప వాననీటి బరువుతో క్రిందికి వంగిఉన్నది. అదిచూడగానే బెంగ్టు

లవణ కాసారంవైపు పరుగెత్తి, కొద్దిసేపటిలోనే అక్కడి వాగులనుంచి మా ప్రాతఃకాల భోజనానికి సరిపడ్డ చేపలతో తిరిగివచ్చాడు.

లైమానుంచి బయలుదేరటానికి ముందు హెర్మన్‌కు మెడమీదనూ, వీపుమీదనూ దెబ్బలుతగిలి ఉండటంచేత, ఈ రాత్రి మళ్ళీ ఆ ప్రాతనొప్పులు బయటపడ్డాయి. ఎరిక్కుకు కూడా మానిపోయిన కీళ్ళనొప్పులు తిరిగి ప్రారంభమైనాయి. లేకపోతే బెంగ్టుతప్ప తక్కినవాళ్ళం అందఱమూ చిన్నచిన్న గాయాలు పడిఉన్నా, పర్వతశిఖరంవైపు షికారు వెళ్ళేవాళ్ళం. బెంగ్టు ముఖంమీద తెఱచాప కొయ్యబడి దెబ్బ తగలటంచేత అతను అసలు కదలలేదు. తెఱచాప త్రాడుకు చుట్టుకొని, చేతులూ కాళ్ళూ అవశాలైపోయి కమిలిఉన్న నేనూ చాలా విచిత్రంగానే ఉన్నాను.

అయితే ప్రాతఃకాలభోజనాలకు ముందుగా వినిర్మల లవణకాసారంలో ఒక్కసారి యీది రాలేనంత దుర్బలత యెవ్వరికీ లేదు. ఆ సరస్సు చాలా లోతైనది. దూరాన నీలిమ వ్యాపించిఉన్నదానిలోనుంచి వ్యాపారపవనంవల్ల అలలు కదలి వస్తున్నాయి. సరస్సుకు అవతలివైపున నల్లనిదీవుల అంచులు మాత్రమే కనబడుతున్నాయి. అంటే, అది యెంత వెడల్పుగా ఉన్నదో ఊహించుకోవచ్చును. కాని యిటువైపు దీవుల దగ్గరకు వచ్చేసరికి ఆ వ్యాపారపవనం తీవ్రతతగ్గి, కొబ్బరిచెట్ల ఆకులను మెల్లగా కదలించిపోతున్నది. ఈ ద్వీపశ్రేణులకు మధ్యనున్న సరస్సు చక్కని అద్దంలాగా ప్రకాశిస్తూఉంటే, ఈ చెట్లనీడలు దానిలో మనోహరంగా ప్రతిఫలిస్తున్నాయి. రంగు

రంగుల పరిసరాల శిలాఖండాలు తొమ్మిదడుగులలోతు ఉన్న సమీపజలంలో ప్రతిబింబిస్తుంటే, తత్క్షణం ఆ నీళ్ళలో ఈదాలన్న కుతూహలం మమ్మల్ని ముందుకు నెట్టింది. ఈ సౌందర్యానికి తోడు నీటిలో సంచరించే వన్నెవన్నెల చేపలుకూడా మమ్మల్ని ఆకర్షించాయి. అదంతా ఒక విచిత్రలోకం. దానిని చూచినవాడు అక్కడనుంచి తిరిగిరాలేడు. నీళ్లా! శరీరంలో నూతనచైతన్యం కలిగించగలిగినంత చల్లగా ఉన్నాయి. గాలి కూడా నులివెచ్చగా ఆహ్లాదకరంగా వీస్తున్నది. అయితే, ఈ వ్యామోహంలోపడి సరస్సులో క్షణకాలం గడపటానికి వీలు లేదు. మేము వెంటనే తిరిగివచ్చి, యీ సాయంకాలం లోపల రారొటాంగా వ్యక్తితో సంభాషించాలి. లేకపోతే కోన్-టికీ విచ్ఛిన్నమైపోయిందనీ, దానిలోని యాత్రికులు నశించారనీ అతడు ప్రకటిస్తాడు.

తీగచుట్టలు మొదలయిన వైర్లెస్ సామగ్రి తడిలేని శిలాఫలకాలమీద ఆటుతూఉన్నాయి. టార్ స్టీనూ, నట్టూ యంత్రాన్ని సరిచేస్తూఉన్నారు. పగలంతా యీ ప్రయత్నంతోనే కడచిపోయింది. వాతావరణం అంతకంతకు ఉద్రిక్తమౌతున్నది. మేము తక్కిన పనులన్నీ వదలిపెట్టి మా యంత్ర నిర్వాహకులకు అవసరమైన సాయం చెయ్యటానికి కూర్చున్నాము. రాత్రి పదిగంటలలోపల మా వార్త రారొటాంగాకు చేరాలి! అప్పటికి 36 గంటలు గడిచిపోతాయి! ఆ గడువు తీరిపోయిందంటే, మమ్మల్ని అన్వేషించటానికి క్రొత్తనావిక బృందాలను పంపించాలనీ, ముందుగా విమానాలను పంపిం

చాలనీ, రారొటాంగా వ్యక్తి ప్రపంచానికి విజ్ఞప్తి చెయ్య వలసివస్తుంది.

మధ్యాహ్నం గడిచింది. ప్రొద్దు పడమటికి తిరిగింది. సూర్యాస్తమయంకూడా అయిపోయింది. రారొటాంగా వ్యక్తి అలానే కనిపెట్టుకొని ఉంటే! ఏడు! ఎనిమిది! తొమ్మిది గంటలుకూడా అయింది! బిగువు సడలిపోయేట్లున్నది. రేడియో ట్రాన్సుమిటర్లలో చలనం కనిపించలేదు. కాని, ఎక్కడో ఒక ఎస్. సి 173 మీటర్ల మీద అస్పష్టమైన సంగీతం వినిపించటం మొదలుపెట్టింది. మా మిత్రుని ఉనికిదగ్గఱనుంచి మాత్రం ఏ శబ్దమూలేదు. తడిసిన తీగచుట్ట నెమ్మది నెమ్మదిగా ఆఱుతూ ఉన్నది. అందుచేత ట్రాన్స్‌మిట్టర్ పాషాణంవలె కేవలం జడంగా ఉన్నది. అక్కడక్కడ మెఱుపులూ కొద్దికొద్ది శబ్దాలూ మాత్రం బయలుదేరాయి.

ఇక గంటకూడా వ్యవధిలేదు. ఇందువల్ల ఏమీ ప్రయోజనం లేదు. కనుక ఆ ట్రాన్సుమిట్టర్ తొలగించి యుద్ధకాలం నాటి చిన్న ట్రాన్సుమిట్టర్ అమర్చటం జరిగింది. ఈ చిన్న ట్రాన్సుమిట్టర్ని పగలు చాలాసార్లు ఉపయోగించిచూచాము. అప్పుడది ఏమీ పనిచెయ్యలేదుగానీ, యిప్పటికి కొంచెం ఆఱింది. విద్యుద్ఘటాలన్నీ పాడైపోయాయి. కాని ఒక చేతి దీపంలోని చిన్న విద్యుద్ఘటాన్ని ఉపయోగించి మొత్తం మీద విద్యుత్తు ప్రవహింపజేశాము. అయితే అది బరువుగా ఉన్నది. ఈ యంత్రానికి దానిని ఎలాఅమర్చాలో మా నలుగురికి తెలియదయ్యె. తెలిసిన వాళ్లిద్దఱూ మిగిలినపరికరాలతో

కు న్నీలు పడుతున్నారయ్యో. అది అమర్చేసరికి మా తల్ప్రాణం తోకకువచ్చింది.

ముప్పై ఆఱుగంటలూ గడిచినట్టే అనిపించింది. "ఇక ఏడు నిమిషాలే!" "ఐదు నిమిషాలే!" అని మామిత్రులు గుసగుస లాడటం నాకు ఇప్పటికీ వినిపిస్తునట్లున్నది. ఈ గుసగుసలకు తర్వాత గడియారంవంక చూచినవాడు లేడు. ట్రాన్స్మిట్టర్ ఇంకా శబ్దించటమేలేదుగానీ, శబ్దగ్రాహకం మాత్రం రొదచేస్తున్నది. అకస్మాత్తుగా రారోటాంగానుంచి శబ్దం వినవచ్చింది. అక్కడి మా మిత్రుడు తహితీలోని రేడియో నిర్వాహకులతో ఏదో మాట్లాడుతున్నాడు. అంతలోనే రారోటాంగా వ్యక్తి మాటలు మాకు ఇలా వినవచ్చాయి.

"సమోవావైపు విమానం లేదు. ఇంతవఱకు నాకు తెలుసు......"

మళ్ళీ శబ్దం వినబడలేదు. ఇక ఆందోళన భరించరానిదైంది. అక్కడ ఏమి జరుగుతున్నది? మమ్మల్ని అన్వేషించటానికి విమానాలూ, మనుష్యులూ నానాముఖాల బయలు దేరటం జరిగిందా? సందేహం లేదు. మమ్మల్ని గుఱించి అన్వేషణ ఆరంభమైనది. ప్రతిదిక్కునా రేడియోలలో మా విషయమై వాకబు జరుగుతున్నది.

మా యంత్రనిర్వాహకు లిద్దఱూ అతి తీవ్రంగా కృషిచేశారు. మా మాదిరిగానే వారి కిద్దఱికీ ముఖాలు స్వేద జలం ఓడుతున్నాయి. నెమ్మదిగా ట్రాన్స్మిట్టర్ ఏరియల్ విద్యుత్ప్రవాహంతో నిండిపోయింది. టార్ స్టీన్ మోర్స్ కీ క్రింద

పెట్టేసరికి ట్రాన్స్‌మిట్టర్‌లో చలనం గుర్తించాడు. ఇప్పటికి చైతన్యం కలిగింది!

టార్‌స్టీన్ రారొటాంగాలోని వ్యక్తిని పిలుస్తూ ఉంటే, మేము యంత్రపుమీట త్రిప్పటం మొదలుపెట్టాము. మా ఘోష వినిపించుకొన్నవాడు లేడు. మళ్ళీమళ్ళీ యత్నం చేశాము. మా యంత్రం పనిచేస్తున్నది కాని రారొటాంగాకు మా మాటలు చేరటంలేదు. లాస్ ఏంజిల్స్ లోని హాలునూ, లైమా నౌకాదళంలోని ఫ్రాంకునూ పిలిచాము. మా మొఱ ఆలకించినవాడు లేడు.

అప్పుడు టార్‌స్టీన్ సి. వార్త ఒకటి పంపాడు. అంటే ప్రపంచంలోని రేడియో సంస్థలలో మా యంత్రంద్వారా వెళ్లేవార్తను అందుకోగల వాటినన్నిటినీ పిలిచాడు. ఇదికొంత వఱకు లాభించింది. ఒక అస్పష్టమైన గొంతు మమ్మల్ని పలకరించింది. మేము వెంటనే "మీ మాట మాకు వినబడుతున్న" దని జవాబు చెప్పాము. ఆ కంఠం తిరిగి అంతమెల్లగానూ ఇలా పలికింది.

"నా పేరు పాల్. నా నివాసం కొలరెడో. మీ పేరే మిటి? మీ నివాసం ఎక్కడ?"

ఇతనికి ఒక వైర్లెస్ యంత్రం ఉన్నదన్నమాట! టార్‌స్టీన్ రేడియోబీగం పట్టుకోగా, మేము మీటత్రిప్పుతూ, ఇలా జవాబిచ్చాము.

"ఇది కోన్-టికీ. మేము పసిఫిక్‌లోని ఒక నిర్జనమైన ద్వీపంలో చిక్కుపడ్డాము."

మా మాటలు పాల్ నమ్మనేలేదు. ప్రక్కవీధిలోని

మళ్లోక వైర్లెస్ యంత్రం యజమాని తనతో మేలమాడు తున్నాడని భావించాడు. తిరిగి మాట్లాడలేదు. మేము నిరాశతో జుట్టు పీకికొన్నాము. ఇక్కడ ఈ నిర్జనద్వీపంలో నక్షత్రాలే దీపాలుగా కొబ్బరిచెట్లక్రింద కూలబడి ఉన్నాము. మా మాటలు ఒక్కడుకూడా నమ్మటం లేదు.

అయితే టార్ స్టీన్ తనప్రయత్నం విరమించలేదు. అతను తిరిగి బీగండగ్గఱ కూర్చుండి "అందఱూ కులాసా! అందఱూ కులాసా!" అంటూ నిర్విరామంగా అఱవటం మొదలుపెట్టాడు. ఏది యేమైనా పసిఫిక్ మహాసముద్రంమీద మాకోసం జరిగే అన్వేషణోద్యమాన్ని ఆపుచేయాలి!

అప్పుడు మాకు మళ్ళీ ఒక బొంగురుగొంతు ఇలా వినవచ్చింది.

"అందఱూ కులాసాగాఉంటే బాధేమున్నది?" తర్వాత మాట వినబడలేదు. "ఏమిరా కాటా! అంటే ఎప్పటి ఆటే?" అన్నట్లయింది.

హఠాత్తుగా రారోటాంగా సజ్జనుడూ, పరిచితుడూ అయిన హాలూ మా మొఱ ఆలకించక పోయినట్లయితే, మతిచెడి, మేము కొబ్బరిచెట్లకు ఎగబ్రాకి, కాయలన్నీ నేల రాల్చి ఉండేవాళ్ళం. హాల్ ఆనందతో, తన్నుతాను సంబాళించుకోలేక, గద్గదస్వరంతో, తాను ఎల్ 1 ౨ బి నుంచి మాట్లాడుతున్నానని చెప్పాడు. తక్షణం మాకోసం జరిగే అన్వేషణ ఆపు చేయించగలిగాము. మఱుసటిక్షణం మేము మళ్ళీ ఒంటరివాళ్ళమై పోయాము. మమ్మల్ని తలచినవాడు లేడు. అలసి సొలసిన శరీరాలను ఆకు పానుపులమీదకు చేరవేశాము.

మరునటిరోజు చీకూ చింతాలేక, నవీన ద్వీపవాసపు మాధుర్యం తనివితీరా అనుభవించాము. కొందరు సరస్సులో ఈదితే, కొందరు చేపలను పట్టేవారు; లేకపోతే, పర్వతశిఖరం వైపుమళ్ళి, విచిత్రమైన సముద్రజంతువుల్ని అన్వేషించటానికి వెళ్ళేవారు కోన్-టికీ వైపు కనిపించే ఎత్తైనచోట చెట్లకు చిట్ట చివర ఒక గొయ్యిత్రవ్వి పెరూనుంచి తెచ్చిన ఒక కొబ్బరి కాయ పాతిపెట్టాము. అది అప్పుడే మొలకెత్తుతూ ఉన్నది. కోన్-టికీ తీరానికి చేరుకొన్నచోటికి ఎట్టయెదురుగా ఈ కొబ్బరిమొక్కకు వెనుక ఒక రాళ్ళగుట్ట గుర్తుకోసం ఏర్పాటు చేశాము.

కోన్-టికీ ఇప్పటికిన్నీ రాత్రిపూట సముద్రజలంతో తడుస్తూఉన్నా, పర్వతశిఖరానికి దూరానఉన్న పెద్దపెద్ద రాళ్ల మీద ఉండటంచేత ఎప్పటికప్పుడు ఆరిపోతూనే ఉన్నది.

వెచ్చని ఇసుకలో చాలాసేపు విశ్రాంతి తీసికొన్న తర్వాత ఎరిక్కూ, హెర్మనూ నూతనోత్సాహంతో పర్వత శిఖరంవెంట దక్షిణముఖంగా కనబడుతున్న పెద్దదీవికి చేరు కోవాలనుకొన్నారు. సొరచేపలకంటె, పాముచేపల విష యంలో జాగ్రత్తగా ఉండవలసిందనీ, దృఢమైన ఖడ్గంకూడా తీసికొని వెళ్ళవలసిందనీ నేను వారిని హెచ్చరించాను. ఈ శిఖరంవెంట పాముచేపలు విస్తారంగా ఉంటాయి. అవి విషపు కోరలతో మనిషి పాదం పాదం చీల్చివెయ్యగలవు. అవి మెరుపువలె క్షణంలోవచ్చి మీదపడతాయి. పాలినేషియన్లు సొరచేప ప్రక్కనైనా ఈదటానికి వెరువరుగానీ, పాముచేప అంటేమాత్రం హడలిపోతారు.

మామిత్రులిద్దఱూ సుదీర్ఘమైన ఆమార్గాన ప్రయాణం చెయ్యటానికి సమర్థులే. కాని, అక్కడక్కడ ప్రవహిస్తూఉండే కొండవాగుల్ని దాటడం మాత్రం తేలికపనికాదు. కొన్నిటిని దూకాలి; కొన్నింటిని ఈదిపోవాలి. ఎలాగైతేనేమి? వారు సురక్షితంగా ఆ పెద్దద్వీపం చేరుకొన్నారు. అది సన్నగా, పొడుగుగా ఉన్నది. ఎక్కడ చూచినా కొబ్బరిచెట్లే! పర్వత శిఖరం ద్వీపానికి పెట్టనికోటగా ఉన్నది. మా మిత్రులు ద్వీపం దక్షిణాగ్రంవఱకూ వెళ్ళారు. ఆ పైన మళ్ళీ పర్వతశిఖరం సముద్రపు నురుగుతో మునిగిఉన్నది. ఇంకా దక్షిణానికి పోతే మఱికొన్ని ద్వీపాలున్నాయి. ఆ నడుమ వారికి ఒక శిథిలమైన ఓడ కనిపించింది. అది రెండుముక్కలుగా విరిగిఉన్నది. దానికి నాలుగు స్తంభాలున్నాయి. అది ఒక స్పెయిను నౌక. ఇనుప పట్టాలు తెస్తూ మునిగింది కాబోలు! తుప్పుపట్టిన పట్టాలు పర్వతశిఖరం పొడుగునా పడిఉన్నాయి. వారు ద్వీపానికి రెండవ వైపునుండి వెనుకకు తిరిగారు గానీ, ఇసుకలో త్రోవ సరిగా కనబడటం లేదు.

తిరిగివచ్చేటప్పుడు వారికి మాటిమాటికీ చేపలు అడ్డు తగులుతూవచ్చాయి. వాటిని పట్టుకోటానికి ప్రయత్నిస్తుంటే, పాముచేపలు ఎనిమిదింటికి తక్కువగాకుండా వచ్చి ఎదురు కొన్నాయి. నిర్మలమైన నీటిలో చేపలజాడ కనిపెట్టగానే, మా మిత్రులు ఒక పెద్దఱాతిమీదకు దుమికారు. ఆ ఱాతి అడు గున చుట్టూ ఈ చేపలు చేరాయి. ఈ సన్నని క్రూరప్రాణులు మనుష్యశిశువంతలావుగా ఉన్నాయి. ఆకుపసుపు నలుపురంగు లలో విషసర్పాలలాగా కనబడుతున్నాయి. చిన్నతలలు;

కండ్లు కేవలం పాముకండ్లే! కోఱలు అంగుళం పొడుగుదాకా ఉండి, సన్ననిసూదులలాగా కనబడుతున్నాయి. మా మిత్రులు కత్తితో ఒక పాముచేపతల నఱికివేశారు. రెండవదానిని గాయపఱిచారు. వాటి నెత్తురు నీటిలో వ్యాపించగానే, చిన్న చిన్న నీలవుసారచేపలు వచ్చి, తక్కిన పాముచేపలమీద దాడి చేశాయి. ఇంతలో ఎరిక్కూ, హెర్మనూ మఱొక పెద్దజాతి మీదకు దూకి, క్షేమంగా తిరిగివచ్చారు.

ఆ రోజుననే నేను ద్వీపంలో తిరుగుతూ ఉండగా, హఠాత్తుగా నా చీలమండను ఏదో పట్టుకొన్నట్లయింది. తీరా చూస్తే స్క్విడ్ చేప! అది చిన్నదైనా, దాని చల్లనిచేతులు శరీరానికితగిలితే ఎంతో అసహ్యంగా ఉంటుంది. కొంతనీలమూ ఎఱుపూ కలిసిన దాని కండ్లు చూస్తుంటే కలిగేరోత ఇంతా అంతా కాదు. నేను నాబలం అంతా ఉపయోగించి కాలు విదలించాను. కాని అది పట్టువిడవనేలేదు. పోనీ అదెంతోపెద్దదేమో అంటే, మూడు అడుగులకంటె ఎక్కువ పొడుగులేదు. నా కాలికి కట్టినకట్టు దానిని ఆకర్షించి ఉంటుంది నేను కొద్ది కొద్దిగా ముందుకు దూకుతూ, దానతోనే కొంతదూరం వచ్చాను. పొడియిసుక ఉన్నచోటికి వచ్చినప్పుడు మాత్రమే అది నన్ను విడిచి నీళ్ళలో పడిపోయింది. అలా పోతున్నప్పటికీ చేతులుచాచి, అది నావైపే చూస్తున్నది. నేనే గనుక ముందుకు అడుగువేస్తే, అది మళ్ళీ నన్ను పట్టుకొనేటట్లే ఉన్నది. నాకు చేరువలో ఉన్న జాళ్ళగుట్టలోనుంచి ఎన్నో జాళ్ళు దాని మీదికి విసిరాను. చివఱకు అది కనపడకుండా పోయింది.

ఈ ద్వీపంలో ఉంటూఉండగా కలిగిన వేర్వేరు అనుభవాలు మాకు చాలా ఉత్సాహం కలిగించాయి. కాని జీవితంఅంతా ఇక్కడనే గడపలేము గదా! కాబట్టి యిక్కడి నుంచి బాహ్యప్రపంచానికిఎల్లాచేరుకొంటామని ఆలోచించవలసి వచ్చింది. ఒకవారం గడచినతర్వాత అలలతాకిడికి కోన్-టికీ ఒక యెత్తైన దిబ్బమీదికు వచ్చి, యిక అక్కడ నిశ్చలంగా పడిఉన్నది. పెద్దవైన దూలాలు ముందుకు కొట్టుకొనివచ్చి, కాసారాభిముఖంగా పెద్దజాళ్ళతో చిక్కుపడి ఉన్నాయి. మేము ఎంత నెట్టినా అది అంగుళమైనా కదలలేదు. ఎలాగైనా మొత్తంనావను మేము కాసారంలోపలికి చేర్చి, బాగుచేసి కొంటే,అవతలివైపు ద్వీపాలెల్లా ఉంటాయో చూడవచ్చును. ఆ ద్వీపాలలో గనుక మనుష్యులే ఉంటే, వారు కేవలం పశ్చిమప్రపంచంలో నివసిస్తున్నవారై ఉంటారు.

కొన్నిరోజులు గడిచాయి. ఒకనాటి ఉదయాన మా మిత్రులు కొందరు పరుగెత్తుకొనివచ్చి, కాసారంలో తెల్లని తెరచాప కనిపిస్తున్నదని చెప్పారు. మేము కొబ్బరిచెట్లెక్కి, వారు చెప్పినవైపు చూచాము. నల్లని కాసారంపైన తెల్లని తెరచాప ఒకటి స్వల్పపరిమాణంలో సుదూరంగా కనిపించింది. కొద్దిసేపటికి మరొకటికూడా కనిపించింది.

మధ్యాహ్నం సమీపిస్తూ ఉన్నకొద్దీ వాటి పరిమాణం పెరిగింది. అవి మాకు బాగా.చేరువైనాయి. మేము ఫ్రెంచి పతాకం ఒక కొబ్బరిచెట్టుకు కట్టి, నార్వేపతాకం ఒక స్తంభానికి కట్టాము. ఇంతలో ఒక తెరచాప మాకు మరింతదగ్గరకు రావటంచేత, ఆ చిన్నపడవ పాలినేషియన్లదే అని గుర్తించగలి

గాము. అది అధునాతనంగా తయారైనదే. ఇద్దరు గోధుమ వర్ణపు వ్యక్తులు దానిమీద నిలబడి మమ్మల్ని వింతగా చూస్తున్నారు. మేము చేతులు ఆడించాము. వారుకూడా అదే చేష్టతో మాకు సమాధానం ఇచ్చి, తిన్నగా మా ముందు ఆగారు. "ఇయా ఒరానా" అని పాలినేషియన్ భాషలో మేము వారిని అభినందించాము.

వారుకూడా ఏకగ్రీవంగా "ఇయా ఒరానా" అని ప్రత్యభినందనంచేశారు. ఒకడు పడవలోనుంచి దూకి, సన్నని కాలువవెంట దానిని ఈడ్చుకొంటూ మా దగ్గరకు వచ్చాడు

వారిద్దరూ శ్వేతవర్ణుల దుస్తులే ధరించారు గానీ, శరీరలక్షణాలచేత గోధుమవర్ణ జాతికే చెందినట్లు కనిపిస్తున్నారు. వారి కాళ్ళకు చెప్పులుగానీ, బూట్లుగానీ లేవు. మనుష్యులుమాత్రం మంచి బలిష్ఠులుగా కనబడుతున్నారు. ఎండ తగులకుండా ఉండటానికి ఇంట్లో తయారుచేసికొన్న గడ్డిటోపీలు ధరించారు. వారిద్దరూ మమ్మల్ని సమీపించారు. మేము ఎవరమో వారికి తెలియకపోయినా, చిఱునవ్వుతో కరచాలనం చెయ్యగానే ముత్యాలవంటి పండ్లు బయటపెట్టి, మౌనంగానే, తమ అకృత్రిమస్నేహాన్ని ప్రదర్శించారు.

మేము పాలినేషియన్ భాషలో పలకరించటం వారికి చాలా ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. అంగాటావ్ లోని వారి బంధువులు మాకు వీడ్కోలు చెప్పేటప్పుడు సరిగా ఇటువంటి ఆనందాన్నే ప్రదర్శించారు. గొంతు నొప్పి పుట్టేవరకూ పాలినేషియన్ గేయాలు కొన్ని వినిపించారు. ఆ తర్వాత వారు చెప్పగలిగిందీ, మేము బోధపఱ్చుకోగలిగిందీ

లేనందున, సస్నేహంగా నవ్వుతూ, అప్పుడే దగ్గఱకు వస్తున్న మఱొక చిన్నపడవను చూశారు.

ఈ క్రొత్తపడవలో ముగ్గురు మనుష్యులున్నారు. వారు చేతులూగిస్తూ, మమ్మల్ని అభినందించినప్పుడు వారిలో ఒకరికి కొంచెం ఫ్రెంచిభాష వచ్చునని స్పష్టమైంది. సరస్సుకు అవతలి ద్వీపాలలో ఒక చిన్నగ్రామం ఉన్నదనీ, అక్కడి పాలినేషియన్లు కొన్నిరాత్రులుగా మేము వేస్తూఉన్న మంటలు చూచారనీ అతనివల్ల తెలుసుకొన్నాము. రరోరియా పర్వతశిఖరం సందు నుంచి అక్కడికి చేరుకోవటానికి సరస్సుప్రక్కనుంచి ఒకే ఒక మార్గం ఉన్నది. ఈ త్రోవ గ్రామానికి తిన్నగా కుడిప్రక్క నుంచి ఉన్నందువల్ల ఇప్పుడు మేము చేరుకొన్నచోటికి వచ్చేవారు ఆ గ్రామస్థుల కంటబడక తప్పదు. అయితే మేము ఆ మార్గాన వచ్చిఉండనందువల్ల ఇక్కడ మేము వేసిన మంటలు మనుష్యులు వేస్తున్నవి కావనీ, ఏ దయ్యాలో భూతాలో అలా చేస్తున్నాయనీ ఆ గ్రామంలోని వృద్ధులు భావించారు. దీనితో మేము ఉన్నచోటికి వచ్చి యథార్థం ఏమిటో తెలుసుకోవాలనే ఆసక్తి కొందఱికి కలిగింది. కాని, అంతలో మానావలో నుంచి కొట్టుకొనిపోయిన పెట్టె ఒకటి సరస్సుమీదుగా ఆ గ్రామానికి చేరటం సంభవించింది. దానిమీద కొన్ని గుర్తులున్నాయి. కొంతకాలం తహితీలో ఉన్న ద్వీపవాసు లిద్దఱు అక్షరాలు మాత్రం నేర్చుకొని ఉండటంచేత, వారు ఆ పెట్టెమీద గుర్తుగాఉన్న అక్షరాలు చదివారు. పెట్టెకు ఒకప్రక్క "టికీ" అని నల్లని సిరాతో వ్రాసిన పెద్దపెద్ద అక్షరాలు గుర్తించారు. "టికీ" తమ మూలపురుషుడని వారికందఱికీ తెలిసిన

విషయం కాబట్టి, పర్వతశిఖరంమీద టికీ గానీ, అతనికి సంబంధించినవారుగానీ దయ్యాలై తిరుగుతున్నారన్న అనుమానం వెంటనే కలిగింది. కాని, ఆ వెంటనే మాకొక పెట్టెకూడా అక్కడికే కొట్టుకొనిపోయింది. సిగరెట్లూ, రొట్టె, కోకోలు కూడా కొట్టుకొనివెళ్ళాయి. ఆ పెట్టెలో ఒక పాతచెప్పు ఉన్నది వాటివల్ల ఓడ ఏదో పగిలిపోయిందనీ, దానిలోని వస్తువులే అలా కొట్టుకొనివచ్చాయనీ గ్రామస్థులంతా ఊహించారు. ఆ గ్రామపు పెద్ద మేము బసచేసిన ద్వీపంలోని మంటలు వేస్తున్నవారెవరో చూచిరావటానికి రెండు చిన్నపడవలలో మనుష్యులను పంపాడు.

మిగిలినవారి ప్రోత్సాహంవల్ల ఆ ఫ్రెంచిభాష నేర్చిన పాలినేషియన్, తమ ద్వీపానికి కొట్టుకొనివచ్చిన పెట్టెమీద "టికీ" అనే అక్షరాలు ఉండటానికి కారణం ఏమిటని, మమ్మల్ని ప్రశ్నించాడు. అప్పుడు మా నావ పేరు "కోన్-టికీ" అనీ, మా సామగ్రి అంతటిమీదనూ ఆ పేరే ఉన్నదనీ మేము జవాబు చెప్పాము.

మా నూతన మిత్రులు మాకథ అంతా విన్నారు. నావ పగిలిపోయినా, అందరూ ప్రాణాలతో ఎలా బయటపడ్డారా అనీ, అసలు అటువంటి నావతో ఇంతదూరపు ప్రయాణం ఎలా చెయ్యగలిగారా అనీ చాలా ఆశ్చర్యపడ్డారు. మా సామగ్రి అంతా తీసికొని, తమ చిన్న పడవలలో ఎక్కి, గ్రామానికి రావలసిందని వారు మమ్మల్ని అడిగారు. వారి ఆదరానికి మా కృతజ్ఞత తెలియజేస్తూ, మేము మాత్రం అప్పుడే రావటానికి వీలులేదని చెప్పాము. గిరిశిఖరంమీద పడి ఉన్న కోన్-టికీప

కూడా తీసికొని పోగలిగితే తప్ప, అక్కడనుంచి కదలగూడదని మేము నిశ్చయించుకొన్నాము. వారు శిథిలమైన మా నావ వంక చూచారు. దానిని ఇవతలకు తీసుకొనిరావటం నిజంగా కలలోనివార్త. అందువల్ల వారు మళ్ళీ మమ్మల్ని బయలు దేరవలసిందని వేడుకొన్నారు. మమ్మల్ని వెంటబెట్టుకొనికాని తిరిగిరావద్దని, తమ నాయకుడు గట్టిగా శాసించాడనికూడా చెప్పారు

ఇక మాలో ఒకరు ఆ నాయకుని దగ్గరకువెళ్ళి అద్వీపం లోని పరిస్థితులన్నీ తెలిసికొనివచ్చి, తక్కినవారికి చెప్పాలని నిర్ణయించుకొన్నాము. గిరిశిఖరంమీద కోన్-టికీని వదలి వెళ్లటానికి వీలులేదు. ఈ చిన్నదీవిలోని మా సామగ్రి అంతా తరలించుకొని పోవటానికీ వీలులేదు. కనుక బెంగ్టును ఆ పాలి నేషియన్లతో పంపాము. రెండు పడవలూ బయలుదేరి, కొంచెంసేపటిలోనే అదృశ్యమైనాయి.

మరునటి రోజున పడమటి ఆకాశం అంతా తెరచాప లతోనిండినట్లు కనిపించింది. మమ్మల్ని చూడటంకోసం అద్వీప వాసులు తమజలయానాలన్నీ వినియోగించుకొని వస్తున్నా రనిపించింది.

ఆ పడవలగుంపు యావత్తూ మాకు అభిముఖంగా సాగి వచ్చింది. మొదటి పడవలోనే మిత్రుడు బెంగ్టు కనిపించాడు. అతనిచుట్టూ గోధుమరంగు మనుష్యులు కొందరు కూర్చుని ఉన్నారు. నాయకుడుకూడా తమలోనే ఉన్నట్లు బెంగ్టు మాకు చెప్పాడు. వెంటనే మేము కూర్చున్న చోటనుంచి లేచి, సగౌరవముగా ఎదురు వెళ్ళాము.

బెంగ్ట్ ఆ నాయకునికి మమ్మల్నందరినీ ఎఱుకపరిచాడు. నాయకుని పేరు "టెపియురయారీ టెరీఫాటావ్" అని బెంగ్ట్ చెప్పాడు. కాని నేము "టేకా" అని సంబోధిస్తేనే, అతనికి తెలుస్తుందనికూడా వివరించాడు. అందువల్ల అతనిని నేము "టేకా" అనే సంబోధించాము.

నాయకుడు "టేకా" ఆజానుబాహువు. ఆ చూపులలో అసాధారణమైన తెలివి ఉట్టిపడుతూ ఉంటుంది. అతను అక్కడ సుప్రసిద్ధుడు; తహీతీరాజవంశంలోనివాడు; రరోరియా టాకూమ్‌ద్వీపాలకు ప్రభువు. అతను తహీతీలో చదువుకొని ఉండటంవల్ల ఫ్రెంచిభాష చక్కగా మాట్లాడటమేకాక, వ్రాయగలడు; చదవగలడుకూడాను. "నార్వే రాజధాని క్రిస్టియానా కాదా? బింగ్‌క్రాస్‌బీని మీరు ఎఱుగుదురా?" అని అతను నన్ను అడిగాడు. కడచిన పదియేండ్లలోనూ మూడుసార్లు మాత్రమే విదేశీయనౌకలు రరోరియాకు వచ్చాయనీ, తహీతీనుంచి మాత్రం సరుకులు తెచ్చి, కొబ్బరికాయలు తీసికొని వెళ్లటానికి పాలినేషియన్ నౌక ఒకటి మాత్రం సంవత్సరంలో చాలాసార్లు వచ్చిపోతూ ఉంటుందనీ చెప్పాడు. ఆ నౌక తిరిగి రావలసిఉన్నదట! ఇవ్వేళనో రేపో రావచ్చునట

ఇక ఆ ద్వీపాన్నిగూర్చి బెంగ్ట్ చెప్పిన సారాంశం ఇది. ఆ ద్వీపంలో ఒక బడి కానీ, వైర్లెస్ యంత్రంకానీ, ఎవరైనా శ్వేతజాతీయులుకానీ కనబడలేదు. అయితే అక్కడ నివసిస్తున్న 120 మంది పాలినేషియన్లున్నూ మాకు కావలసిన సౌకర్యాలన్నీ చేయటానికి నడుముకట్టారు. మేము అక్కడికి

చేరగానే పెద్దఎత్తున స్వాగతమర్యాదలు జరపటానికి తగ్గ యేర్పాట్లుకూడా చేశారు.

నాయకుడు మమ్మల్ని ముందుగా కోరిందేమంటే, మమ్మల్ని అందరినీ, ప్రాణాలతో ఒడ్డెక్కించిన నావను చూపించవలసిందని మాత్రమే. అప్పుడు మేము పాలినేషియన్లను వెంటబెట్టుకొని కోన్-టికీవైపు బయలుదేరాము. నావను సమీపించగానే పాలినేషియన్లందరూ తటాలున ఆగి, అందరూ ఒకేసారి ఆశ్చర్యంతో అనేకవిధాల మాట్లాడటం మొదలుపెట్టారు. కోన్-టికీ దూలాలు అన్నీ విశదంగా కనబడు తున్నాయి ఒక పాలినేషియన్ ఇల్లా కేకవేశాడు:

"అది పడవకాదు; పాయ్ - పాయ్!"

"పాయ్ - పాయ్" అని అందరూ ఏకగ్రీవంగా అవే మాటలు పలికారు.

వారు తత్క్షణం శిఖరంమీదికి పరుగెత్తి కోన్-టికీమీద ఎక్కారు. ఆనందంతో ఉద్రిక్తులైన పసిపిల్లలలమాదిరిగా నావ అంతటా తిరుగుతూ, దూలాల్ని తడిమిచూస్తూ, వెదురు తడకలూ, త్రాళ్లూ పరీక్షిస్తూ, ఆశ్చర్యసముద్రంలో మునిగి పోయారు. నాయకుడుకూడా తోడివారిపలెనె కొంతసేపు నావ మీద విహరించి, మళ్ళీ మా దగ్గఱకు వచ్చి, యిలా అన్నాడు:

"టికీ పడవకాదు. అది పాయ్-పాయ్!"

పాలినేషియన్ భాషలో కోన్-టికీ వంటి వడవను పాయ్-పాయ్ అంటారు. ఈస్టర్ ద్వీపంలో పాలినేషియన్ల తెప్పలకుకూడా ఇదే పేరు. పాయ్-పాయ్‌లు ఈనాడు లేవనీ, వాటినిగుఱించి వృద్ధులు చెప్పుతూఉండటం మాత్రం కద్దనీ

నాయకుడు మాకు చెప్పాడు. బాల్సాదుంగలను చూచి పాలినేషియన్లు ఎంతో అబ్బురపడ్డారు. కాని త్రాళ్ళవైపు చూడగానే చప్పరించారు. సముద్రపునీటిలో తడుస్తూ, ఎండకు ఎండుతూఉంటే అటువంటి త్రాళ్లు ఎంతోకాలం నిలవవు. వారు సగర్వంగా తమ పడవలకు కట్టిన త్రాళ్ళవైపు చూపించారు. అవి కొబ్బరిపీచుతో పేనినవి. అవి సముద్రంలో అయిదేళ్ళవరకూ చెక్కుచెదరకుండా ఉంటాయి. మేము మాచిన్న దీవికి తిరిగిరాగానే "ఫెన్యా కోన్-టికీ" లేక "కోన్-టికీ"ద్వీపం అని పేరుపెట్టాము. ఈ పేరు ఉచ్చరించటం మాకందరికీ సులభంగానే ఉన్నది కానీ, మా గోధూమవర్ణులు (పాలినేషియన్లు) సంక్షిప్తమైన నార్డిక్ క్రిస్టియన్ పేర్లు ఉచ్చరించటానికి చాలా శ్రమపడతారు. "నన్ను 'టెరై మెటీటా' అని పిలువవలసిం" దని చెప్పగానే, వారు అందరూ ఎంతో ఆనందించారు. మొట్టమొదట పాలినేషియాలో ఉన్నవాణ్ణి కాబట్టి, నాయకుడు నన్ను తన కుమారుడుగా సంభావించి ఆ పేరు పెట్టాడు.

పాలినేషియన్లు తమ పడవలలోనుంచి కోళ్లూ, గుడ్లూ, రొట్టెలూ, పండ్లూ తీసికొనివచ్చారు. సరస్సులో చొరబడి చేపలు పట్టితెచ్చారు. వాటితో కోన్-టికీ ద్వీపంలో మాకు కమ్మనివిందు జరిగింది. పెద్దమంట వేసి, దానిచుట్టూ అందరమూ కూర్చుని ఆ పదార్థాలన్నీ ఆరగించాము. పాయ్ పాయ్ మీద ప్రయాణిస్తున్నప్పుడు సముద్రంలో మాకు కలిగిన అనుభవాలను ఏకరువుపెట్టుతూఉంటే, పాలినేషియన్లు చెవులు దోరగిలబెట్టి విన్నారు. సొర తిమింగిలం వృత్తాంతం మళ్ళీమళ్ళీ చెప్పవలసిందని అడిగి, విని, ఎంతో ఉత్తేజితు

లైనారు. ఎరిక్కు దాని తలలో ఈకెక్కుగుచ్చిన ఘట్టాన్ని వర్ణించి నప్పుడల్లా, అప్పుడే క్రొత్తగా వింటున్నట్లు హర్షధ్వానాలు చేసేవారు. మేము భద్రపరిచిన నానాజాతి మత్స్యాల కళే బరాలను వారికి చూపించాము. వారు ఆ జాతులన్నింటికీ పాలినేషియన్ భాషలో ఉన్న పేర్లు చెప్పారు. అయితే సొర తిమింగిలం కానీ, జింపిలన్ కానీ వారు ఎన్నడూ చూచి యెఱుగరు.

సాయంకాలం కాగానే మేము వైర్లెస్ యంత్రందగ్గ రకు వెళ్ళాము. పాలినేషియన్లందరూ నూవంక సాశ్చర్యంగా చూస్తున్నారు. చర్చి సంగీతం వారినెంతైనా ఆకర్షించింది మేము అమెరికానుంచి హవాయిలా సంగీతం వినిపిస్తున్నప్పుడు వారి ఆనందం యింకా ఇనుమడించింది. రాత్రి కాగానే, అంద అమూ మంటచుట్టూ కూర్చున్నాము. మా ప్రయాణం మాకు ఎంత సాహసకృత్యంగా తోస్తున్నదో, వారికీ అంత సాహసకృత్యంగా తోచింది.

మఱునటి ఉదయాన మేము మేలుకొనేసరికి, కొందఱు పాలినేషియన్లు అప్పుడే చేపల్ని తెచ్చి వేయిస్తున్నారు. ఆఱుగురు కొబ్బరిచెట్లకు ఎగబ్రాకి మా ప్రాతఃపానీయంకోసం బొండాలు కోసి పడవేస్తున్నారు.

పర్వత శిఖరాన అనామ అపూర్వమైన గర్జన వినబడు తున్నది. వాయుతీవ్రత హెచ్చింది. కోన్-టికీకి వెనుక జల బిందువులు చాలా ఎత్తువఱకూ ఎగిరిపడుతున్నాయి. "టికీ ఈ రోజున ఇవతలకు వస్తుంది" అని, నాయకుడు కోన్ - టికీని తర్జనితో నిర్దేశిస్తూ "ఇప్పుడు ఒక పెద్దఅల వస్తుంది;" అన్నాడు.

పదకొండు గంటలయేసరికి పర్వతశిఖరంనుంచి సరస్సు లోపలికి వెళ్లే ప్రవాహం వడి హెచ్చింది. ఒక పెద్దపళ్లెం నీటితో నిండుతూ ఉన్నట్లు సరస్సు జలపూరితం అవుతున్నది. మా దీవి చుట్టూ నీటిమట్టం పెరిగింది. ప్రొద్దుతిరిగే వేళకు సముద్రంనుంచి ఉత్తాలమైన కెఱటం వచ్చింది. శిలనుంచిశిలకు నీరు దొర్లి పడుతూ, శిఖరాన్ని అధిగమించి వస్తున్నది. జలప్రవాహం ద్వీపానికి ఇరువైపులా సాగిపోతున్నది. అది మహాపాషాణాలను తెగగోసికొంటూ, ఇసుకదిబ్బలను నెట్టివేస్తూ ప్రవహిస్తున్నది. విడివిడిగా ఉన్న వెదురుగడలు ప్రవాహంమీద తేలి వస్తూ ఉంటే, కోన్-టికీకూడా కదలటం మొదలుపెట్టింది. తీరం ప్రక్కనుంచి పోయేవాటి నన్నిటినీ, మళ్ళీ కెఱటాలలో చిక్కుపడకుండా ద్వీపంలోపలికి చేర్చవలసి ఉన్నది. కొద్దిసేపటిలో పర్వత శిఖరంలో అత్యున్నత భాగాలుమాత్రమే కనబడుతూ, తక్కిన ప్రదేశం అంతా జలమయం అయింది. ద్వీపంచుట్టూ నీరు విస్తరిస్తుంటే, సముద్రం అంతా మమ్మల్ని ముట్టడిస్తున్నదనిపించింది. కోన్-టికీ గిఱ్ఱునతిరిగి, మళ్ళీ ఱాళ్లు అడ్డు తగిలే వఱకూ కొట్టుకొనివచ్చింది.

పాలినేషియన్లు నీటిలోదూకి, ఈదుతూ కోన్-టికీకి అభిముఖంగా వెళ్ళారు అక్కడ కనబడుతున్న పెనుఱాళ్లను చేరుకొని మెల్లమెల్లగా నావ సమీపించారు. నట్టు ఎరిక్కులు వారిని అనుసరించారు. నావమీద త్రాళ్లు అందుబాటులో ఉన్నాయి. చివరి ఱాళ్ళగుట్టను కూడా దాటి నావ శిఖరం నుంచి విడివడుతూ ఉంటే, పాలినేషియన్లు దానిమీదికిదూకి, ఆపటానికి ప్రయత్నించారు. కోన్-టికీ అంటే ఏమిటో వారికి

తెలియదు. అది పడమటికి సాగిపోతూ ఉంటే, దానిని ఆపటం అసాధ్యమని వారికి ఎలా తెలుసు? అది ప్రవాహంలో పడి, కాసారాభిముఖంగా అతివేగంతో ప్రయాణిస్తుంటే వారు నిస్సహాయులై నిలబడిపోయారు. అయితే, సమతలం చేసేసరికి కోన్-టికీ వేగం మందగించింది. నలుప్రక్కలా పరీక్షిస్తున్నట్లు మెల్ల మెల్లగా కదలటం మొదలుపెట్టింది. అది తిరిగి త్వరగా కదలబోతూ ఉంటే, పాలినేషియన్లు తీరాన ఉన్న ఒకకొబ్బరి చెట్టుకు త్రాటితో ముడివెయ్యగలిగారు. అంతటితో కోన్-టికీ ఆగిపోయి, దీవిప్రక్కన తాళ్ళమీదనూ, నీటిమీదనూ అల్లల్లాడుతూ, దరోరియా లోపలి కాసారంవైపు కదలుతున్నది.

"కే-కే-టే-హూరోహూ-హూరోహూ" అని కేకలు వేస్తూ ఆ కేకలతో ఉత్సాహం తెచ్చుకొని, అందఱమూ కలసి, కోన్-టికీని ఆ పేరనే వెలసిన చిన్నదీవిలోపలికి ఈడ్చాము. సముద్రపు కెఱటం మఱొక నాలుగడుగులు ఎత్తుగా వచ్చింది. మా ద్వీపం ఆ నీటితో మునిగిపోతుందనుకొన్నాము.

గాలితో ఉద్వేగంగా లేచిన అలలు సరస్సులో విఱిగి పడుతున్నాయి. పాలినేషియన్ల సన్నని పడవలు నీటితో తడిసి పోయాయి. మా సామానంతా వాటిలో అమర్చుకోటం అసాధ్యమయింది. పాలినేషియన్లు ఇండ్లకు మఱలిపోవాలని తొందర పడుతున్నారు. ఆ గ్రామంలో మరణశయ్యమీద ఉన్న ఒక కుఱ్ఱవాణ్ణి చూడటంకోసం బెంగ్టు హెర్మన్లు వారితో బయలుదేరారు. ఆ పిల్లవాడికి నెత్తిమీద కురుపు ఒకటి చీము పట్టిఉన్నది. మా దగ్గఱ పెన్సిలిన్ ఉన్నది.

మఱునటిరోజు కోన్-టికీ ద్వీపంలో మేము నలుగురం మాత్రమే ఉన్నాము. అనేకములయిన కొనలు తేలిన రాళ్ళతో కూడిఉన్న సరస్సుమీద ఎదురుగాలిలో పాలినేషియన్ల పడవలు మా చెంతకు వచ్చేఅవకాశం లేదు. సముద్రపు పోటు కొంతసేపు తగ్గినట్లున్నా మళ్ళీ తీవ్రమైంది.

ఆ తర్వాతరోజు వాతావరణం కొంచెం ప్రశాంతంగా ఉన్నది. మేము కోన్-టికీ అడుగుకు మునిగివెళ్ళి, మా తొమ్మిది దుంగలూ ఏ స్థితిలో ఉన్నాయో పరీక్షించాము. శిఖరం తాకిడికి ఒకటి-రెండు అంగుళాలలోతువఱకూ దెబ్బదిన్నప్పటికీ, దూలాలు ఇంకా దృఢంగానే ఉన్నాయి. వాటికికట్టిన త్రాళ్ళు అన్నీ లోపలికి కోసికొనిపోవటంచేత బాగా బిగిసే ఉన్నాయి. నాలుగు త్రాళ్ళుమాత్రం తెగిపోయాయి. మేము నావ పై భాగంఅంతా మళ్ళీ బాగుచేసికొన్నాము. వంటపెట్టె తీసి వెయ్యడంవల్ల నావ కొంచెం విశాలమైనట్లున్నది. వెదురు సుందిరం సరిచేశాము. విఱిగిన తెఱచాపకొయ్యని తిన్నగా నిలబెట్టాము.

ఆ మఱునటిరోజున పాలినేషియన్ల పడవలు మా దీవికి వచ్చాయి. హెర్మన్ బెంగ్టులుకూడా వచ్చారు. గ్రామంలో మా నిమిత్తం మంచిమంచి ఉత్సవాలు చెయ్యటానికి ఏర్పాట్లు జరిగాయని చెప్పారు. మేము ఆ ద్వీపానికి చేరినతర్వాత, నాయకుని దగ్గఱనుంచి వర్తమానం వచ్చేవరకూ, పడవలో కాలు నేలమీద పెట్టరాదట!

క్రొత్త గాలితెఱ రాకముందే, ఏడుమైళ్ళవెడల్పుఉన్న సరస్సుదాటి, అవతలిప్రక్కకు వెళ్ళాము. కోన్-టికీ ద్వీపంలో

ఊగుతూఉన్న ఆకులతో కొబ్బరిచెట్లు చేతులెత్తి మాకు వీడ్కోలు చెప్తూ ఉన్నట్లున్న దృశ్యం కన్నీరు తెప్పించింది. కొంతసేపటిలో తూర్పునఉన్న ద్వీపాలన్నిటితో బాటు మా చిట్టిదీవికూడా రేఖామాత్రంగా మిగిలిపోయింది. అయితే మాకు ఎదురుగాఉన్న ద్వీపాలుమాత్రం అంతకంతకు పెద్దవౌతున్నాయి. వాటిలో ఒక ద్వీపంమీద కొబ్బరిచెట్ల సందులలోఉన్న కుటీరాలపై ఆవిరి, పొగ, వలయాకారంలో పరిభ్రమించటం కనిపించింది.

గ్రామం కేవలం నిర్జీవంగా ఉన్నట్లున్నది. ఎక్కడా చలనమే కనిపించలేదు. ఇప్పుడు జరుగబోతున్న దేమిటో! తీరానికి దిగువ, రాళ్ళగుట్టలకు వెనుక ఇద్దరువ్యక్తులు మాత్రమే నిలబడి ఉన్నారు. వారిలో ఒకరు పొడుగుగానూ, సన్నగానూ ఉంటే, రెండవవ్యక్తి మంచి ఒడ్డూ పొడుగుగా ఉన్నాడు. మేము వారిని సమీపించగానే నమస్కరించాము. వారు ఎవరో కారు. నాయకుడు టేకా, ఉపనాయకుడు టుప్పూహో. టుప్పూహో హృదయపూర్వకమైన చిఱునవ్వు మమ్మల్ని అందరినీ ఆకర్షించింది. టేకా మేధావీ, సమర్థుడైన నాయకుడూనూ. టుప్పూహోమాత్రం పసిబిడ్డవంటిమనస్తత్వంకలఅమాయికుడు. ఎప్పుడూ ఆనందంగాఉండి తోడివారిని ఆకర్షిస్తాడు. ఆ సమున్నత విగ్రహంచేతను, రాజలక్షణాలవల్లనూ పాలినేషియన్ నాయకుడికి కావలసిన లక్షణాలు అతనిలో ఇమిడిఉన్నాయి. నిజానికి ఆ దీవికి టుప్పూహోయే నాయకుడు. కాని టేకాకు ఫ్రెంచిభాషవచ్చును కాబట్టిన్నీ, వ్రాతకోతలూ, లెక్కలూ తెలుసును కాబట్టిన్నీ తహితీనుంచి వచ్చేకొబ్బరివర్తకులవల్ల తన

ప్రజలు మోసపోకుండా చూస్తూ ఉన్నందువల్ల, టుప్రూహో కంటె ప్రాముఖ్యం సంపాదించాడు.

మేము అక్కడనుంచి గ్రామంలోని రచ్చసావడికి వెళ్ల వలసి ఉంటుందని టేకా మాకు చెప్పారు. ఇంతలో ద్వీపం లోని బాలురంతా ఉత్సవానికి వచ్చినట్లు బారులుదీరి వచ్చారు. వారు మాముందు నడుస్తూ ఉంటే, హెర్మన్ ఒక ఈటెకు పతాకాన్ని కట్టి వారితో నడిచాడు నాయకులిద్దరూ నాకు ఇరుప్రక్కలా ఉన్నారు.

తహీతీతో గ్రామానికి గల కొబ్బరివర్తకం చిహ్నాలు చక్కగా కనిపిస్తున్నాయి. నౌకనుంచి దూలాలూ, చెక్కలూ, ఇనుపరేకులూ దిగుమతి జరుగుతున్నట్లు గుర్తుగా ఆయా వస్తువులు అక్కడక్కడ పడిఉన్నాయి. కొన్ని కుటీరాలు పురాతన పద్ధతిలో కట్టినట్లు కనబడుతున్నాయి. మరికొన్నింటిని మాత్రం దూలాలతో బంగాళాపద్ధతిలో కట్టారు. కొబ్బరిచెట్లమధ్య దూలాలతో కట్టిన పెద్దయిల్లే రచ్చసావడి. మేము ఆరుగురం శ్వేతవర్ణులమూ అక్కడ ఆగవలసి ఉన్నది. మేము మందిరానికి వెనుకభాగానఉన్న ఒక ద్వారంగుండా లోపలికివెళ్ళి అక్కడనుంచి మోసాలలోపలికి వచ్చాము. గ్రామంలోని పిన్నలూ, పెద్దలూ, స్త్రీలూ, చంటిబిడ్డలూ వీరూ వారని యేమిటి? నడిచిగానీ, ప్రాకిగానీ పురోగమించగల వారందరూ అక్కడికివచ్చి, మాకు ఎదురుగా ఒక చతురంలో నిలబడ్డారు. అందరూ చాలా గంభీరంగా ఉన్నారు. కోన్-టికీ ద్వీపంలో మాకు సుపరిచితులైన మిత్రులుకూడా ఆ సమయంలో మమ్మల్ని గుర్తించనట్టే కనబడ్డారు.

మేము అందఱమూ మెట్లదగ్గఱకు వచ్చేసరికి ఆ గుంపు అంతా ఒకేమాటు శ్రుతిగలుపుకొంటూ చక్కని గానం ప్రారంభించింది. ఆ శబ్దాలు తెలిసిఉన్న టేకా ఏ యే పాటలు పాడాలో వారికి సూచనచేస్తూ ఉన్నాడు. కొందఱు వృద్ధులు మాత్రం కీచుగొంతుతో పాడినా, మొత్తంమీద ఆ గానం చాలా హాయి కలిగించింది. ఇందుకు వారు ఎంతో తర్ఫీదు పొందిఉన్నారు. ఫ్రెంచి నార్వే పతాకాలు మెట్లదగ్గఱ ప్రతిష్ఠించటంతో అధికారులవల్ల జరుగవలసిన స్వాగతమర్యాదలు పరిపూర్తి అయినాయి. టేకా నెమ్మదిగా రంగంనుంచి తప్పుకొన్నాడు. తత్క్షణం టుపూహూ ముందుకువచ్చి, ఉత్సవానికి నాయకత్వం వహించాడు. అతను ఒకసంజ్ఞ చేసేసరికి ఆ జనసమూహం ఒక క్రొత్తపాట ఎత్తుకొన్నది. ఈ మాఱు గానం ఇంకా ఆహ్లాదం కలిగించింది. ఎందువల్లనంటే ఈ భణితిగానీ, ఇందులోని మాటలుగానీ స్వకపోలకల్పితాలై చాలా స్వేచ్ఛగా పాడటానికి అవకాశం ఉండటమే. ఆ బాణీ వారికి నచ్చింది కూడానూ. దక్షిణసముద్ర వీచికలు మా వీపులక్రింద నర్తిస్తూ ఉయ్యాలలూపుతూఉంటే అనుభవించిన ఆనందం ఈ క్రొత్త పాట వింటూఉంటే మళ్ళీ అనుభవంలోకి వచ్చింది. మాటలన్నీ వెనుకటిమాదిరిగానే ఉన్నా, బాణీ హృదయరంజకంగా ఉన్నది. కొంతమంది ముందుగా పల్లవీ అనుపల్లవీ అందుకొంటూఉంటే, కొంతమంది మిగిలిన చరణాలు వరుసగా పాడుతూ ఉన్నారు.

"టెర్రై మెటీటా! ఒక చిన్న పాయ్-పాయ్‌తో సముద్రందాటి రరోరియాలో మా మధ్యకు చేరుకొన్న

మీకు సుస్వాగతం. ఇది యథార్థంగా సుదినం. మీరు మాతో పాటు చిరకాలం ఇక్కడ ఉండి, మనం అందఱమూ ఒకరిని ఒకరు విడరాని స్నేహబంధంతో అలరారేటట్లున్నా, ఇక్కడనుంచి మీరు ఏ దూరదేశం వెళ్ళినా మిమ్మల్ని మేము మఱచిపోకుండా ఉండేటట్లున్నా, కొంతకాలం మాకష్టసుఖాలు పంచుకొంటారు గదా! ఇది ఎంత సుదినం!"

ఇలా అతి సౌహార్దంతో మమ్మల్ని అభ్యర్థిస్తున్న ఆ పాలినేషియన్ల సౌజన్యానికి మేము చాలా ముగ్ధులమైనాము. అంతకుముందు పాడిన పాటనే మళ్ళీ పాడవలసిందని అడిగాము. వారు పాడుతూఉన్న కొద్దీ క్రొత్తమాధుర్యం తొణికిసలాడటం మొదలుపెట్టింది. ఒక పాయ్-పాయ్ మీద సముద్రతరణానికి మేము ఎందుకు బయలుదేరిందీ; సంగ్రహంగా ఆ ప్రజలకు చెప్పవలసిందని టుప్పూహూ నన్ను కోరాడు. వారి కందఱికీ ఈ విషయం తెలిసికోవాలని అతి కుతూహలంగా ఉన్నది. నేను ఫ్రెంచిభాషలో ప్రసంగిస్తే, టేకా దానిని వారికి అనువదించి చెప్పాలిట.

నా ప్రసంగం వినగోరుతున్న పాలినేషియన్ ప్రజలకు చదువులేకపోయినా, బుద్ధిబలంలో మాత్రం లోపంలేదు. దక్షిణద్వీపాలలో ఉన్న వారి బంధుమిత్రులతో కొంతకాలం నేను కలసిఉన్నాననీ, వారి పూర్వులను ఈ ప్రాంతానికి కొనివచ్చి, తదనంతరం ఎక్కడికి వెళ్ళిందీ తెలియని "టికీ"నిగురించి నేనుకూడా విన్నాననీ వారికి చెప్పాను. అయితే పాలినేషియాకు అతిదూరంలోఉన్న పెరూదేశాన్ని పాలించిన ఒక

బలవంతుడైన రాజు పేరు కూడా "టికీ" అని చెప్పాను. అతను సూర్యునివల్ల పెలసినవాడు కనుక ప్రజలు అతనిని "కోన్-టికీ" లేక "సూర్య-టికీ" అనేవారు. ఆ టికీ తన అనుచరులతో కలసి పెద్ద పాయ్-పాయ్‌లలో ప్రదేశం విడిచి బయలుదేరాడనీ, ఆ తర్వాత అతని జాడ తెలియలేదనీ వింటున్నాము కనుక, పాలినేషియన్ల పూర్వుడైన టికీ అతనే అయివుంటాడని మా ఆరుగురి అభిప్రాయం. పాయ్-పాయ్ సముద్రతరణానికి ఉపకరిస్తుందని ఎవ్వరూ విశ్వసించటంలేదు కనుక, ప్రయోగపూర్వకంగా పాయ్-పాయ్ ఉపయోగం నిరూపించటానికే మేము ఈ విధంగా బయలుదేరి వచ్చాము.

పైసంగతులన్నీ నేను చెప్పుతూవుండగా టీకా తర్జుమా చేసి చెప్పగానే టుప్పూహో ఆనందోత్సాహాలతో పరవశుడైనాడు. అతను చేతులుచాచి స్వర్గంవైపూ మా వైపూ నిర్దేశిస్తూ పాలినేషియన్ భాషలో అనర్గళంగా ఉపన్యసించాడు. ఆ ఉపన్యాసంలో అతను అనేకపర్యాయాలు "టికీ"ని పేర్కొన్నాడు. అతను ఏమి మాట్లాడుతున్నాడో గ్రహించటానికి వీలులేనంత మహావేశంతో సెలయేటి ప్రవాహంలాగా అతి వేగంగా ఉపన్యసించాడు. కాని, ప్రజలు అతని ఉపన్యాసంలో ఒక్క పదమైనా విడవకుండా విని ఆనందించగలిగారు. అయితే టీకా నా ప్రసంగం అనువదించేటప్పుడు మాత్రం చాలా తబ్బిబ్బుపడ్డాడు. టుప్పూహో ఆవేగం అతనిలో కనిపించనేలేదు.

తన తండ్రీ, తాతా, యింకా తన పూర్వులందరూ తమకు మొట్టమొదటి నాయకుడు "టికీ"యే అనీ, అతను స్వర్గాన్ని అలంకరించాడనీ చెప్పుకొనేవారని టుప్పూహో

అన్నాడు. తర్వాత శ్వేతవర్ణులు వచ్చి పాలినేషియన్ పెద్దల విశ్వాసాలన్నీ నిరాధారాలని చెప్పారు. టికీ ఇంకా ఉండటం ఎక్కడ? స్వర్గంలో యెహోవా ఉన్నాడు కానీ టికీ లేడు. "టికీ" ఒక అనాగరక జాతికి ఆరాధ్య దైవం. అందుచేత ప్రస్తుతం పాలినేషియన్లు అతనినే ఆరాధించవలసిన పనిలేదు. కాని యిప్పుడు మేము ఆఱుగురు శ్వేతవర్ణులమూ పాయ్-పాయ్ మీదనే సముద్రందాటి వచ్చాము. టికీ ఒకప్పుడు ఉన్నమాట నిజం. అయితే అతను ఇప్పుడు లేడు. చచ్చి స్వర్గాన ఉన్నాడు.

క్రైస్తవమత ప్రచారకుల కృషిని తల్లకిందులు చేస్తున్నానేమో అనే భయంచేత నేను ఇంకా కొంత ముందంజవేసి, టికీ అనేవ్యక్తి ఒకకాలంలో ఉన్నమాట సత్యమేననీ, అతను ఇప్పుడుమాత్రం మృతుడేననీ చెప్పవలసి వచ్చింది. అతను స్వర్గంలోనే ఉన్నాడో; నరకంలోనే ఉన్నాడో యెహోవాకే తెలుసు. మఱి యెహోవా స్వర్గంలో ఉన్నాడుగదా! టికీ మన వంటి మర్త్యుడే అయినా, టేకా, టువూహాలవంటి మహా నాయకుడు; వారికంటెకూడా గొప్పవాడే కావచ్చునేమో!

నా మాటలు గోధుమవర్ణులకు ఆనందాన్నీ సంతృప్తినీ చేకూర్చగలిగాయి. వారు చేసే శిరఃకంపాలూ, మృదు ప్రసంగాలూ పరికిస్తే, నా ఉపదేశబీజాలు సుక్షేత్రంలోనే పడ్డాయనిపించింది. "టికీ" అనేవ్యక్తి ఒకకాలంలో ఉన్నాడనేది ప్రధానవిషయం. అతను ఇప్పుడు నరకంలో ఉండిఉంటే ఆ ఉండటం అతనికే విచారకరం కానీ మఱిఒకరికి కాదు. అయితే

అతనిని తిరిగి చూడటానికి అవకాశాలు ఉన్నట్లు ఇందువల్ల స్ఫురిస్తున్నదని టుప్రూహో అన్నాడు.

ముగ్గురు వృద్ధులు ముందుకువచ్చి, మాతో కరచాలనం చెయ్యబోయారు. నాటి ప్రజలలో "టికీ"ని గురించి తెలిసిన వారు వారే అనడంలో సందేహంలేదు. ఆ ముగ్గురిలోనూ ఒకరు టికీసంగూర్చిన ఎన్నో కథలూ, పాటలూ పెద్దల దగ్గఱ నుంచి తెలిసికొని ఉన్నారని నాయకుడు మాకు చెప్పాడు. " "టికీ" ఏ దిక్కునుంచివచ్చాడో మీరేమైనా విన్నారా ?" అని అతనిని నేను అడిగాను. ఆ విషయం ఆ ముగ్గురిలో ఎవరూకూడా ఎన్నడూ వినలేదు. చాలాసేపు ఆలోచించిన తర్వాత వెనుకటిమాటలన్నీ జ్ఞాపకంచేసికొంటూ ఆ ముగ్గురి లోనూ వృద్ధుడైన ఒకవ్యక్తి టికీకి 'మాయీ' అనే బంధువు ఉండేవాడనీ, మాయీ గీతంలో అతను 'పురా'నుంచి ఆ ద్వీపా లకు వచ్చినట్లున్నదనీ, 'పురా'అంటే ఆకాశంలో సూర్యు డుద యించే భాగానికి పేరనీ చెప్పాడు. మాయీ పురానుంచి వచ్చాడు కనుక టికీకూడా పురానుంచే వచ్చి ఉంటాడనికూడా అతను అన్నాడు. మఱి పాయ్-పాయ్ మీద వచ్చిన మేముకూడా అక్కడనుంచే వచ్చి ఉండాలి. అందుకు సందేహమేమిటి?

నేను పాలినేషియన్లతో ఈస్టరు ద్వీపానికి చేరువలో మాంగరేవా అనే ద్వీపం ఒకటి ఉన్నదనీ, ఆ ద్వీపవాసులకు పాయ్-పాయ్లే తప్ప పడవలు తెలియవనీ, ఈ రోజువఱకూ పాయ్-పాయ్లే ఉపయోగిస్తూ ఉన్నారనీ చెప్పాను. ఈ విషయం ఆ వృద్ధులకు తెలియదు. కాని, తమ పూర్వులు పాయ్-పాయ్లు ఉపయోగించేవారని మాత్రం తెలుసు. కాల

క్రమాన వాటి ఉపయోగం తగ్గిపోయింది. సరికి ఈనాడు ఆ పేరు చెప్పుకోవటమూ, 'అల్లా ఉండేది' ఇల్లా ఉండేది; అని అనుకోవటమూ తప్పితే, అనుభవపూర్వకంగా ఏమీ తెలియదు. ఈ పాయ్-పాయ్‌నే "రాంగో-రాంగో" అనికూడా అనేవారని ఆ ముదివగ్గు చెప్పాడు ఆ పదం ఎన్నో కాలం వాడుకలో నిలువలేదు. కాని అతి ప్రాచీనకథలలో మాత్రం ఈ రాంగో-రాంగో అనేమాట వినవస్తుంది.

ఈ పేరునుగురించి తెలిసికోవలసిన విశేషం కొంత ఉన్నది. ఎందుచేతనంటే ఈ రాంగో అనే పదాన్నే కొన్ని ద్వీపాలలో "లోనో" అని ఉచ్చరిస్తారు అది పాలినేషియన్ పురాణకథలలో ప్రఖ్యాతుడైన ఒక నాయకుని పేరు. అతను అచ్చమైన శ్వేతవర్ణుడనీ, అతనిజుట్టు ఎంతో అందంగా ఉంటుందనీ ఆ పురాణాలు వర్ణించాయి. కెప్టెన్ కుక్ హవాయీకి ప్రప్రథమంగా వచ్చినప్పుడు ఆ ద్వీపవాసులు అతనిని చేతులు చాచి ఆహ్వానించారు. శ్వేతవర్ణుడైన తమ పురాతన బంధువు రాంగో అతనే అనీ, చాలా తరాలు గడచినతర్వాత మళ్ళీ ఆ నాడు తమ పూర్వుల మాతృభూమినుంచి పెద్ద ఓడమీద బయలుదేరి తమను చూడటానికి వచ్చాడనీ వారు భావించారు ఈస్టరుద్వీపంలో చిత్రకారులు లిఖించే పవిత్రమూర్తిని రాంగో-రాంగో అని వ్యవహరించటం ఉన్నది. అయితే ఆ విశిష్టరచన దీర్ఘకర్ణులతోనే అంతరించింది.

వృద్ధులు టికీని గురించీ, రాంగోరాంగోను గురించీ ముచ్చటించ గోరితే, యువకులు సొరతిమింగిలాన్ని గురించీ, మా సముద్రయానాన్ని గురించీ, యింకా, యింకా తెలుసు

కోవాలని కుతూహలపడుతున్నారు. అయితే అప్పటికి వంటలన్నీ తయారై చాలాసేపయింది. అనువాదంతో టేకా అలసిపోయాడు.

ఇక గ్రామస్థులందరూ వచ్చి మాతో కరచాలనం చెయ్యటానికి టేకా అనుమతించాడు. పురుషులు "ఇయా-ఒరా-నా" అని హర్షధ్వానాలు చేస్తూ వచ్చి మాతో కరచాలనం జరిపారు. మా చేతులు నిజంగా నొచ్చిపోయాయి. బాలికలు మెలికలు తిరుగుతూ ముందుకి వచ్చి, సిగ్గుపడుతూ ఒయ్యారంగా మమ్మల్ని అభినందించారు. వృద్ధకాంతలు అస్పష్టంగా ఏదో అంటూ, కలకల నవ్వుతూ, మా గడ్డాలవంకనూ, శరీరచ్ఛాయవంకనూ వేలు పెట్టి చూపటం మొదలుపెట్టారు. ఏ ముఖాన్ని పరికించినా మైత్రీ ముద్రితంగా కనబడుతున్నది. ఒకరి భాష ఒకరికి తెలియనంత మాత్రాన మా స్నేహానికి ఏమీ ఆటంకం కలుగలేదు. వారు ఏదో పాలినేషియన్ భాషలో అంటే మేము మరొకటి నార్వే భాషలో అంటూ వచ్చాము. మమ్మల్ని చూచి వారూ, వారిని చూచి మేమూ ఒకటే నవ్వటం! పాలినేషియన్ భాషనుంచి మేము మొట్టమొదట నేర్చుకొన్న పదం "ఇష్టం" అన్న అర్థం ఇచ్చేది. ఇంతేకాక ఒకడు తనకు కావలసినదాన్ని చూపితే దానిని వెంటనే తీసుకు రావాలి. ఇది చాలా తేలికగానే ఉన్నది. "ఇష్టం" అన్నప్పుడు ఒకడు ముక్కు చిరిస్తే అది గిట్టదన్నమాట. ఈ రెండు సంజ్ఞలతోనూ మాకు సర్వం చక్కగా జరిగిపోయింది.

మేము 127 గురు గ్రామస్థులతోనూ పరిచయం చేసికోవటం పూర్తికాగానే, ఒక పొడుగైన మేజాబల్ల తీసికొని

వచ్చారు. ఇద్దఱు నాయకులతో మేము ఆఱుగురమూ ఆ బల్లచుట్టూ కూర్చున్నాము. పల్లెపిల్లలు సువాసనలు గుబాళిస్తున్న భోజనపదార్థాలు పళ్లెంలో పెట్టి తీసికొనివచ్చారు. ఇంతలో కొందఱు బల్లమీదికి చేర్చవలసిన వస్తువులన్నీ చేర్చారు. మఱికొందఱు అందంగా గ్రుచ్చిన పూలదండలు తెచ్చి, మా కంఠాలను అలంకరించారు. చిన్నచిన్న పూల చెండ్లతో మా శిరస్సులకు కిరీటాలు'అమర్చారు. ఈ పుష్పాలు కమ్మనితావులు వెదజల్లుతూ, చల్లదనం కలిగిస్తున్నందువల్ల పగటివేడిమి ఎంతమాత్రమూ స్ఫురించనేలేదు. అంతలో విందు ప్రారంభమైనది. అక్కడనుంచి కొన్నివారాలవఱకూ ఆ ద్వీపంలో ఉన్నంతకాలమూ అదేవిధంగా విందులు జరిగాయి. బల్లమీద ఉంచిన రకరకాల ఆహారపదార్థాలు చూస్తేనే కడుపునిండినట్లున్నది. ఎఱ్ఱగా వేగిన పందిమాంసమూ, కోడిమాంసమూ, బాతుమాంసమూ, తాజాపీతలూ చూడగానే నోరూరుతున్నది. పాలినేషియా చేపకూరలూ,రొట్టెలూ, పండ్లూ, పాపైన్ పళ్ల రసమూ, కొబ్బరినీళ్లూ మమ్మల్ని ఆకర్షిస్తున్నాయి. మేము మా భోజనపరాక్రమం ప్రదర్శించటానికి ఉపక్రమించగానే ఒక బృందం హుల్యాలా పాటలు ప్రారంభించారు. పాటలకు అనుగుణంగా నవయువతులు కొందఱు నృత్యం మొదలుపెట్టారు.

తలకు అడుగున గడ్డమూ, పైన పుష్పకిరీటమూ ఊగులాడుతూఉంటే, తిండికి మొహంవాచినట్లు ఆహారపదార్థాలు నోట గ్రుక్కుకొంటున్న మా వాలకం చూచి బాలురంతా

ఉఁగబడి నవ్వుతున్నారు. ఇద్దఱు నాయకులూ మాతోబాటు ఆనంద ప్రపంచంలో సముత్తేజితులైనారు.

భోజనాలు కాగానే హుల్యాలా నృత్యం అత్యద్భుతంగా గింది. స్థానికమైన బృందనాట్యాలు మాకు చూపించాలని గ్రామస్థుల అభిప్రాయం. టీకా టుపూహాలతోబాటు మాకు తెలుగురకూ వసారాలో కుర్చీపీటలు వేశారు. మేము ఎనమండు గరమూ అక్కడ కూర్చోగానే, యిద్దరు గైటర్ వాదకులు వచ్చి, మడమలమీద కూర్చుని, వీనులవిందుగా, స్వచ్ఛమైన దక్షిణద్వీప సంగీతం వినిపించటం మొదలుపెట్టారు. ఇఱువరు పలుగా ఉన్న స్త్రీలూ, పురుషులూ, నడుముచుట్టూ మర్మ రంగా ధ్వనిస్తున్న కొబ్బరిఆకుల ఒడ్డాణాలతో బయలుదేఱి, తమకు ముందు వలయాకారంలో కూర్చుని పాడుతున్న బృందాన్ని అతిక్రమించి వచ్చి, ఆడుతూ పాడుతూ నాట్యం ప్రారంభించారు. వారి నాయకుడు చాలా చుఱుకైనవాడు. అతను ఎంతో చక్కగా పాడగలవాడు. ఆ పాటలో అతను పూర్తిగా తన్నుతాను మఱచిపోతాడు. పాపం! అతని చెయ్యి ఒకటి ఒక సొరచేప కొఱికివేసింది! నాట్యారంభంలో కొంత జంకు కని పించింది కానీ, పాయ్-పాయ దిగివచ్చిన శ్వేతవర్ణులు పురాత నవు పాలినేషియన్ నృత్యాన్ని అంతగా మెచ్చుకోనట్లు కని పించగానే ఎలాగైనా మెప్పు పొందాలనే పట్టుదలతో నృత్యంలో క్రొత్తజీవం వచ్చింది. కొందఱు పెద్దలుకూడా అందులో పాల్గొన్నారు. వారికి మంచి లయజ్ఞానం ఉన్నది. సాధారణంగా అభ్యాసంలేని అపూర్వపద్ధతులలో అతిసుంద రంగా వారు నృత్యం చెయ్యగలరు. సూర్యుడు శాంతమహా

సముద్రంలో అదృశ్యుడైనాడు. కొబ్బరిచెట్ల క్రింద జరుగుతూ ఉన్న ఆ నృత్యం అంతకంతకు మనోహరాతి మనోహరమైనది. ప్రేక్షకుల ప్రశంసలకు అంతులేదు. పాలినేషియన్లు మేము అపరిచితులమన్న మాటే మరచిపోయినట్లున్నారు. ఇప్పుడు మేము వారికి ఆత్మీయులం అయిపోయి, వారితోబాటు ఆనంద రసాస్వాదనం చేస్తున్నాము.

ఆ నృత్యరీతులకు అంతం అనేది కనబడలేదు. ఒకటి ముగియగానే మరొకటి ప్రారంభం ఔతోన్నది. చివరకు మాకు కొంచెం ముందుగా కొందరు యువకులు చక్రాకారంలో కూర్చున్నారు. టుపూహా సంజ్ఞతో అరచేతులతో నేలమీద తాళం వెయ్యటం మొదలుపెట్టారు. మొదట మెల్లగానూ, తర్వాత అంతకంటె వేగంగానూ తాళంనడుస్తూ ఉంటే, మృదంగనాదం జోడైంది దానితో లయలో పరిపక్వత వచ్చింది. అయితే ఆ మృదంగం లోకసాధారణమైనది కాదు. వట్టి కొయ్యపలకమాత్రమే. ఆ మార్దంగికుడు రెండు పొట్టి కఱ్ఱలు తీసికొని దానిని పలికిస్తున్నాడు. కొయ్యపలక అయితే నేమి? అచ్చంగా మృదంగంవలెనే ధ్వనిస్తున్నది. లయలో అభిమతగమనం వచ్చేసరికి గానం ప్రారంభమైనది. హఠాత్తుగా ఒక హుల్యాలాకన్య ఆ రంగంలోపలికి దుమికింది. మెడలోని పూదండలూ, చెవియందలి అవతంస పుష్పమూ ఆ కన్య సహజ సౌందర్యానికి మెఱుగుపెట్టాయి. మోకాళ్ళమీద కూర్చుండి, వల్లవాయణాలైన పాదాలపై శరీరభారం మోపి, లయానుగుణంగా చలిస్తూఉన్న లేనడుముతో, శిరస్సుపై భాగాన తీగలవలె వంపులు తిరుగుతున్న మృదుబాహువులతో

అత్యంత రమణీయంగా ఉన్న లతాంగి అచ్చమైన పాలినేషియన్ నృత్యభంగిమ ప్రదర్శించింది. ఆ నృత్యం జగన్మోహనంగా ఉన్నది. ఆమె నాట్యంచేస్తూ ఉన్నంతసేపూ యువక మండలం అరచేతులతో నేలమీద తాళంవేస్తూనే ఉన్నది. ఇంతలో నేనొకకన్య రంగంలోనికి వచ్చింది ఆమె వెనుకనే మరొకకన్య! ఒకరినొకరు నీడలలాగా అనుసరిస్తూ, కృత్రిమ హాస్యం ప్రదర్శిస్తూ, లయబద్ధంగా నర్తించారు. నేలమీద వేస్తున్న తాళమూ, తారస్థాయి నందుకొన్న గానమూ, మృదంగనాదమూ రక్తి కట్టించాయి. తాళంలో వేగం హెచ్చినకొద్దీ నాట్యం మరీమరీ చురుకుగా సాగింది ప్రేక్షకులు సంతోషపరవశులై కరతాళధ్వనులు చేయసాగారు.

దక్షిణ సముద్రంమీది ద్వీపాలలో మానవ జీవితానందం దీనితో పరాకాష్ఠకు వస్తుంది. ఆకాశంలో నక్షత్రకన్యలు బారులు తీర్చారు. కొబ్బరిచెట్లు ఆకులనే చేతులతో ఆతారా మండలాన్ని అందుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లు చలిస్తున్నాయి. నిశాకాంత ముగ్ధమనోహరమూర్తిలో ప్రసన్నత తొణికిసలాడుతున్నది పూలకన్నెల వలపులబరువుతో వాయుకుమారులు మందమందంగా విహరిస్తున్నారు. గాన ప్రవాహంలో మేము మునకలు వేస్తున్నాము. టుపూహా నావైపు తిరిగి, బుజంతట్టి "మేయ్-టాయ్?" అని ప్రశ్నించాడు. "ఆహా! మేయ్-టాయ్." అని నేను జవాబు చెప్పాను. "మేయ్-టాయ్?" అని అతను లక్కిన వారిని కూడా అడిగాడు. "మేయ్ - టాయ్" అని వారుకూడా ఉల్లాసంతో అన్నారు. ఆ మాటలకు అర్థంఏమిటో వారు ఊహించారు.

టువ్రూహో తలపంకిస్తూ, తన్ను తాను నిర్దేశించుకొంటూ "మేయ్ - టాయ్" అన్నాడు. అతనుకూడా ఇప్పుడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. టీకా కూడా ఆ నృత్యం ఎంతో ఉల్లాసకరంగా ఉన్నదని భావించాడు. రరోరి యాలోని తమ నృత్యప్రదర్శనలకు శ్వేతవర్ణులు రావటం అదే మొట్టమొదటిసారి అని చెప్పాడు. మృదంగధ్వనీ, చప్పట్లూ, పాటా, నృత్యమూ ఒకదానితో ఒకటి జతకలుస్తూ చివరి కాలానికి వచ్చాయి. అప్పుడు నృత్యంచేస్తున్న ఒకకన్య బృందంచుట్టూ తిరగటంమాని, మొదట ఉన్నచోటనే నిల బడింది. హెర్మన్‌వైపు బాహువులుచాచి, శరీరంలో ఎముకే లేదేమో అన్నట్లు వింతవంపులు తిరుగుతూ, నాట్యమాడటం మొదలుపెట్టింది. గడ్డంచాటున హెర్మన్ మందస్మితం వ్యక్తా వ్యక్తంగా ఉన్నది. ఆ కన్య ఆహ్వానాన్ని ఏ విధంగా స్వీక రించాలో, అతనికి తెలియనేలేదు.

"నువ్వు చక్కగా నాట్యం చెయ్యగలవు గదా! నీ నృత్య నైపుణ్యం ప్రదర్శించు!" అని అతనికి నేను రహస్యంగా ఉపదేశించాను.

హెర్మన్ వెంటనే గాయకచక్రం లోపలికి దూకాడు. అక్కడ ఉన్నవారందరికీ అంతులేని ఉత్సాహం కలిగింది. అర్ధ నతమైన శరీరంతో అతను హుల్యాలా నాట్యంలో కష్టసాధ్య మైన భంగిమలనుకూడా ప్రదర్శించగలిగాడు. దానితో ప్రేక్షకు లలో నిరవధికమైన ఆనందకోలాహలం బయలుదేరింది. అంత లోనే బెంగ్టూ, టార్‌స్టీనుకూడా నాట్యానికి సిద్ధపడ్డారు. క్షణ క్షణానికీ తీవ్రతరమౌతున్న లయ గతికి అనుగుణంగా నర్తిస్తున్న

వారికి కొంచెంసేపటిలోనే ముఖాలు స్వేదచ్ఛన్నాలైనాయి. మృదంగనాదం ఒక్కటి మాత్రమే వినవస్తున్నది. హుషారుగా నాట్యంచేస్తున్న కన్యలు ముగ్గురూ సుడిగాలికి కంపిస్తున్న చిగురుటాకులేమో అన్నట్లు, విచిత్రంగా కదలిపోతున్నారు. అంతటితో ఆ ప్రదర్శనం పూర్తిఅయింది. ముక్తాయింపులతో మార్దంగికుడు భరతవాక్యం సూచించటంతో నృత్యం ఆగి పోయింది.

ఇంకా కావలసినంతకాలం ఉన్నది. ఆ సాయంకాలం మా కోసమే వచ్చింది. మా ఆనందానుభవానికి మితి అనేది లేదు. తరువాతది పక్షినాట్యం. రరోరియాలోని ప్రాచీనపు వేడుకలలో ఇది ఒకటి. స్త్రీలూ, పురుషులూ రెండువరుస లుగా బారులుదీర్చి నృత్యనాయకుణ్ణి అనుసరిస్తూ పక్షిసమూ హంలాగా రంగంమీదికి ఉరికారు. ఆ నృత్యనాయకునికి ఖగ రాజు అని పేరు. అతను స్వయంగా నాట్యంలో పాల్గొనకుం డానే చక్కని ప్రదర్శనలు జరిపించాడు. ఆ నాట్యం పూర్తి కాగానే, అది మా నావ గౌరవార్థం జరిపిన నృత్యమనీ, అది మళ్ళీ జరుగుతుందనీ, అయితే, నాట్యాచార్యుని స్థానంలో నేను నిలబడాలనీ టుపూహ్ నాకు చెప్పాడు.

నాట్యాచార్యుడు చెయ్యవలసిందల్లా బిగ్గరగా కేకలు వేస్తూ ఒంటికాలిమీాద గిఱ్ఱున తిరుగుతూ, ఎగురుతూ, వెను కకూ ముందుకూ తిరుగుతూ, నెత్తిమీాదికి పైగా చేతులాడిస్తూ ఉండటమేనని నాకు తోచింది. వెంటనే నా తలమీాది పువ్వు కిరీటాన్ని తీసివేశాను. నృత్యరంగానికి నడిచాను. నా పాత్ర నిర్వహించటానికి అనువుగా, నేను వెలికలు తిరుగుతూ

నృత్యంచేస్తూ ఉంటే, టుపూహూ నిలబడినవ్వుతూ కుర్చీ పీటమీనుంచి పడ్డాడు. హఠాత్తుగా గాయకులూ, నర్తకులూ కూడా టుపూహూనే అనుకరించటంతో సంగీతం మందగించింది.

ఇప్పుడు అందరికీ నృత్యం చెయ్యాలనే కోరిక కలిగింది. పెద్దలూ, పిన్నలూ కూడా అందులో పాల్గొన్నారు. మార్దంగికులూ, నేలమీద తాళంవేసేవారూ యథాపూర్వంగా తమ తమ విధులు నిర్వహిస్తున్నారు. ఈ సారి హుల్యాలా నృత్యం మరీ విపరీతంగా సాగింది. మొట్టమొదట హుల్యాలా కన్యలు భూవాదక వలయం ప్రవేశించి చాకచక్యంతో నర్తిస్తూ, మమ్మల్నికూడా మళ్ళీ నాట్యానికి ఆహ్వానించారు. మాతో పాటు ఎందరో స్త్రీలూ పురుషులూ బయలుదేరారు. నాట్యం త్వరత్వరగా పై కాలాలకు వచ్చింది.

ఎరిక్ మాత్రం అచంచలుడుగా కనబడుతున్నాడు. అతను ఇంతవరకూ జితేంద్రియుడైన మహాయోగిమాదిరిగా కూర్చున్న చోటినుంచి కదలనేలేదు. నావమీద ఉండగా పడ్డ అవస్థా, గాయాలూ అతనిలో అంతవరకూ అణగిఉన్న కీళ్ళనొప్పులను మళ్ళీ అనుభవానికి తెచ్చాయి. అందుచేత అతను ఒక వృద్ధనావికునిమాదిరిగా ఒదిగికూర్చుండి, పొగ త్రాగుతున్నాడు. తనను నృత్యరంగానికి రావలసిందని బలవంత పెట్టే హుల్యాలాకన్యల హావభావాలకు అతను లొంగలేదు. హంబోల్టు ప్రవాహంమీది అతి శీతల ప్రదేశాలలో ఉండగా ధరించే గొర్రెచర్మపులాగూలు, ఒకదానిమీద ఒకటి తొడిగి కొని, పొడుగైన గడ్డంతో, అచ్ఛాదనలేని ఊర్ధ్వకాయంతో కొబ్బరిచెట్లక్రింద కూర్చుని ఉన్న అతను కేవలం రాబిన్‌సన్

క్రూసోలాగా కనబడుతున్నాడు. లావణ్యవతులైన యువతులు ఒకరి తర్వాత ఒకరు అతనిని తనవైపు త్రిప్పుకోవాలని ప్రయత్నించారు కానీ ప్రయోజనం లేకపోయింది. అతను బైరాగిలాగా పొగ త్రాగుతూ చూస్తున్నాడు. పొదలాంటి అతని జుట్టు పుష్పించినట్లు నెత్తిమీద పూలకిరీటం కనబడుతున్నది.

అప్పుడు జవ్వనపు బిగువుతో మిసమిసలాడుతున్న ఒక ప్రౌఢనాయిక రంగానికి వచ్చింది. కొద్దో, గొప్పో నర్తించినట్లుండి, తిన్నగా ఎరిక్కు వైపు నడిచింది. అతను ప్రమాదం గుర్తించినట్లు కనబడ్డాడు కానీ ఆ వీరనారి ముత్యాలు రాలినట్లు మృదువుగా నవ్వుతూ, అతనిచేయి పట్టుకొని కుర్చీ పీటమీద నుంచి యివతలికిలాగి తెచ్చింది. హాస్యాస్పదంగా ఉన్న ఎరిక్కు లాగూకి ఉన్ని లోపలివైపుగానూ, చర్మం పైవైపుగానూ ఉన్నది. అది ఒకచోట చినిగిపోవటంచేత, లోపలివైపున ఉన్న ఉన్ని తెల్లనిమచ్చలాగా పైకి పొడుచుకొనివచ్చి, నిక్కిన కుందేటితోకలాగా కనబడుతున్నది. పాపం! ఎరిక్కు చాలా అనిష్టంగానే వెనుకకు వెనుకకు తగ్గుతూ, తప్పనిసరిగా ముందుకు రావలసి వచ్చింది. ఒకచేతితో పొగగొట్టం పట్టుకొని, రెండవచేతితో వాతపునొప్పి పుట్టినచోటు తడిమికొంటూ, గాయకచక్రంమధ్యకు వచ్చి పడ్డాడు. అతను గిరగిరా తిరుగవలసి రాగానే, లాగూ జారిపోతూ ఉండటంవల్ల, అది గట్టిగా పట్టుకోబోయాడు. ఇంతలో తలమీది పుష్పకిరీటం ఒకప్రక్కకు పడిపోయింది. దానిని చక్కదిద్దుకోబోతుంటే, లాగూ బరువుగా ఉండటంవల్ల, దిగజారుతూ ఉన్నది. ఆ దీనుడు నిస్సహాయుడై ఒకచేత పుష్పకిరీటాన్ని,

ఒకచేత లాగూనూ పట్టుకొని, గంతులు వేయవలసి వచ్చింది. అతనిముందు గిలకలాగా నర్తిస్తూఉన్న ప్రౌఢ వికవికానవ్వుతూ ఉంటే, మాకు పట్టరానినవ్వు వచ్చింది. ఆ నవ్వుతో కండ్ల వెంట నీళ్ళుతిరిగి మా గడ్డాలమీద జాఱిపడుతున్నాయి. కొబ్బరిచెట్ల గుంపుమధ్య ఎరిక్కున్నూ, ఆ నాయకురాలున్నూ అలా గిరగిరా తిరుగుతూ హుల్యాలా నృత్యంచేస్తూ ఉంటే, గాయకచక్రంలోనివాళ్లు అందఱూ ఒక్కమాఱు పాట ఆపి, పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు. ఆ నవ్వులతో భూనభోంతరాలు నిండిపోయాయి. చివఱకు ఎరిక్కూ, నాయకురాలూకూడా, నృత్యం ఆపక తప్పిందికాదు. మఱి పాడేవాళ్లూ, ఆడేవాళ్ళూ, అందఱూ పాటా, ఆటా మాని, నవ్వులతో మెలికలు తిరిగి పోతున్నారయ్యా!

ఉత్సవం తెల్లవారేవఱకూ జరుగుతూనేఉన్నది. చివఱకు సూర్యోదయం అయినతర్వాత ఆ 127 గురితోనూ కరచాలనం చేసి, కొంతవిశ్రాంతి తీసికోవటానికి మాకు అనుమతి లభించింది. ఆ దీవిలో ఉన్నంతకాలమూ ప్రత్యూదయమూ, ప్రతి సాయంకాలమూ వారందఱితోనూ మేము కరచాలనం చేస్తూనే ఉన్నాము. ఊరిలోని ప్రతికుటీరమూ అన్వేషించి, గ్రామస్థులు మాకు ఆఱుపరుపులు తెచ్చి, రచ్చసావడి గోడ ప్రక్కనే ఒకదానివెంట ఒకటి అమర్చారు. గంధర్వకథలలోని ఏడుగురు మఱుగుజ్జులలాగా, మేము మా శిరస్సులకు సరిగా పైన వ్రేలాడుతున్న పూలగుత్తుల తియ్యనితావులు ఆఘ్రాణిస్తూ, కమ్మగా నిద్రించాము.

మఱుసటిరోజున తలమీద వ్రణం పుట్టిన ఆ

ఆపేండ్ల పిల్లవానిస్థితి చాలా ప్రమాదంగా ఉన్నది. అతని జ్వర తీవ్రత 106° లకు మించిపోయింది. ఆ వ్రణం పిడికిలి ప్రమాణానికి ఎదిగి, చాలా పోటు పుట్టుతున్నది.

అటువంటి వ్రణాలవల్ల ఆ దీవిలో చాలామంది పిల్లలు మరణించారని టేకా మాతో అన్నాడు. మాలో ఎవరమైనా అతనికి చికిత్స చెయ్యలేకపోతే, అతను ఎన్నోరోజులు బ్రతుకడనికూడా చెప్పాడు. మాదగ్గఱ మాత్రలరూపంలో పెన్సిలిన్ ఉన్నది కానీ, ఆ పిల్లవానికి ఎంతమోతాదులో మందు వాడాలో మాకు తోచలేదు. "నా చేతిమాత్రా వైకుంఠ యాత్రా" అన్నట్లు జరిగిందంటే, అంతవఱకూ మాకు అక్కడ ఉన్న మర్యాద మట్టిపాలు కావడమే కాక, ఇంకా పరిస్థితులు ఎల్లా విషమిస్తాయో చెప్పలేము.

నట్ టార్స్టీనులు అత్యున్నతంగా ఉన్న కొబ్బరి చెట్లకు వరియల్సు అమర్చి, వైర్లెస్ యంత్రాన్ని పలికించటానికి యత్నించారు. సాయంకాలానికి ఫలితం కనిపించింది. లాస్ ఏంజిల్సులోని మా కంటికి కగపడని మిత్రులు హాల్ ఫ్రాంకులు పిలుపు విన్నారు. ఫ్రాంకు టెలిఫోనులో ఒక డాక్టరును పిలిచాడు. మేము మోర్సుబీగంతో సంకేతించి, పిల్లవాని లక్షణాలూ మా దగ్గఱ ఉన్న మందులూ ఏకరువుపెట్టాము. డాక్టరు జవాబు ఫ్రాంకు మాకు తెలియజేశాడు. ఆ రాత్రి మేము వ్రణంతో బాధపడుతున్న ఆ "హావ్ మాటా" కుటీరానికి వెళ్ళాము. గ్రామస్థులలో సగంమంది అక్కడనే ఉన్నారు. పరిపరివిధాల రోదిస్తూ, పిల్లవాణ్ణిగుఱించి గందఱగోళ పడుతున్నారు.

హెర్మన్నూ, నట్టూ పిల్లవానికి చికిత్స చేస్తూ ఉంటే, మిగిలిన మేము నలుగురికీ గ్రామస్థుల నందరినీ పిల్లవానికి దూరంగా ఉంచటంతో సరిపోయింది. నేను వాడికత్తితో లోపలికి వచ్చి వేడినీళ్లు కావాలని అడిగేసరికి, పిల్లవాని తల్లి మతిపోయి వెర్రిచేష్టలు మొదలుపెట్టింది. కుర్రవాని జుట్టంతా తీసివేశాము; వ్రణం ఛేదించాము. దానిలోనుంచి చీము చిమ్మిన ఇంటికప్పుదాకా పోయింది. అది చూడగానే చాలామంది గ్రామస్థులు భయంతో చెల్లాచెదరైనారు. నిజంగా ఆ దృశ్యం చూస్తే ఎవరికీ గుండె నిలవదు. చీము అంతా పోయిన తర్వాత, తలకు కట్టుకట్టి, పెన్సిలిన్ వాడటం మొదలుపెట్టాము. రెండు రాత్రులూ పగళ్ళూ జ్వరంతో స్పృహ లేకుండా, చీము స్రవిస్తూ ఉన్న ఆ పిల్లవాణ్ణి కనిపెట్టుకొని ఉండి, నాలుగేసి గంటల కొకసారి మందు వాడుతూ వచ్చాము. ప్రతి సాయంకాలమూ లాస్ ఏంజిలిస్ లోని డాక్టరుతో సంప్రతిస్తూ ఉన్నాము. అకస్మాత్తుగా పిల్లవాని జ్వరతీవ్రత తగ్గిపోయి, చీముకు బదులు రసి కారుతున్నది. ఇందువల్ల వ్రణం మాను పట్టుతుందన్న ఆశ కలిగింది. అప్పటినుంచీ కుర్రవాడు కండ్లు తెరిచి చూడటమే కాకుండా, శ్వేతవర్ణుల విచిత్ర ప్రపంచంలోని మోటారు కార్లనీ, ఆవుల్ని, ఎన్నో అంతస్తులున్న మేడల్ని చిత్రించిన పటాలు చూడాలని, కుతూహలపడటం మొదలుపెట్టాడు.

ఒకవారం గడచింది. అటుతర్వాత హాన్-మాటా తోడిపిల్లలతో కలసి, సముద్రతీరాన ఆడుకోటం ప్రారం

ఖించాడు. అతని తలకు కట్టినకట్టు అలాగే ఉన్నది. అదిన్నీ కొద్ది కాలంలో తీసివేయవచ్చునని చెప్పాము.

ఇంతవరకు ఇది జయప్రదంగా నడిచేసరికి, మా వద్దకు వచ్చే రోగులసంఖ్య దినదినాభివృద్ధి అయింది. పంటినొప్పి ఒకటీ, వాతబాధ ఒకటీ సర్వసాధారణంగా కనబడ్డాయి. పెద్దలకూ, పిన్నలకూ కూడా ఎక్కడో ఒకచోట కురుపనేది ఉండనే ఉన్నది. వారినందరినీ డాక్టరయిన నట్ హోర్న్లన వద్దకు పంపటమే మా పని. ఆ డాక్టర్లు, వారు ఏయే ఆహారం తీసికోవచ్చునో నిర్ణయించి చెప్పి, మందులు ఇచ్చేవారు. అనతికాలంలో మా ఆసుపత్రిలో మందులుతప్ప తక్కిన హంగులుమాత్రం మిగిలాయి. మాత్రలూ, పూతమందులూ పేరుకైనా లేకపోయాయి. కొందరికి బాగా కులాసా చిక్కింది. ఎవరికిన్నీ పరిస్థితి విషమించలేదు. ఔషధాలు అంతరించిన తర్వాత మూర్ఛ మొదలయినజబ్బులు గల స్త్రీలనిమిత్తం కోకో, ఓట్ల గంజీ తయారుచేసి యివ్వటం మొదలుపెట్టాము.

కొద్దిరోజులలోనే మా పాలినేషియన్ మిత్రులు ఉత్సవాలలో నూతన కార్యక్రమం ఒకటి ఏర్పాటుచేశారు. మాకు తహితీయా పౌరసత్వం ఇవ్వటమూ, పాలినేషియన్ పేర్లు పెట్టటమూ అందులోని ప్రధానాంశాలు. నా మట్టుకు నాకు "హైరె మెటీటా" అనే పేరు ఇక్కడ ఇక ఎంతమాత్రమూ చెల్లుబాటుకాదు. అది "తహితీ"లో మాత్రమే వ్యవహారయోగ్యం.

ఒక చతురాకారమైన స్థలంలో మాకు ఆరుగురికీ ఆరు కుర్చీపీటలు వేశారు. వాటిచుట్టూ చక్రబంధంలాగా గ్రామస్థు

లందరూ కూర్చుని ఉన్నారు. టీకా కూడా వారితోబాటు కూర్చున్నా, అతనిలో ఒకవిధమైన శీవి ఉట్టిపడుతున్నది. యథార్థానికి అతనే వారికి నాయకుడు. అయితే ప్రాచీనమైన పద్ధతులలో జరిగే ఆచారకాండలలో అతనికి ఏమీ ప్రమేయం లేదు. వాటికి టుపూహా మాత్రమే ఆధ్వర్యం వహిస్తాడు.

సభ్యులందరూ భయభక్తులతో నిశ్శబ్దంగా కూర్చుని తనరాకను ప్రతీక్షిస్తూఉండగా, సమున్నత స్థూలవిగ్రహుడు టుపూహా లావుపాటి కర్ర ఒకటి సవిలాసంగా ఊగిస్తూ, హుందాతనంతో పరిషత్తును సమీపించాడు. ఆ సమయంలో తన బాధ్యతా, పెద్దరికమూ ఎలా నిర్వహించుకోవాలో అత నికి తెలుసు. ఆలోచనా మగ్నుడై, ముందుకు వస్తూఉన్న అతనిని చూడగానే, సభ్యులందరి నేత్రాలూ అతనిమీదనే పడ్డాయి. అతను తిన్నగా మమ్మల్ని సమీపించి, మాకు ఎదు రుగా కూర్చున్నాడు. నాయకత్వమూ, అద్భుతవక్తృత్వమూ, నటనాకౌశలమూ అతన్ని పుట్టుకతోనే వరించాయి.

అతను ప్రధానగాయక మార్దంగిక నర్తకుల ముఖమై, చేతికఱ్ఱతో ఒక్కొకరిని నిర్దేశిస్తూ, మృదుస్వరంతో సంక్షి ప్తంగా కర్తవ్యం బోధించాడు. తర్వాత అతను మా వైపు తిరిగి, హఠాత్తుగా తన విశాలనేత్రాలు సమగ్రంగా విచ్చి చూచాడు. తామ్రశోణమైన అతనిముఖంలో వెన్నెల వెదజల్లు తున్నట్లున్న పెద్దకన్నులూ, పలువరుసా అద్భుతంగా ప్రకా శిస్తున్నాయి. అతను తన చేతికఱ్ఱ పైకి ఎత్తి పట్టాడు. అటు తర్వాత అతని పెదవులనుంచి వెలువడేమాటలు సంచినుండి జాఱిపడుతున్న కాఫీగింజలవలె ధారాపాతంగా సాగాయి.

అతను చదివినవన్నీ పురాతనపు పాలినేషియన్ మంత్రాలు. అయితే ఎవరికో వృద్ధులకుతప్ప, అవి తక్కినవారికి ఏమీ అర్థం కావు. ఈ తరం వారందరూ అవి ఎన్నడూ విని యెరుగరు.

తర్వాత టేకా అతని ప్రసంగాన్ని మాకు అనువదిస్తూ ఉంటే టికారోవా అనే అతను తమ ప్రథమ ప్రభువనీ, ఆయన ఈ రరోరియా శిలావలయం నలుదిక్కులా, మాత్రమే కాక ఊర్ధ్వలోకాన్నికూడా పరిపాలించాడనీ చెప్పాడు.

టికారోవా ప్రభువును గురించి గాయకులు ముక్త కంఠాలతో గానంచేసిన తర్వాత, టుపూహాో తన దీర్ఘ బాహువు నా వక్షస్థలంమీదఉంచి, సభ్యులవైపు తిరిగి నాకు "వరోవా టికారోవా" లేక "టికారోవా ఆత్మ" అని నామ కరణం చేస్తున్నట్లు చెప్పాడు.

పాట ముగిసిన తర్వాత బెంగ్టు హెర్మన్‌ల వంతు వచ్చింది. గోధూమవర్ణాంచితమైనటుపూహాోహస్తం వక్షస్థలం మీద నిలిచిఉండగా ఒకరితర్వాత ఒకరుగా వారిద్దరూ పాలి నేషియన్ పేర్లు ధరించారు. హెర్మన్ పేరు "టుపూహాో ఇటీ టాహువా." బెంగ్టు పేరు "టోపాకినో." ఈ రెండున్నూ పురా తనపు పాలినేషియన్ వీరులపేర్లు. ఆ వీరులు రరోరియా ముఖద్వారంవద్ద ఒక సముద్రభూతంతో పోరాడి ఆ భూతాన్ని వధించారు.

మార్దంగికుడు మళ్ళీ కొన్ని క్రొత్తవరుసలు ద్రుత గతిలో వాయించాడు. తత్క్షణం ఇద్దరు బలిష్ఠులయిన వృద

షులు చెఱొకబల్లెం చేతబుచ్చుకొని ముందుకువచ్చారు. వారు మోకాళ్ళు ఱొమ్ముకు తాకేటట్లు ఎగిరిదూకుతూ, బల్లెములు ఎత్తిపట్టి, తల ఇటూ అటూ త్రిప్పుతూ, కదను త్రొక్కటం మొదలుపెట్టారు. మృదంగంమీద మఱొక క్రొత్త వరుస ప్రారంభంకాగానే వారు ఒక్కమాఱు పైకి ఎగిరి లయబద్ధంగా యుద్ధక్రీడ ప్రారంభించారు. అది కేవలం ప్రాచీనపద్ధతిలో ఉన్నది. అతి వేగంగా జరిగిన ఆ యుద్ధక్రీడ స్వల్పకాలంలోనే ముగిసింది. అది సముద్రభూతంతో "ఇటీటాహువా," "టూపాకినో"లు చేసిన యుద్ధానికి అనుకరణం. తరువాత కొంత సేపు పాటసాగిన తర్వాత యథావిధిగా టూర్‌స్టీనుకు "మారొక్" అని నామకరణం జరిగింది. ఆ "మారొక్" అనేది ఈ గ్రామాన్ని పాలించిన ఒక పూర్వరాజు పేరు. ఎరిక్కు నట్టులకు "శేన్-మటూరావ్," "టెఫాన్యుయీ" అని నామకరణాలు జరిగాయి అవి నావికులుగానూ, సముద్ర వీరులుగానూ ప్రఖ్యాతులయిన యిద్దఱు పాలినేషియన్ల పేర్లు. అలా నామకరణాలు జరిగినవెంటనే ప్రాచీనగేయాలు చాలా సేపు పాడటం జరిగింది. ఆ పాటలలోని పదాలు ఎంతో త్వరితంగా పలుకుతూ ఉండటంచేత, శబ్దస్వరూపం తెలిసికొనటానికి అవకాశం లేకపోయింది.

ఇప్పటికి ఉత్సవం పూర్తిఅయింది. మళ్ళీ నాట్యకత్తెలు ముందుకు వచ్చారు. వారు గడ్డితో అల్లిన టోపీలు ధరించి, ఊగులాడుతూ ఉన్న నిమ్మగడ్డి కిరీటాలు తీసికొనివచ్చారు. మా ముందు కొంతసేపు నాట్యంచేసి ఆ కిరీటాలు మా తలల

మీద ఉంచారు. మా గోమ్ములచుట్టూ మెత్తనిగడ్డి చోళ్ళాలు ఉన్నవి. మళ్ళీ వినోదాలు ప్రారంభమైనాయి.

ఒకరాత్రివేళ రారోటాంగాలోని రేడియో మిత్రుడు మాకు ఒకవార్త అందజేశాడు. అది తహితీనుంచి వచ్చిన ఆహ్వానం. పసిఫిక్ సముద్రంమీది ఫ్రెంచివలసరాష్ట్రాల గవర్నరు మాకు ఆ ఆహ్వానం పంపాడు.

పారిస్‌నుంచి వచ్చిన ఆజ్ఞలప్రకారం మమ్మల్ని తహితీకి తీసుకొనిపోవటానికి అతను 'టమారా' అనే ప్రభుత్వపు ఓడను మాకోసం పంపుతున్నాడు. అందు చేతకొబ్బరికాయలనిమిత్తం వచ్చే ఓడకోసం మేము కాలనిర్ణయం లేకుండా వేచి ఉండవలసిన అవసరంలేదు. పసిఫిక్ ద్వీపాలలోని ఫ్రెంచి వలస రాజ్యాలకు తహితీ కేంద్రస్థానం. ఆ ద్వీపాలన్నిటిలోనూ బాహ్యప్రపంచంతో సంబంధం ఉన్నది అది ఒక్కటే. మేము మా స్వగృహాలకు వెళ్ళాలంటే తహితీమీదుగానే వెళ్ళాలి.

రరోరియాలో వేడుకలు జరుగుతూనేఉన్నాయి. ఒక రాత్రి సముద్రంనుంచి కొన్ని కేకలు వినిపించాయి. కొంత మంది చెట్లమీదకు ఎక్కి ఆ కేకలు వస్తున్న వైపు చూచి కాసారముఖద్వారం దగ్గర ఒక ఓడ ఉన్నదని చెప్పారు. మేము కొబ్బరిచెట్లతోపులగుండా తీరానికి పరుగెత్తుకొని వెళ్ళాము. మేము రరోరియాలో ప్రవేశించిన దిక్కుకు ఎదురుగాఉన్న దిక్కును చూచాము. అక్కడ పర్వతశిఖరం మీద విఱిగిపడే సెలయేళ్ళు చాలా స్వల్పంగా ఉన్నాయి.

సరస్సులోపలికి చేరే ప్రోవకు కొంచెం అవతల ఒక

నౌక దీపాలు కనిపిస్తున్నాయి. ఆకాశం చాలా నిర్మలంగా ఉంది. నక్షత్రాలు చక్కగా ప్రకాశిస్తున్న ఆ సమయంలో రెండు నౌకాస్తంభాలు గల పెద్దఓడ బాహ్యస్వరూపం గోచరిస్తున్నది. ఇది మా కోసం గవర్నరు పంపించిన దేనా ? అయితే లోపలికి రాదేమి ?

గ్రామస్థులలో కలవరం బయలు దేరింది. ఇప్పటికి మాకుకూడా పరిస్థితి బోధపడ్డది. ఓడలో చాలా సామగ్రి ఉన్నది. సమస్తం తలక్రిందులౌతుందేమోనని భయం కలుగుతున్నది. అది కాసారపు గట్టుకు అడుగున అదృశ్యంగా ఉన్న కొండకొమ్మున నిలబడి ఉన్నది.

వెంటనే టార్స్టీను ఇలా కేక వేశాడు :

"క్వెల్ బాటీయూ ?"

"మావేయీ !" అని సమాధానం వచ్చింది.

"మావేయీ" అంటే యీ ద్వీపాలనుంచి కొబ్బరికాయలు కొనిపోవటానికి వచ్చే ఓడ. అది యిప్పుడు కొబ్బరికాయలకోసమే రరోరియాకు వస్తున్నది. నౌకాపార్శ్వాన ఒక పాలినేషియన్ అధికారీ, అతని అనుచరులూ నిలబడి ఉన్నారు. ఓడకు అడుగున కొండ ఉన్నట్లు వారికి తెలుసు. అయితే, ఆ చీకటిలో సముద్రప్రవాహం భయంకరంగా ఉన్నది. ఓడ కాసారపు గట్టుకు అవతలగా ఉండటం అదృష్టమే. పైగా గాలికూడా ఎంతమాత్రమూ తీవ్రంగా లేదు. కాని, సరస్సుకు వెలుపలఉన్న ప్రవాహం వేగం చాలా భయంకరంగా ఉన్నది. మావేయీలోనిసరుకుబరువుకే అది

మునిగిపోయేటట్లు ఉండటంచేత, నావికులు చిన్నచిన్న పడవల ద్వారా ఆ సరుకు ద్వీపానికి చేర్చటం మొదలుపెట్టారు. నౌకా స్తంభాలకు గట్టిగా త్రాళ్ళు బిగించి పడవలలో కూర్చుని ఇవతలి కొనలు పట్టుకొన్నారు. పడవలు ఒడ్డుకురాగానే, గ్రామస్థులు ఆ త్రాళ్ళను పట్టుకొని, దగ్గఱలో ఉన్న కొబ్బరి చెట్లకు ముళ్ళు వేశారు. ఇందువల్ల ఓడ తలక్రిందులు కాకుండా ఉండవచ్చును. నావికులు ఓడకు బిగించిన మఱికొన్ని త్రాళ్ళను పట్టుకొని, గిరిశిఖరపు సందువద్ద కాచుకొనిఉన్నారు. సరస్సు నుంచి ప్రవాహం బయటికి వచ్చినప్పుడు ఓడను నెమ్మదిగా అవతలికి లాగవచ్చునని వారి అభిప్రాయం. గ్రామస్థులందఱూ చిన్నచిన్న పడవలలో బయలుదేరి వెళ్ళి, ఓడలోని కొబ్బరి కాయలు ఇవతలికి తీసికొని రావటానికి నావికులకు తోడ్పడ్డారు. ఓడపార్శ్వాన 90 టన్నుల కొబ్బరికాయలు ఉన్నాయి. బస్తాలుబస్తాలుగా కొబ్బరికాయలు మూటలుకట్టితెచ్చి తీరాన పడవేశారు.

ఎంతఎత్తున కెఱటం వచ్చినా, ఓడ యివతలకి రానే లేదు. ఆ ఱాళ్ళమీదనే చిందులాడుతున్నది. తెల్లవారేటప్పటికి దానిపరిస్థితి మఱీ విషమించింది. నావికులు నిరుపాయులైనారు. చిన్న పడవలలోనూ, డింగీలలోనూ కూర్చుండి, 150 టన్నుల ఓడను ఇవతలకి లాగుకొనిరావటం అసాధ్యంకదా! అది అలాగే ఱాళ్ళమీద చిందులాడుతూఉంటే, కొంతసేపటికి ముక్కలు ముక్కలైపోక తప్పదు. గాలిలో మార్పు వచ్చినా, శిలాప్రాకారానికి తాకి భగ్నం కావలసిందే.

మావేయీకి వైర్లెస్ లేకపోయినా, మాదగ్గఱ ఉన్నది.

అయినప్పటికీ, తహితీకి వర్తమానంపంపి, ఇక్కడ ఇది ఖండ ఖండాలయ్యేలోపల మరొక ఓడను రప్పించి, దానిద్వారా దీనిని రక్షించటమున్నా జరిగేపని కాదు. రరోయియా ఒక నెల లోనే రెండు ఆహుతులు పుచ్చుకోనేట్టున్నది.

ఆరోజు మధ్యాహ్నం అయేసరికి పశ్చిమదిశను "టమారా" కనిపించింది. రరోయియాలోని మమ్మల్ని అన్వేషించటానికే అది వస్తున్నది. దానిమీద ఉన్న నావికులు మా చిన్నపడవకు బదులుగా రెండు తెరచాపకొయ్యలు గల పెద్ద ఓడ పర్వతశిఖరంమీద నిస్సహాయంగా ఊగులాడుతూ ఉండటం చూచారు. వారికి చాలా ఆశ్చర్యం కలిగింది.

టమారామీద ట్యుమాటో ట్యుబై ద్వీపసమూహాలను పరిపాలించే ఫ్రెంచి అధికారి యం. ఫ్రెడరిక్ అహ్నా ఉన్నాడు. మమ్మల్ని కలసికోనటానికి తహితీనుంచి అతన్ని పంపించారు. అతనితోపాటు ఒక ఛాయచిత్రగ్రాహకుడు టెలిగ్రాఫిస్టూకూడా ఉన్నారు. వారూ ఫ్రెంచివారే. కాని నౌకాధిపతీ, నావికులుమాత్రం పాలినేషియన్లే. యం. అహ్నా తహితీలో నివసిస్తున్న ఫ్రెంచికుటుంబంలో పుట్టాడు. అతను సముద్రప్రయాణాలు ఎన్నో చేసినవాడు. నౌకాధిపతి అయిన పాలినేషియన్ "అపాయకరమైన యిటువంటిచోట నౌకను ఎలా నడిపించాలా!" అని మథనపడుతున్నాడు. ఇంతలో అహ్నా ఆ భారం తనకు ఒప్పజెప్పవలసిందని అడిగాడు. నౌకాధిపతి సంతోషంతో అందుకు అంగీకరించాడు. టమారా అహ్నా ఆధిపత్యాన జలమగ్నాలైన కొండలకు తగులకుండా బయలు

దేటి వస్తూఉంటే, కొంతసేపటికి రెండుఓడలకూ లావుపాటి మోకులను బిగించటం జరిగింది. అన్నే ఎంత జాగ్రత్తగా అపాయాన్ని దాటిపోవటానికి ప్రయత్నిస్తూఉన్నా, విపరీతంగా సాగుతున్న సముద్రప్రవాహం రెంటినీ లాగివేసేటట్లున్నది.

ఒక పెద్ద అలతో మావేయీ కొండకొమ్ము దాటింది. టమారా వెంటనే దానిని లోతునీళ్ళలోపలికి లాగింది. మహా వేగంతో సరస్సువైపు కల మెరకప్రాంతాలకు మావేయీ కొట్టుకొనిపోయేట్టున్నది. ఇంతలో మళ్ళీ పెద్దఅలలు చుట్టు ముట్టాయి. నూడురోజులవరకూ మావేయీ లోనికి చేరిన నీరు తోడివేస్తూ ఉన్నా, అది గ్రామానికి దూరంగా సముద్రంలో మునిగిపోయే స్థితిలోనే చిక్కుకొని ఉన్నది. మునిగియీదగలిగిన ద్వీపవాసులు కొందరు అక్కడికి వెళ్ళి, మావేయీకి అడుగునఉన్న రంధ్రాల్ని బాగుచేశారు. సీసపు పలకల్ని తీసికొనివెళ్ళి ఆ రంధ్రాలలో బిగించారు. అందువల్ల ఎప్పటికప్పుడు నీటిని ఎగజిమ్ముతూ, టమారావల్ల మావేయీ ఒడ్డుచేరుకొనటానికి అవకాశం కలిగింది.

వెంటనే టమారా దానిని సరస్సులోని మెరక ప్రదేశాల మధ్యగా కోన్-టికీ ద్వీపం మీాదుగా ఇవతలికి లాగికొని రావటానికి ప్రయత్నించింది. నావికులందరూ టమారా చేరు కొన్నారు. దానివెనుకనే మావేయీ వస్తున్నది.

ఇక మేము రరోరియా విడిచివెళ్ళవలసిన ముహూర్తం సమీాపించింది. అప్పుడు ద్వీపంలో విషాదదేవత తాండవించింది. మళ్ళీ గ్రామం మొత్తంలో నడవగలిగినవారూ, ప్రాకగలిగిన వారూ అంటే వృద్ధులు మొదలుకొని శిశువులవరకూ తీరా

నికి వచ్చారు. మేము పడవఎక్కి టమారాకు చేసుకొంటూ ఉంటే, మాకు అభిమానపాత్రాలైన గేయాలన్నీ పాడటం మొదలుపెట్టారు.

ఆడుతూ పాడుతూ ఉన్న గ్రామస్థుల మధ్య హావ్‌మాటాను చేతబట్టుకొన్న టుపూహో సమున్నతమూర్తి మాకు చాలాదూరం వఱకూ కనబడుతూనే ఉన్నది. హావ్-మాటా ఎలుగెత్తి విలపిస్తున్నాడు. ఆ మహానాయకుడు టుపూహో కండ్ల వెంటకూడా బాష్పాలు రాలుతున్నాయి. మొత్తం గ్రామంలో చెమర్చని కన్నులేదు. అయినా సరే! వారు మేము కనబడుతూ ఉన్నంతవఱకు మాకు ప్రియమైన పాటలు పాడుతూనే ఉన్నారు. చివఱకు చుట్టుప్రక్కల కొండ కొమ్ములమీదనుంచి జాఱిపడే సెలయేళ్ళరొదలలో ఆ పాటలు మునిగిపోయాయి.

తీరాన నిలిచిఉన్న ఆ అకల్మషచిత్తులు వారి ఆఱుగురు మిత్రుల వియోగానికి గుఱిఅవుతున్నారు. మేము టమారాకు ఒకప్రక్కగా నిలిచి కొబ్బరిచెట్లచాటున జనం మఱుగుపడే వఱకూ అటువైపుచూస్తూనే ఉన్నాము. మఱికొంతసేపటికి కొబ్బరిచెట్లు కూడా అదృశ్యాలయినాయి. మేము 127 గురు మిత్రులనూ విడిచిపెట్టి పోవలసి వచ్చింది. వారి పాటలూ, మాటలూ మా చెవులలో ఇంకా మాఱుమ్రోగుతున్నాయి.

“మీరు ఇంకొక దూరభూమికి వెళ్ళేవఱకూ, మనం ఎల్లప్పుడూ ఒకటిగా ఉండదగినట్లు మా కష్టసుఖాలను పంచుకొంటారు. ఎంత సుదినం!”

నాలుగురోజులు గడిచేసరికి తహితీ ప్రత్యక్షమైనది. అది కొబ్బరిబొండాల వరుసలతో ముత్యాలు గ్రుచ్చినట్లు లేదు. ఆకాశాన్ని చుంబిస్తున్న నల్లని మహాపర్వతాలతో కనిపిస్తున్నది. ఆ పర్వతశిఖరాలమీద మేఘమండలం విశ్రమిస్తున్నట్లున్నది.

దగ్గఱవుతున్న కొద్దీ నల్లని పర్వతాలమధ్య ఆకుపచ్చని లోయలు కనబడుతున్నాయి. క్రమక్రమంగా పొలాలూ, తోటలూమాత్రమే ప్రత్యక్షమాతూ ఉంటే, వాటి హరిత వర్ణం నయనపర్వ మాతున్నది. అక్కడక్కడ నిక్కిన కొండల జేగురు వన్నెలున్నూ కానవస్తున్నవి. తీరం చేరువ అయ్యేసరికి, లోయలలో బాగా ఎదిగిన కొబ్బరిచెట్లు కనబడుతున్నాయి. తీరంపొడుగునా బంగారువన్నె నేల కనిపిస్తున్నది. అది అంతా ఒకప్పుడు అగ్నిపర్వతమయమైన భూమి. ఇప్పుడు కొండలు పూర్తిగా చల్లారిపోయాయి. విఱిగిపడ్డ కొండలు ద్వీపంచుట్టూ పెట్టనికోటమాదిరిగా ఉంటే, సముద్రం ద్వీపాన్ని కబళించకుండా సంరక్షిస్తున్నాయి.

ఒకనాటి ప్రభాతవేళను రెండు కొండల మధ్యఉన్న సందుద్వారా మేము "పపీటీ" రేవులో ప్రవేశించాము. మాకు ఎదురుగా చర్చి శిఖరాలూ, వాటి ఎఱ్ఱటి పైకప్పులూ కనిపిస్తున్నాయి. వాటికి ముందుగా ఉన్న మహావృక్షాలచేతనూ, కొబ్బరిచెట్ల అగ్రాలచేతనూ అవి కొంతకొంత మఱుగుపడుతున్నాయి. పపీటీ తహితీకి రాజధాని. ఫ్రెంచి ఆధిపత్యాన ఉన్న ద్వీపసముదాయంలో అది ఒక్కటే పట్టణం. అది చాలా

సుందరమైన నగరం, ప్రభుత్వానికి కేంద్రస్థానం. పసిఫిక్ మహా సముద్రంమీద జరిగే రాకపోకలకు కూడలికూడా.

మేము రేవులో ప్రవేశించగానే, తహితీప్రజలు రంగు రంగుల దుస్తులతో, సజీవకుడ్యంలాగా కనిపిస్తూ మా కోసం నిరీక్షిస్తున్నారు. తహితీలో మా ఆగమనవార్త గాలిలాగా వ్యాపించింది. అమెరికానుంచి వచ్చిన పాయ్-పాయ్‌ని చూడాలని అందఱూ ఉబలాట పడుతున్నారు.

తీరం పొడుగునా కోన్-టికీకి స్వాగత మర్యాదలు జరుగుతున్నాయి. పపీటీ మేయరు మాకు స్వాగతం ఇచ్చాడు. పాలినేషియన్ సంఘం పక్షాన ఒక చిన్న బాలిక తహితీలోని అడవిపూలతో కట్టిన పెద్ద మాలికఒకటి మాకు బహూకరించింది.

దక్షిణసముద్రంలో అమూల్యముక్తామణివంటి తహితీకి మమ్మల్ని ఆహ్వానిస్తున్నందుకు సూచనగా కొందఱు పడుచులు ముందఱికి వచ్చి పూలదండలతో మా కంఠాలను అలంకరించారు.

ఆ మహాజనసమూహంలో ఒకానొక వ్యక్తి ముఖాన్ని చూడాలని నేను ఆరాటపడుతున్నాను. ఆ వ్యక్తి తహితీలోని నా పెంపుడుతండ్రి. ఆయన ద్వీపంలోని 17 గురు పాలినేషియన్ నాయకులకు అధిపతి. ఆయన పేరు "టెఇఈరో."

చిరకాలం క్రిందట ఎంత ఉత్సాహంగా ఉండేవాడో; అంత ఉత్సాహంగానూ ఆ ఆజానుబాహువైన మహాపురుషుడు గుంపులోనుంచి గబగబా ముందుకువస్తూ, ముఖం అంతా

కన్నులు చేసికొని "ఒక్రై మెటీటా!" అని పిలుస్తున్నాడు. ఆయన యిప్పుడు బాగా వృద్ధుడైనాడు కానీ, ఆయనలోని ఆకర్షణీయమైన రాచఠీకపుఠీవిమాత్రం ఏ కొంచెమూ తగ్గలేదు.

ఆయన మమ్మల్ని చూచి, మందహాసం చేసి యిలా అన్నాడు. "మీరు రావటం ఆలస్యమైనా అద్భుతమైన కీర్తిలక్ష్మితోకూడా వచ్చారు. నిజం చెప్పాలంటే మీ పాయ్-పాయ్ తహీతీకి నీలాకాశాన్ని (ఒక్రై-మెటీటాను) తీసుకొని వచ్చింది. ఎందువల్లనంటే మా పూర్వులు ఎక్కడనుంచి యిక్కడకు వచ్చారో దీనిమూలాన విశదమౌతున్నది."

గవర్నరు భవనంలో మాకు స్వాగతమహోత్సవం జరిగింది. పురమందిరంలో విందు జరిగింది. ద్వీపంలోని మూలమూలలనుంచీ ఆహ్వానపరంపరలు వర్షించటం మొదలుపెట్టాయి.

పాపెనో లోయలో నాకు సుపరిచితమైన ఒత్తీరో గృహంలో యథాపూర్వంగా మాకు గొప్పవిందు జరిగింది. కాని రరోరియాకూ తహీతీకీ పోలికలేదు. తహీతీ వాఙ్మయోచితంగా మాకు నామకరణాలు జరిగాయి. అయితే ఈ పేర్లు ఇదివరకు ఎవరికీలేవు.

భాస్కరుని పసిడికాంతులలోనూ, ఆకాశవీథిలో పయనించే నీలిమబ్బుల క్రిందనూ స్వేచ్ఛగా కొన్నాళ్లు విహరించాము. సరస్సులో ఈదుతూ, పర్వతాగ్రాలకు ఎగబ్రాకుతూ, నారికేళవృక్షాలమధ్య హుల్యాలా నాట్యంచేస్తూ మహానందంగా కాలం గడిపాము. క్రమంగా రోజులూ,

నారాలూ గడిచాయి. మా స్వగృహాలకు మళ్ళీ మమ్మల్ని చేర్చే ఓడ వచ్చేటప్పటికి వారాలూ, నెలలూ గడిచినట్లని పించింది.

ఇంతలో నార్వేనుంచి ఒక వర్తమానం వచ్చింది. నాలుగు వేల టన్నుల బరువుగల "థోరై" ఓడను "సమోవా" నుంచి తహీతీకి వచ్చి మమ్మల్ని అమెరికాకు తీసికొని వెళ్ళవలసిందని "లార్స్ క్రిస్టెన్ సేన్" ఆజ్ఞ యిచ్చినట్లు తెలిసింది.

ఒక ఉషఃకాలంలో పపీటీ రేవులో నార్వే స్టీమరు ప్రత్యక్షమైంది. ఫ్రెంచి నావికదళం ఒకటి కోన్-టికీని ఆ స్టీమరుతో చేర్చింది. మేముకూడా స్టీమరు ఎక్కాము. నారికేళవనమయమైన ద్వీపంలో సైరన్ కూత ప్రతిధ్వనించింది. తహీతీలోని గోధూమవర్ణులూ (పాలినేషియనులు) శ్వేతవర్ణులూ మమ్మల్ని పరివేష్టించి రకరకాల బహుమతులూ, పుష్పమాలలూ మా మీద వర్షించారు; క్షణక్షణానికీ బరువౌతున్న పూలదండల ఒత్తిడినుంచి తలలు పైకెత్తటమే అసాధ్యమైంది.

మహానాయకుడు తెత్రీరో మమ్మల్ని ఉద్దేశించి వీడ్కోలు చెపుతూ ఇలా కేకవేశాడు. "మీరు మళ్ళీ ఎన్నడైనా తహీతీకి రాదలచుకొంటే, పడవ బయలుదేరగానే ఒక్కొక్కరు ఒక్కొక్క పూలదండ సరస్సులోకి విసరివేయండి!" ఆ కేక గాలితెరలలో సుదూరం పయనించింది.

స్టీమరును కట్టివేసిన త్రాళ్ళు ఊడదీశారు. ఇంజన్లు గర్జించాయి. నీటిని చీల్చుకొంటూ స్టీమరు ముందుకు సాగుతూ ఉంటే, మేము స్టీమరుప్రక్క నిలబడిఉన్నాము.

త్వరలోనే కొబ్బరిచెట్లతోపుల వెనుకపడి ఎఱ్ఱని గృహాగ్రాలు అదృశ్యాలైనాయి. నీలపర్వత పంక్తులమాటున కొబ్బరిచెట్లతోపులుకూడా గగనకుసుమాలైనాయి. మఱికొంతసేపటిలో ఆ పర్వతపంక్తులుకూడా పసిఫిక్ సముద్రంలో నీలరేఖామాత్రంగా కనిపిస్తూ అగోచరమైనాయి.

కజ్జలనీలమైన సాగరంలో వీచికలు నర్తించటం మొదలుపెట్టాయి. వ్యాపారపవనంతో పయనించే తెలిమబ్బులు నీలాకాశంమీద తేలియాడుతున్నాయి. మాప్రయాణం వెనుకటిమాదిరిగా లేదు. ప్రకృతిస్వరూపం సంపూర్ణంగా గమనించగలుగుతున్నాము. అతిదూరాన ఉన్న ఇరవయ్యోశతాబ్దపు ప్రపంచం వైపు పురోగమిస్తున్నాము.

అతిప్రియమైన బాల్సాదుంగల వెనుక మేము ఆఱుగురమూ ప్రాణాలతో నిలిచిఉన్నందుకు ఆనందిస్తూ స్టీమరు ప్రక్క నిలబడిఉన్నాము. తహీతీలోని సరస్సులో మేము విసరిన ఆఱుపూలదండలూ అలా తేలియాడుతూనే ఉన్నాయి.



# మరపురాని మహోజ్జ్వలమైన పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| సన్యాసి | (ఇలాచంద్ర జోషీ) | 7 | 50 |
| ప్రేతము-ఛాయ | ( ,, ) | 4 | 00 |
| కంటి మెరమెర | (రవీంద్రనాథ్ ఠాకూర్) | 4 | 50 |
| సునీత | (జైనేంద్రకుమార్) | 3 | 75 |
| సుఖద | ( ,, ) | 3 | 75 |
| కల్యాణి | ( ,, ) | 3 | 00 |
| రాజీనామా | ( ,, ) | 2 | 00 |
| నిర్మల | (ప్రేమ్‌చంద్) | 3 | 00 |
| సేవాసదనము | ( ,, ) | 3 | 00 |
| నారీజీవనము 1,2,3 భా. సెట్టు | ( ,, ) | 3 | 50 |
| ప్రేమపీఠం | ( ,, ) | 1 | 00 |
| మిత్రద్వయం | (విశ్వప్రసాద్) | 1 | 25 |
| ఆనందలహరి (ఆనందదాయకమైన పిల్లల నవల) | (విద్వాన్ చిన్నికృష్ణశర్మ) | 0 | 75 |
| భూప్రదక్షిణం (విజ్ఞానదాయకమైన పిల్లల నవల) | ( ,, ) | 0 | 75 |
| కడలిమీద కోన్-టికి | (థార్ హెయర్‌డాల్) | 2 | 50 |
| మహాత్మాగాంధీ | (విన్సెంట్ షీన్) | 3 | 00 |

త్వరలో! ఇంకా—ఇంకా...ఇంకా—ఇంకా...

పోస్టు ఖర్చులు అదనం. అడ్వాన్సు లేనిదే వి. పి లు పంపబడవు. రూ. 25/-లు మించిన విలువగల పుస్తకములు ఒకేసారి కొనువారికి ఖర్చులు ఉచితం.

ప్రకాశకులు:

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ.

# ఈ పుస్తకాలు మీరు చదివారా?

| | | |
|---|---|---|
| సునీత | (జైనేంద్రకుమార్) | 3 12 0 |
| సుఖద | ,, | 3 12 0 |
| కల్యాణి | ,, | 3 0 0 |
| రాజీనామా | ,, | 2 0 0 |
| వ్యతీతము | ,, | 3 8 0 |
| సన్యాసి | (ఇలాచంద్ర జోషీ) | 7 8 0 |
| ప్రేతము - ఛాయ | ,, | 4 0 0 |

ఇంకా చదవకపోయినట్లైతే తప్పక చదవండి. జైనేంద్ర కుమార్, ఇలాచంద్ర జోషీలు సుప్రసిద్ధులైన భారతీయ రచయితలు. వీరిని, వీరి రచనలను ఎందరెందరో ప్రముఖులు ఎన్నెన్నో విధాల కీర్తించారు. అన్ని పత్రికలు ప్రశంసించాయి. కాని ఆ ప్రశంసలన్నీ ఇక్కడ మేము యివ్వగోరడంలేదు. ఆ విషయాలన్నీ వారి పుస్తకాలలోనే మీరు చూడవచ్చు. అయితే ఒక్కవిషయంమాత్రం చెప్పగోరుతున్నాం—

వీరిద్దరూకూడా తెలుగుదేశానికి '(అంటే హిందీ సాహిత్యంతో తగినంత పరిచయం లేనివారికిమాత్రం) క్రొత్తవారే. వీరి రచనలలోగల విజ్ఞానం, వికాసం, నిత్యజీవితంలో వీరి సత్యసంశోధన మా పాఠకులకు అందజేయాలనే కాంక్షతో వీరి

రచనలు, తెలుగులో ప్రచురిస్తున్నాం. అనతికాలంలోనే వీరి మిగతా రచనలుకూడా మీకు అందించగలమనే ఆశిస్తున్నాం. అయితే, వీరిరువురి రచనలపట్ల మా పాఠకుల అభిప్రాయాలు కూడ తెలుసుకోవాలని మాకు చాల కుతూహలంగా ఉంది. దయవుంచి పాఠకులందరూకూడా జైనేంద్రకుమార్, ఇలా చంద్రజోషీల రచనలయెడల తమకు కలిగిన అభిప్రాయాలను మాకు తప్పక తెలియజేయవలసినదిగా ప్రార్థన.

ప్రకాశకులు :

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్

విజయవాడ.